మే-జూన్,2013 వెల : రూ.20/-

THE LARGEST CIRCULATED TELUGU EDUCATIONAL MONTHLY




# ఐక్య ఉపాధ్యాయ

ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ అధికార పత్రిక

## తిరుపతిలో విజయవంతమైన యుటియఫ్ 13వ రాష్ట్ర మహాసభలు

# యుటిఎఫ్ 13వ రాష్ట్ర మహాసభలు ప్రారంభ సభ


మహాసభను ప్రారంభిస్తున్న పార్లమెంట్ సభ్యులు సీతారాం ఏచూరి


ఉపన్యసిస్తున్న ప్రొ॥ కె. నాగేశ్వర్, ఎమ్మెల్సీ


ఆహ్వాన సంఘం అధ్యక్షోపన్యాసం వై. శ్రీనివాసులు రెడ్డి, ఎమ్మెల్సీ

## సందేశాలు


డి. రామిరెడ్డి, మాజీ ఎమ్మెల్సీ


సి.హెచ్. సుభాష్‌చంద్రబోస్


వి.గోపాలరెడ్డి, జెఎసి చైర్మన్


బి.ప్రతాపరెడ్డి, డిఇఒ, చిత్తూరు



హాజరైన ఉపాధ్యాయులు


సంక్షోభంలో విద్యారంగం పుస్తకావిష్కరణ


తిరుపతి పట్టణంలో భారీ ర్యాలీ

ఐక్య ఉపాధ్యాయ

విద్యా విషయక మాసపత్రిక

మే, జూన్ - 2013

సంపుటి-39 సంచిక : 5,6

సంపాదకవర్గం

సిహెచ్. రవి, ప్రధాన సంపాదకులు
ఎం. సంయుక్త
ఎన్. పురుషోత్తమరావు
టి.ఎస్.ఎల్.ఎన్. మల్లేశ్వరరావు
డా॥ ఏ. విద్యాదేవి

ఈ సంచికలో...



| | | |
|---|---|---|
| దశాబ్దిచందా | : | ₹ 850-00 |
| 5 సం॥ చందా | : | ₹ 450-00 |
| సం॥ చందా | : | ₹ 100-00 |
| విడిప్రతి | : | ₹ 10-00 |

SBI Online
A/c No. 30206957939

ఐక్య ఉపాధ్యాయ
గగన్‌మహల్ రోడ్ నం. 7
దోమల్‌గూడ, హైదరాబాద్-29
Ph.No. : 040-27636840
Fax. No. : 040-27650366
MobileNo. : 9490300573
Website : www.aputf.org.
E-mail : ikyopadhyaya@gmail.com

# మొక్కు 'బడి' సంబరాలు

బడి బయట ఉన్న పిల్లలందరినీ బడిలో చేర్పించాలని, 100శాతం విద్యార్థులను ప్రభుత్వ పాఠశాలల్లోనే నమోదు చేయించేందుకు కృషి చేయాలని, విద్యాశాఖతోపాటు ఇతర ప్రభుత్వ శాఖలు కూడా భాగస్వాములు కావాలని ప్రాథమిక విద్యామంత్రి చేసిన ప్రకటన ఆహ్వానించదగినదే. అందుకోసం 3 దశలుగా విద్యా సంబరాలు నిర్వహించాలని విద్యాశాఖ కార్యక్రమాలను రూపకల్పన చేసింది. జూన్ 1 నుండి 11 వరకు పది రోజులపాటు ప్రభుత్వ పాఠశాలల్లో లభించే సౌకర్యాలను ప్రచారం చేస్తూ విద్యార్థుల నమోదు క్యాంపెయిన్ నిర్వహించమన్నారు. ఫ్లెక్సీలు, బ్యానర్లు, కరపత్రాలు వేసి పంపిణీ చేయాలన్నారు. సంతోషం. గత కొద్ది సంవత్సరాలుగా ప్రభుత్వ పాఠశాలలు ప్రజల విశ్వాసాన్ని కోల్పోతున్నాయి. ప్రపంచీకరణ లో భాగంగా అమలు జరుగుతున్న సంస్కరణల ఫలితంగా విద్యా వ్యాపారం పెద్దయెత్తున విస్తరించింది. అందుకు ప్రభుత్వ విధానాలూ దోహదపడుతున్నాయి. ప్రైవేటు పాఠశాలల ప్రచార హోరు, ప్రభుత్వ నిర్వహణా వైఫల్యం కారణంగా భవిష్యత్తుపై కోటి ఆశలతో పిల్లలను ప్రైవేటు పాఠశాలల్లో చేర్పించటానికే తల్లిదండ్రులు మొగ్గు చూపుతున్నారు. తల్లిదండ్రుల మనస్తత్వాన్ని గమనించిన విద్యావ్యాపారులు తొలుత ఇంగ్లీషు మీడియం కాన్వెంట్లు, పబ్లిక్ స్కూళ్ళు ప్రారంభించారు. వ్యాపారంలో పోటీ పెరిగి కార్పొరేట్ శక్తులు ప్రవేశించాక పాఠశాలల పేర్లు మారిపోయాయి. తల్లిదండ్రులను ఆకర్షించడా నికి టెక్నో, డిజి కాన్సెప్ట్, ఐఐటి, ఏఐఎస్ వంటి ఆకర్షణీయమైన పదాలు పాఠశాలల పేర్లలో చేరిపోయాయి. తమ పిల్లలు 18 యేండ్ల తర్వాత ఏం కావాలని కోరుకుంటారో పుట్టినప్పుడే నిర్ణయించుకొని అందుకు తగిన పాఠశాలలో చేర్పించటానికి ఎంత ఖర్చునైనా భరించేలా పేరెంట్స్‌ను మానసికంగా సిద్ధం చేస్తున్నది కార్పొరేట్ విద్యా సంస్థల ప్రచారం.

ప్రైవేటు, కార్పొరేట్ పాఠశాలలు బోధనలో అనుసరిస్తున్న విధానం శాస్త్రీయంగా లేదని, పిల్లల వ్యక్తిత్వ వికాసానికి దోహద పడటం లేదని, రోజుకు 15,16 గంటలపాటు కూర్చోబెట్టి చదివించటం వలన ఆరోగ్య సమస్యలు వస్తున్నాయని, మానసికంగా వత్తిడికి గురౌతున్నారని వైద్యులు, మానసిక శాస్త్రవేత్తలు ఆందోళన చెందుతున్నారు. అనేక సర్వేలు కూడా వెల్లడిస్తున్నాయి. అయినా వీటిని ఉపాధ్యాయులతో సహా తల్లిదండ్రులెవరూ పట్టించుకోవడం లేదు. ఆర్థిక పరిస్థితి సహకరించక, అవకాశాలు లేక గత్యంతరం లేని స్థితిలో మాత్రమే ప్రభుత్వ పాఠశాలలకు పంపుతున్నారు. అయినా ఇంకా 60 శాతం పైగా పిల్లలకు ప్రభుత్వ పాఠశాలలే ఆధారం. బడుగు బలహీన వర్గాలు, ఆర్థికంగా పేదలు అత్యధికంగా చదివేది ప్రభుత్వ పాఠశాలల్లోనే. ఇటీవలికాలంలో ప్రైవేటు పాఠశాలల్లో నియంత్రణ లేని ఫీజుల మోతను భరించలేక కొందరు ప్రభుత్వ పాఠశాలలవైపు చూస్తున్నారు.

పిల్లలను బడిలో చేర్పించేందుకు ప్రభుత్వం ప్రతియేటా పాఠశాలలు ప్రారంభమైన తర్వాత బడిబాట, చదువుల పండుగ, విద్యా పక్షోత్సవాలు పేరిట కార్యక్రమాలను నిర్వహిస్తున్నది. ఈ కార్యక్రమాల వల్ల బడి పని దినాలు వృధానే తప్ప పెద్దగా ప్రయోజనం లేదని ఋజువైంది. ప్రైవేటు పాఠశాలలు వేసవి సెలవుల్లోనే విద్యార్థులను నమోదు చేసుకుంటున్నందున, వాటికి దీటుగా జూన్ 1 నుండే ప్రభుత్వ పాఠశాలల్లో విద్యార్థుల నమోదును ప్రారంభించాలని, ప్రభుత్వ విద్యారంగం విశిష్టతను వివరించి, నాణ్యమైన విద్యతోపాటు, పాఠ్య పుస్తకాలు, దుస్తులు, మధ్యాహ్న భోజనం వంటి సౌకర్యాలు ఉచితంగా అందిస్తామని ప్రజలకు వివరించి వారి పిల్లలను సర్కారు బడిలో చేర్పించేందుకు క్యాంపెయిన్ నిర్వహించాలని యుటీయఫ్‌తోపాటు మరికొన్ని ఉపాధ్యాయ సంఘాలు గత కొన్ని సంవత్సరాలుగా ప్రభుత్వానికి సూచించాయి. ఎట్టకేలకు ప్రభుత్వం అంగీకరించి ఈ సంవత్సరం "విద్యా సంబరాలు" పేరిట కార్యక్రమానికి రూపకల్పన చేసింది. అయితే ఆచరణలో ఆటంకాలు షరామామూలే!

గ్రామాల్లో తిరిగి తల్లిదండ్రులను ఒప్పించి పిల్లలను ప్రభుత్వ పాఠశాలల్లో చేర్పించాల్సింది ఉపాధ్యాయులు. విద్యా సంబరాలలో ఉపాధ్యాయుల భాగస్వామ్యం నిర్బంధమా? స్వచ్ఛందమా? అనే మీమాంస నెలకొన్నది. నిర్బంధమని అంటే కోల్పోయిన వేసవి సెలవులకు పరిహారంగా నిబంధనల ప్రకారం 6 రోజుల సంపాదిత సెలవు జమ చేయాల్సి వస్తుందని నిర్దిష్ట ఉత్తర్వులు యివ్వడానికి విద్యాశాఖ వెనుకాడింది. అయినా ప్రభుత్వ పాఠశాలలను రక్షించుకోవాలనే లక్ష్యంతో స్వచ్ఛందంగానైనా పాల్గొనటానికి చాలామంది ఉపాధ్యాయులు సిద్ధపడ్డారు. కానీ పాఠశాలలు తెరవగానే పాఠ్య పుస్తకాలిస్తారా? ఏకరూప దుస్తులు పంపిణీ చేస్తారా? మధ్యాహ్న భోజనం కాస్త నాణ్యంగా పెట్టించగలరా? అని తల్లిదండ్రులు ప్రశ్నిస్తే సమాధానం చెప్పే పరిస్థితి లేదు. ఉదాహరణకు ఈ సంవత్సరానికి 5.21 కోట్ల పాఠ్య పుస్తకాలు అవసరం కాగా, ఇప్పటివరకు ముద్రించబడినవి 2.5 కోట్లు. జిల్లాలకు పంపిణీ చేయబడినవి 1.25కోట్లు మాత్రమే. మరి పిల్లలందరికీ పుస్తకాలు ఎప్పటికందిస్తుంది ఈ ప్రభుత్వం? గత అనుభవాలను నుండైనా పాఠం నేర్చుకోకపోతే ఎలా? దుస్తుల సరఫరా కూడా ఇందుకు భిన్నంగా లేదు. పాఠశాలల్లో వసతి, మంచినీరు, మూత్రశాలలు వంటి మౌలిక సౌకర్యాల కొరత ఉండనే ఉంది. పదిమందిలోపు పిల్లలున్న పాఠశాలల విలీనం పేరుతో సుమారు 1200 పాఠశాలలు మూతవేశారు. ఉపాధ్యాయులను బదిలీ చేశారు. వీటిలో చదువుతున్న పిల్లలను సమీప పాఠశాలల్లో చేర్చి రవాణా సదుపాయం కల్పిస్తాం లేదంటే రవాణా చార్జీలు చెల్లిస్తామన్నారు. ఇది ఎప్పటికి అమలౌతుందో తెలీదు. విద్యాహక్కు చట్టాన్ని సక్రమంగా అమలు జరపకపోగా, ఆ చట్టం అమలు పేరిట ప్రభుత్వ పాఠశాలల మనుగడను దెబ్బతీసే విధంగా ప్రభుత్వం వ్యవహరిస్తూ ఎన్ని సంబరాలు చేసినా ఏం ప్రయోజనం వుంటుంది?

ప్రైవేటు విద్యా వ్యాపారం పిల్లల శారీరక, మానసిక ఎదుగుదలను దెబ్బతీస్తుందని తల్లిదండ్రులకు అర్థం కావాలి. ప్రభుత్వ పాఠశాలల్లోనే నాణ్యమైన విద్య లభిస్తుందనే నమ్మకం వారికి కలగాలి. తమ పిల్లలకు నాణ్యమైన విద్యను ఉచితంగా అందించాల్సిన బాధ్యత ప్రభుత్వానిదేనని గుర్తించాలి. అందుకోసం పాలకులను డిమాండ్ చేయాలి. అప్పుడే అన్ని రాజకీయ పక్షాల ఎన్నికల ఎజెండాలో ప్రభుత్వ విద్యా రక్షణ అంశానికి ప్రాధాన్యత లభిస్తుంది. విద్యారంగం వికసిస్తుంది. విద్యా వికాస ఉద్యమానికి సార్థకత చేకూరుతుంది.

## యుటియఫ్ రాష్ట్ర అధ్యక్షులు ఎ.నర్సిరెడ్డికి నల్లగొండలో ఘన స్వాగతం

తిరుపతిలో జరిగిన యుటియఫ్ రాష్ట్ర 13వ మహాసభలలో యుటియఫ్ రాష్ట్ర అధ్యక్షులుగా ఎన్నికై జిల్లా కేంద్రానికి వచ్చిన ఎ.నర్సిరెడ్డికి యుటియఫ్ జిల్లాశాఖ ఘన స్వాగతం పలికింది. రైల్వేస్టేషన్ నుండి పెద్ద సంఖ్యలో కార్యకర్తలు బైక్‌ర్యాలీగా యుటియఫ్ జిల్లా కార్యాలయం వరకు ఆయనను తోడ్కొని వచ్చారు. జిల్లా కార్యాలయంలో ఏర్పాటు చేసిన కార్యక్రమములో రాష్ట్ర అధ్యక్షులు ఎ.నర్సిరెడ్డి మాట్లాడుతూ ప్రభుత్వ విద్యారంగాన్ని కాపాడటానికి, ఉపాధ్యాయుల సమస్యల కోసం మెరుగైన పిఆర్‌సి కోసం తాను శక్తి మేరకు కృషి చేస్తానని, తనను సాధారణ కార్యకర్త నుండి రాష్ట్ర అధ్యక్షునిగా రావటానికి తోడ్పడ్డ నల్లగొండ జిల్లా ఉద్యమానికి, కార్యకర్తలకు కృతజ్ఞతలు తెలిపారు. ఈ కార్యక్రమములో రాష్ట్ర కార్యవర్గ సభ్యులు పోలె వెంకటయ్య జిల్లాకోశాధికారి వై.సైదులు, జె.వి.వి.జిల్లా ప్రధాన కార్యదర్శి వి.జగదీష్‌బాబు మురళయ్య, సుధాకర్, ప్రభాకర్, సోమయ్య, చంద్రశేఖర్ రావు, శేఖర్‌రెడ్డి, అంజిరెడ్డి నర్సిరెడ్డి, నర్సింహరావు, జిల్లా సీనియర్ నాయకులు పి.విద్యా సాగర్‌రెడ్డి వివిధ మండలాల బాధ్యులు పాల్గొన్నారు.

## శశాంకకు యుటియఫ్ అభినందనలు

యుటియఫ్ సీనియర్ నాయకురాలు ఎం.సంయుక్త కుమారుడు, ఎయిడెడ్ పాఠశాలలో చదివి ఐఏఎస్ ఏ.పి.టాపర్‌గా నిలిచిన కొండూరు శశాంకను యుటియఫ్ రాష్ట్ర కమిటీ ఘనంగా అభినందించింది. మే 9న చెన్నుపాటి భవన్‌లో యుటియఫ్ రాష్ట్ర అధ్యక్షులు ఎ.నర్సిరెడ్డి అధ్యక్షతన అభినందన సభ నిర్వహించారు. విద్యావేత్త చుక్కారామయ్య ముఖ్య అతిథిగా హాజరై మాట్లాడుతూ శశాంక విజయం ప్రభుత్వ విద్యారంగ విజయంగా అభివర్ణించారు. ప్రభుత్వ, ఎయిడెడ్ పాఠశాలల్లో చదివే విద్యార్థులకే వ్యక్తిత్వం వికసించడానికి, సామాజిక అవగాహనకు మెరుగైన అవకాశాలుంటాయన్నారు. ఐఏఎస్ అధికారుల్లో దివంగత ఎస్ఆర్ శంకరన్ వంటి వారిని ఆదర్శంగా తీసుకోవాలని సూచించారు. ఎమ్మెల్సీలు కె.నాగేశ్వర్, వి.బాలసుబ్రహ్మణ్యం, వై.శ్రీనివాసులురెడ్డిలు మాట్లాడుతూ ఐఏఎస్ అధికారిగా శశాంక పేద ప్రజల సంక్షేమానికి నిజాయితీగా పని చేయాలని సూచించారు. రాష్ట్ర గౌరవాధ్యక్షులు ఎన్.నారాయణ, ప్రధానకార్యదర్శి ఐ.వెంకటేశ్వరరావు, కోశాధికారి పి.మాణిక్‌రెడ్డి, కార్యదర్శి సిహెచ్.రవి సీనియర్ నాయకులు సిహెచ్.సుభాష్‌చంద్రబోస్, ఎం.నరహరి, వివేకానంద హైస్కూల్ ప్రధానోపాధ్యాయులు కె.లక్ష్మణరావు, తల్లిదండ్రులు కె.వెంకటయ్య, ఎం.సంయుక్త తదితరులు మాట్లాడారు. అనంతరం శశాంక మాట్లాడుతూ తన కుటుంబ నేపథ్యం, పెరిగిన వాతావరణం సామాజిక అవగాహనకు దోహద పడ్డాయని, సమాజానికి సేవ చేయాలన్న లక్ష్యంతోనే సివిల్ సర్వీసెస్ వైపు వచ్చానని, పెద్దల ఆశీస్సుల మేరకు నిజాయితీగా పనిచేస్తానని తెలిపారు. తొలుత యుటియఫ్ రాష్ట్ర కమిటీ పక్షాన అభినందన జ్ఞాపికను శశాంకకు అందజేశారు.

ఈ కార్యక్రమంలో సీనియర్ నాయకులు ఎం.ఏ.కె.దత్తు, హైదరాబాద్ జిల్లా అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు ఎస్.వై.కొండలరావు, మేడె దేవదాస్, రంగారెడ్డి జిల్లా ప్రధాన కార్యదర్శి ఎం.ఆంజనేయులు తదితరులు పాల్గొన్నారు.

## అర్హతల్లేని టీచర్లతో దేశ భవితకు ముప్పు

ప్రాథమిక పాఠశాలల్లో తగిన అర్హతలు లేని వారిని ఉపాధ్యాయులుగా నియమించడాన్ని సుప్రీంకోర్టు తప్పు బట్టింది. ఇలాంటి విధానాలతో విద్యావ్యవస్థ, దేశ భవిష్యత్ నాశనం అవుతున్నాయని వ్యాఖ్యానించింది. విద్యాహక్కు చట్టాన్ని అమలు చేశాక కూడా ఇలాంటి విధానాలను పాటించటం దిగ్భ్రాంతికి గురి చేసిందని ధర్మాసనం పేర్కొంది. విద్యా సహాయక్ పేరిట ప్రాథమిక స్కూళ్ళలో నియామకాల మీద గుజరాత్ ప్రభుత్వం దాఖలు చేసిన ఓ పిటిషన్‌పై విచారణ సందర్భంగా మే 20వ తేదీన ఈ వ్యాఖ్యలు చేసింది. రెగ్యులర్ టీచర్లకిచ్చే జీతంలో నాలుగోవంతు మాత్రమే ఇస్తూ కొన్ని రాష్ట్రాలు కాంట్రాక్ట్ విధానంలో శిక్షా సహాయక్ (ఆంధ్రప్రదేశ్‌లో విద్యావలంటీర్లు)లను నియమిస్తున్నాయి. దీన్ని సుప్రీం కోర్టు తీవ్రంగా పరిగణించింది. దేశ భవిష్యత్‌ను నాశనం చేసే హక్కు ఏ పాలక వ్యవస్థకు లేదు. ఉపాధ్యాయులకు ఉండాల్సిన అర్హతలను మేము తెలుసుకోవాలను కుంటున్నాం అని సుప్రీం కోర్టు ధర్మాసనం పేర్కొంది.

ఉత్తరప్రదేశ్‌లో కూడ ఇలాంటి నియామకాలు జరిగాయి. వారంతా శిక్షా సహాయక్‌లు కాదు, శిక్షా శత్రువులు అని ధర్మాసనం తీవ్ర వ్యాఖ్యలు చేసింది. ఈ విధానంలో చేపట్టిన నియామకాల వివరాలను అందించాలని గుజరాత్ ప్రభుత్వాన్ని ఆదేశించింది.

**కొత్త పుస్తకాలు**

## సంక్షోభంలో విద్యారంగం




ఈ పుస్తకం వెల ఇరవై రూపాయలే. కానీ ఇందులోని విషయాలు ఎంతో విలువైనవి. వివిధ దేశాల్లో ప్రభుత్వ విద్యారంగం దివాళా తీస్తూ, ప్రైవేట్ విద్యా వ్యాపారం విస్తరిస్తున్న తీరుతెన్నులు, ప్రతిఘటనా ఉద్యమాలు సమీక్షించబడినవి. ప్రముఖ పాత్రికేయులు ఎం.కోటేశ్వరరావు వ్రాసిన యీ పుస్తకానికి ఎంఎల్‌సీ వి.బాల సుబ్రహ్మణ్యం వ్రాసిన ఉపోద్ఘాతం ఎంతో విజ్ఞానదాయకంగా వున్నది. ఉపాధ్యాయ ఉద్యమ కార్యకర్తలు, విద్యారంగ శ్రేయోభిలాషులు తప్పనిసరిగా చదవాల్సిన పుస్తకం.

2. 10వ పీఆర్‌సీకి యుటియఫ్ సమర్పించిన ప్రతిపాదనల పుస్తకాలు సిద్ధంగా వున్నాయి. వెల రూ.10/-లు మాత్రమే. యుటియఫ్ కార్యకర్తలు, ఉద్యోగ సంఘాల నాయకులకు ఎంతో ఉపయోగపడుతుంది.

ఈ పుస్తకాలు కావాల్సిన వారు **ఐక్య ఉపాధ్యాయ ప్రచురణలు** పేరుతో డిడి తీసి లేదా ఎంఓ ద్వారా డబ్బు పంపించి పుస్తకాలు తెప్పించుకోగలరు.

**అడ్రస్ : 1-2-288/8, యుటియఫ్ ఆఫీస్, దోమల్‌గూడ, హైదరాబాద్ 500029. సెల్:9490300569.**

## ప్రభుత్వ విద్యా ఉత్సవాలు

# ఆదేశాలకు ఎక్కువ ఆచరణకు తక్కువ!

విద్యా సంవత్సరం ప్రారంభంలో చేపట్టాల్సిన కార్యక్రమాలు గురించి రాజీవ్ విద్యా మిషన్ (ఎస్ఎస్ఏ) వారు షరా మాములుగా మరోసారి ఉత్తర్వులు యిచ్చారు. అయితే ఈ సారి 3దశల ప్రణాళిక, రోజువారి కార్యక్రమాలు, ఫారాలు, పత్రాలతో కూడిన 42 రకాల ఆదేశాలు యిచ్చారు. ఇవన్నీ చూస్తుంటే ఈ సారి ప్రభుత్వం నిర్వహించే విద్యా ఉత్సవాలు ఆదేశాలకు ఎక్కువ ఆచరణకు తక్కువ అనిపిస్తోంది.

సాధారణంగా జూన్12 నుండి విద్యా సంవత్సరం ప్రారంభం అవుతుంది. ఆరోజు నుండే పాఠశాలల్లో విద్యార్థుల ప్రవేశాలు జరుగుతుంటాయి. కానీ ఈ సారి జూన్ 1 నుండే విద్యార్థుల నమోదు కార్యక్రమం చేపట్టాలని, అందుకు అవసరమైన సమావేశాలు, సన్నాహక చర్యలను మొదటి దశ కార్యక్రమంగా నిర్వహించాలని పేర్కొనబడింది. ప్రైవేట్ పాఠశాలల పోటీని తట్టుకోవడం కోసం జూన్ 1 నుండి ప్రభుత్వ పాఠశాలల్లో విద్యార్థుల్ని చేర్చుకోవాలనే పథకాన్ని ఉపాధ్యాయ సంఘాలు స్వాగతించాయి. అంతటితోనే బడిఈడుగల బాలలందరూ సర్కార్ బళ్లలో చేరిపోతారని ఆశించలేము. దీనితోపాటు ఉచితంగా చదువు చెప్పే సర్కారు బడిని కాదని ఫీజులు కట్టి ప్రైవేట్ స్కూళ్లకి పోతున్న కారణాలను పరిశీలించి తగిన చర్యలు తీసుకోవటానికి ప్రభుత్వం పూనుకోవాలి. ఆ మాటకొస్తే ప్రైవేట్ స్కూళ్లు మార్చి / ఏప్రిల్ నుండి అంతకంటే ముందుగానే ప్రవేశాలు ప్రారంభిస్తున్నాయి. కనుక ప్రైవేట్ స్కూళ్లకు పగ్గాలు వేయకుండా ప్రభుత్వ పాఠశాలల్ని వరుగెత్తించి గెలవాలనుకోవటం అత్యాశే అవుతుంది.



నాగటి నారాయణ
యుటీయఫ్ రాష్ట్ర గౌ॥అధ్యక్షులు

రెండోదశ కార్యక్రమంగా జూన్ 12 నుండి 20దాకా రోజుకో కార్యక్రమాన్ని ప్రకటించారు. సామూహిక అక్షరాభ్యాసం, విద్యాహక్కు దినం, తెలుగు భాషా వికాస దినోత్సవం, బాలికావిద్య, నాణ్యమైన విద్య, పాఠశాల యాజమాన్య కమిటీ (ఎస్ఎంసి) దినోత్సవం, మధ్యాహ్నభోజన దినోత్సవం, ప్రత్యేక అవసరాలు గల బాలల దినోత్సవం అనే విన్యాసాలు పేర్కొన్నారు. కానీ అసలు విషయం పాఠ్యపుస్తకాలు, బట్టలు గురించి మాత్రం చెప్పలేదు. అవి ఎప్పుడు వస్తాయో, ఎన్ని వస్తాయో అధికారులకూ తెలియదు. జూన్ నెలాఖరుకి పాఠ్యపుస్తకాలు యివ్వగలమని ప్రాథమిక విద్యాశాఖామాత్యులు మే 29న సెలవిచ్చారు. అప్పటికైనా అందరికీ అన్ని రకాల పుస్తకాలు యిస్తామని చెప్పలేదు. ఈ లోపాన్ని కప్పిపుచ్చుకోవటానికి పాఠశాలల ప్రారంభంలో పదిరోజుల పాటు పాత తరగతి పాఠ్యాంశాల సమీక్షా పాఠాలు బోధించాలనే కాలక్షేప కార్యక్రమాన్ని ప్రకటించారు. ప్రైవేట్ స్కూళ్లలో రాబోయే సంవత్సరం పాఠాలు చెబుతుంటే ప్రభుత్వ పాఠశాలల్లో గతేడాది పాఠాలు వల్లెవేస్తుంటే యింక విద్యార్థులు ఎందుకుంటారు? జూన్ 1 నుండి ప్రయాసకోర్చి పిల్లల్ని చేర్పించినా పుస్తకాలు లేకపోవడం వలన కూడా ప్రైవేట్ స్కూళ్లకి పరుగు తీసే పరిస్థితి దాపురిస్తుంది. మరోవైపు మాధ్యమిక విద్యాశాఖా మాత్యులు డిఎస్సి 2013 ద్వారా కొత్త టీచర్ల నియామకాలు వచ్చే నవంబర్ లేదా డిసెంబర్‌లో నిర్వహిస్తామంటూ ప్రకటనలు చేస్తున్నారు. అంటే వచ్చే విద్యా సంవత్సరమంతా 30వేల ఖాళీ పోస్టులు ఖాళీగానే వుండిపోతాయన్న మాట. ఇక నుండి విద్యావాలంటీర్‌లను వినియోగించుకునే అవకాశము లేదు. కాగా గత మే నెలలో బదిలీ అయి రిలీవ్ కాలేకపోయిన వేలా మంది ఉపాధ్యాయులు మానసిక వేదనతో కుమిలిపోతూ కాలక్షేపం చేస్తుంటారు. ఇలాంటి పరిస్థితుల్లో ప్రభుత్వ పాఠశాలల్లో చదువెలా వస్తుంది? చదువు సంగతి ఎట్లున్నా రెండు జతల బట్టలకోసమైనా సర్కారు బడికి వచ్చే నిరుపేద విద్యార్థులకు యీసారి అదీ అడియాశే అవుతోంది. గతేడాది బడి మూసే రోజుల్లో బట్టలు యిచ్చారు. ఈ సారి అంతకంటే ముందు యిస్తారనే నమ్మకమూ లేదు. దుస్తుల తయారీ బాధ్యతను ఆప్కోకి అప్పగించనున్నట్లు మంత్రి శైలజానాథ్‌గారు మే 29న పత్రికల వారికి చెప్పారు.

ఇక మూడో దశ కార్యక్రమంగా జూన్ నెల చివరి వారంలో వరంగల్, హైదరాబాద్, చిత్తూరు, కాకినాడ, గుంటూరు కేంద్రాల్లో ప్రాంతీయ విద్యా సదస్సులు మరియు సంబరాలు నిర్వహిస్తారట. ఆ సదస్సుల్లో చేసే సమీక్షల్లో సహజంగానే ఎంతోకొంత ఫలితం వస్తే ప్రభుత్వ ఖాతాలో వేసుకొని వైఫల్యాలకు ఉపాధ్యాయులను నిందించే కార్యక్రమం యదాతథంగా వుంటుంది. జూన్ ఒకటి నుండి నిర్వహించే సన్నాహక కార్యక్రమాల్లో ఉపాధ్యాయులు విధిగా పాల్గొనాలా లేదా అనే విషయంలో అధికారులు స్పష్టం చేయలేకపోయారు. విధిగా పాల్గొనాలని ఆదేశిస్తే ఉపాధ్యాయులు సంపాదిత సెలవులు అడుగుతారనేది సర్కారు సందేహం. ఉపాధ్యాయులు ఉత్సాహంగా పాల్గొనకపోతే కార్యక్రమం విజయవంతం కాదు. కనీస వసతులతో పాఠశాలల్లో ఎకడమిక్ వాతావరణం లేక, తగినంత మంది ఉపాధ్యాయులు లేక, బడి తెరిచిన రోజే పుస్తకాలు, బట్టలు యివ్వలేక, మధ్యాహ్న భోజనం కూడా పెట్టలేక పోయినంతకాలం ప్రభుత్వ పాఠశాలలకు పేద వర్గాల పిల్లలు కూడా వచ్చే అవకాశం లేదు. ఇలాంటి అసలు సమస్యలు పట్టించుకోకుండా మొక్కుబడి ఉత్సవాలు ఎన్ని నిర్వహించినా ఒరిగేదేమీ లేదు.

**ఆత్మశుద్ధిలేని ఆచారమదియేల**
**భాండశుద్ధిలేని పాకమేల**
**చిత్తశద్ధిలేని శివపూజలేలరా**
**విశ్వదాభిరామ వినురవేమా!**

అన్నట్లు యిలాంటి అసమర్ధ చర్యలతో, కాలక్షేప కార్యక్రమాలతో ప్రభుత్వ పాఠశాలలు మరింత పతనమవుతాయి. ఫలితంగా బడుగు వర్గాల పిల్లలకు ప్రాథమిక విద్య కూడా దక్కదు, ప్రైవేట్ విద్యా వ్యాపారం మరింత రెచ్చిపోతుంది. ఈ పరిస్థితిని నివారించటానికి విశాలమైన విద్యా వికాస ఉద్యమం విస్తరించాలి. అందుకు తల్లిదండ్రులు, విద్యారంగ శ్రేయోభిలాషులు పూనుకోవాలి. విద్యాహక్కు చట్టం, ఆర్ఎంఎస్ఏ పథకం, కంప్యూటర్ పరిజ్ఞానం తదితర పథకాలను, విద్యారంగానికి కేటాయిస్తున్న బడ్జెట్‌లను వినియోగించి ప్రభుత్వ పాఠశాలలకు సకల సదుపాయాలు కల్పించి అందరికీ సమానమైన, నాణ్యమైన విద్యను అందించాలనే డిమాండ్‌పైన ఉద్యమించాలి. కాగితాలకే పరిమితమవుతున్న స్కూల్ మేనేజిమెంట్ కమిటీ (ఎస్ఎంసి)లు క్రియాశీలకం కావాలి. తల్లిదండ్రులు జోక్యం చేసుకొని పాఠశాలల అభివృద్ధికి ప్రభుత్వంపైన వత్తిడి పెంచాలి.

# ప్రాథమిక విద్యలో
# 8 కోట్ల డ్రాపవుట్లు

పాఠశాల ముఖం కూడా చూడని బాలలు దాదాపు 80లక్షలమంది ఉండగా, ప్రాథమిక విద్య కూడా పూర్తి చేయకుండానే డ్రాపౌట్ అవుతున్న వారు 8 కోట్లమంది ఉన్నట్లు ఐక్యరాజ్య సమితి బాలల నిధి (యునిసెఫ్) పేర్కొంది. దీన్ని జాతీయ అత్యవసర పరిస్థితిగా యునిసెఫ్ అభివర్ణించింది. ఉచిత, నిర్బంధ విద్య చట్టం 2009 బాలలకు కల్పించిన హక్కును అమలు పరిచేందుకు తగిన చర్యలు తీసుకోవాల్సిందిగా ప్రభుత్వానికి, పౌర సమాజానికి పిలుపునిచ్చింది. 'గత మూడేళ్ళుగా ఈ చట్టం అమలులో కొంత పురోగతి వుంది. అయినా డ్రాపౌట్లు కొనసాగుతూనే ఉన్నాయి. పనిచేసే ఉద్దేశంతో గాక వారు పాఠశాలల్లో ఏమీ నేర్చుకోనందునే డ్రాపవుట్లు కొనసాగుతున్నాయి' అని భారత్‌లో యునిసెఫ్ ప్రతినిధి లూయిస్-జార్జెస్ ఆర్సనాల్ట్ వ్యాఖ్యానించారు. ఇటీవల ఢిల్లీలో 'ఆర్‌టిఇ (విద్యాహక్కు చట్టం) అమలులో పురోగతి' పై జరిగిన మీడియా రౌండ్‌టేబుల్ సమావేశంలో ఆయన ఈ విషయం తెలిపారు. కఠోర దండన, వివక్ష అనేవి వాస్తవాలని అన్నారు. 'అత్యవసర ప్రాతిపదికన ఈ అంశంపై చర్యలు తీసుకోవాల్సి వుంది. దాన్ని ఏదో మామూలు విషయంలా చేస్తే ఫలితముండదు'.

నేషనల్ యూనివర్శిటీ ఆఫ్ ఎడ్యుకేషనల్ ప్లానింగ్ అండ్ అడ్మినిస్ట్రేషన్ వైస్ ఛాన్సలర్ ప్రొఫెసర్ ఆర్ గోవిందా మాట్లాడుతూ, గత మూడేళ్ళ కాలంలో 1.12 కోట్లమంది బాలలు పాఠశాలల్లో పేర్లు నమోదు చేసుకున్నారని చెప్పారు. ఈ పేర్ల నమోదు కార్యక్రమంలో సామాజిక వర్గాలు లేదా గ్రూపుల వారీగా చూస్తే లింగ అసమానతలు తగ్గాయని చెప్పారు. అయితే అంతమాత్రాన డ్రాపౌట్ల రేటును గణనీయంగా అదుపు చేయడానికి లేదా తగ్గించడానికి ఇది ఏ రకంగానూ దోహదపడలేదన్నారు. ప్రాథమిక స్థాయిలో ఇది 27 శాతానికి, ఎలిమెంటరీ స్థాయిలో 41 శాతానికి దిగజారిందన్నారు. అంతకన్నా అధ్వాన్నమేమంటే 13 శాతం మంది విద్యార్థులు ప్రాథమిక విద్య నుంచి అప్పర్ ప్రైమరీ స్థాయికి చేరుకోవడం లేదన్నారు. ఇకపోతే వలస కార్మికుల బిడ్డలకు, అలాగే ఒకసారి బ్రిడ్జి కోర్సులను ప్రవేశ పెట్టినప్పటికీ వాస్తవికంగా చూస్తే అవి వారికి అందుబాటులోకి రాలేదు. ఇంకా విద్యార్థి- ఉపాధ్యాయ నిష్పత్తి (పిటిఆర్)ని చూస్తే 2011-12, 2012-13 విద్యా సంవత్సరాల్లో పలు రాష్ట్రాల్లో సగటు పిటిఆర్‌గా బాగా మెరుగుపడిందని, అదే సమయంలో అధ్వాన్నమైన పిటిఆర్ కలిగిన స్కూళ్ళ శాతం కూడా చాలా ఎక్కువగా ఉందని ప్రొఫెసర్ గోవిందా చెప్పారు. అంటే, దీన్ని బట్టి చూస్తే అర్హత కలిగిన, మరింత శిక్షణ పొందిన టీచర్ల నియామకంతో పాటు ఇంకా టీచర్ల సంఖ్యను పెంచడం కూడా అవసరమని, అప్పుడు ఫలితాలు కూడా మరింత మెరుగుపడేందుకు అవకాశముంటుందని ఆయన అభిప్రాయపడ్డారు.

## పేలవమైన బోధన, ఫలితాలు

రానున్న రెండేళ్ళలో మంచి నాణ్యమైన విద్యనందించే ఉపాధ్యాయులను నియమించడం, తరగతి గదుల్లో బోధన, సమర్థవంతమైన రీతిలో పాఠశాల పనిచేసే తీరు, మెరుగైన స్కూలు యాజమాన్యం వంటి వాటిపై అసలు కసరత్తు జరగాల్సి ఉంది. పేలవమైన స్కూలింగ్, బోధనా తీరు కారణంగా పేలవమైన ఫలితాలు వస్తున్నాయని, అందువల్ల బోధనా వ్యవస్థను మరింత పటిష్టం చేయడం, బోధనా తీరును, నాణ్యతను మరింత మెరుగుపరచడం పై ప్రధానంగా దృష్టి పెట్టాల్సి వుంది. త్రాగు నీరు, పారిశుధ్యానికి సంబంధించి చాలా వరకు సాధించినప్పటికీ, వికలాంగులైన పిల్లలకు ఎంతో అవసరమైన ర్యాంప్ వంటి ప్రాథమిక సౌకర్యాలు అనేక స్కూళ్ళలో కొరవడుతున్నాయని అన్నారు. వాటి సాధన కోసం కృషి చేయాల్సి వుందన్నారు. జాతీయ బాలల హక్కుల పరిరక్షణ కమీషన్ చైర్‌పర్సన్ శాంతా సిన్హా మాట్లాడుతూ, తమ కమిటీ దాదాపు 300 జిల్లాల్లో సర్వే చేసిందని, 37 శాతం స్కూళ్ళలో తెలుగు, ఇంగ్లీషు, హిందీ వంటి భాషలను బోధించే ఉపాధ్యాయులే లేరని తేలిందని తెలిపారు. సాంఘిక శాస్త్రం బోధించే ఉపాధ్యాయులు 31 శాతం స్కూళ్ళలో లేరని, గణితం, సైన్స్ టీచర్లు లేని పాఠశాలలు 29 శాతం ఉన్నాయని చెప్పారు.

ఆర్‌టిఇ పరిధిలోకి ప్రీ స్కూల్‌ను కూడా తీసుకురావాలని శాంతా సిన్హా సూచించారు. అలాగే మరింత మెరుగైన ఫలితాల కోసం 12వ తరగతి వరకూ ఈ చట్టాన్ని విస్తరింపజేయాలన్నారు.

- ప్రజాశక్తి, ది హిందూ సౌజన్యంతో

## ఎస్ఎస్‌సి పరీక్షల్లో మంచి ఫలితాలు సాధించిన ఉపాధ్యాయులకు యుటియఫ్ అభినందనలు

గత మార్చిలో జరిగిన ఎస్ఎస్‌సి పబ్లిక్ పరీక్షల్లో మంచి ఫలితాలు సాధించిన ఉపాధ్యాయులకు ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ (యుటియఫ్) రాష్ట్ర కమిటీ అభినందనలు తెలియజేస్తోంది. గత సంవత్సరం కంటే 0.24% అదనంగా ఈసారి 88.08% ఫలితాలు సాధించటం చాలా గొప్ప విషయమని. 4326 హైస్కూళ్లలో నూరు శాతం ఫలితాలు సాధించటం మరింత అభినందనీయమనీ ప్రభుత్వరంగ పాఠశాలల్లో సాధించిన అద్భుతమైన విజయాల గురించి విస్తృతంగా ప్రచారం చేయాలని ఉపాధ్యాయులు, అధికారులు, ప్రభుత్వాన్ని. ప్రతి హైస్కూలూ కరపత్రాలు వేసి తమ పరిధిలోని గ్రామాలు, వార్డుల్లో పంచాలని. తల్లిదండ్రులకు వివరించాలని, ప్రాథమిక పాఠశాలల్లో 5వ తరగతి పూర్తి చేసిన విద్యార్థులు, ప్రాథమికోన్నత పాఠశాలల్లో 7వ తరగతి పూర్తి చేసిన విద్యార్థులను దగ్గరలో గల ప్రభుత్వ, జిల్లా పరిషత్, మున్సిపల్, ఎయిడెడ్ హైస్కూళ్లలో చేర్పించటానికి ఉపాధ్యాయులు బృందాలుగా పర్యటించాలని. జిల్లా, డివిజన్ కేంద్రాల్లో అభినందన సభలు నిర్వహించి ఉపాధ్యాయులు, విద్యార్థులు, తల్లిదండ్రులు, అధికారులు, ప్రజాప్రతినిధులను భాగస్వాములను చేయాలని యుటియఫ్ జిల్లా, మండల శాఖలకు రాష్ట్ర కమిటీ పిలుపునిచ్చింది.

# సుడిగుండంలో

# విద్యారంగం



వి.బాలసుబ్రహ్మణ్యం
ఎమ్మెల్సీ

విద్యారంగం ప్రపంచ వ్యాప్తంగా గతంలో ఎన్నడూ లేని సవాళ్ళని ఎదుర్కొంటోంది. మన దేశంలో జరుగుతున్న పరిణామాలు వీటికి ప్రతిరూపాలే తప్ప ఒంటరిగా ఊడి పడ్డవేమీ కాదు. మొత్తంగా దీన్ని చూడాలే తప్ప ముక్కలుగా చూస్తే ముళ్ళ పొద చుట్టూ తిరుగుతున్నట్లే వుంటుంది. ఊహించడానికి వీల్లేనంత వేగంగా ఇప్పుడు ముసురుకొస్తున్న పరిణామాలేవి?

ఒకటి - సామాజిక అజండాలోకి విద్య గతంలో ఎన్నడూ రానంత తీవ్రంగా వచ్చింది. రాజకీయంగానూ దీన్ని దాటవెయ్యడం సాధ్యంగాని యుగంలో మనమున్నాం. 100 కోట్లమంది నిరక్షరాస్యులున్న మాట వాస్తవమే కాని దాదాపు 70 శాతం పిల్లలు ప్రాథమిక విద్య పూర్తి చేసి సెకండరీ విద్యలోకి ప్రవేశిస్తున్న మాట కూడా అంతే వాస్తవం. ఓ వైపు పేదరికం కొత్త రూపాల్లో కుంగతీస్తున్నా పిల్లల చదువు కోసం తల్లిదండ్రులు ఎంతటి త్యాగాలకైనా సిద్ధపడుతున్నారు. జీవితంలో విద్య ఒక ప్రాథమిక అవసరంగా మారింది. అలాగే పెరుగుతున్న మధ్య తరగతి వర్గం, పట్టణీకరణ కూడా విద్యారంగం మీద తీవ్రమైన ఒత్తిడిని పెంచుతున్నాయి. ప్రపంచ మార్కెట్‌కు తగిన విద్య కావాలనే డిమాండు నివి ముందుకు తెస్తున్నాయి. ఆర్థికంగా తారా స్థాయికి చేరుతున్న అసమానతలు అదే మోతాదులో విద్యారంగంలోనూ అసమానతల్ని పెంచి పోషిస్తున్నాయి. ఇదొక సంక్లిష్ట సందర్భం. జనం తమకు చదువు కావాలని డిమాండు చేసే స్థితికి వచ్చినప్పుడు ప్రభుత్వం దానికి దూరం దూరంగా జరగడం ఇందులోని విచిత్రమైన వైరుధ్యం.

19వ శతాబ్దంలో యూరపులోనూ, అమెరికాలోనూ, 20 శతాబ్ది ప్రథమార్థంలో సోషలిస్టు దేశాల్లోనూ వలస విముక్తి పొందిన వర్ధమాన దేశాల్లోనూ ఒక ప్రజాస్వామిక హక్కుగా విద్య ముందుకొచ్చింది. ఓ వైపు పారిశ్రామిక విప్లవం, మరోవైపు ప్రజాస్వామిక విప్లవాలూ జమిలిగా ప్రపంచాన్ని ఓ ఊపుఊపిన కాలమది. 'అందరికీ విద్య', 'ప్రభుత్వరంగంలో విద్య' అనేవి జాతీయ డిమాండ్లుగా మారి వీటి చుట్టూ రాజకీయ సామాజిక ఉద్యమాలు ఆనాడు నడిచాయి. సోషలిస్టు దేశాల్లో కార్మిక వర్గం ఈ డిమాండును ముందుకు తెస్తే మిగిలిన దేశాల్లో ప్రజాస్వామిక డిమాండుగా మధ్య తరగతి వర్గమే ముందుండి దీన్ని అజండాగా మార్చింది. పెట్టుబడిదారీ వర్గం కూడా దీన్ని అంగీకరించి, తమ ప్రయోజనాల కోసం ఫ్యూడల్ బంధనాల్ని తెంచడం కోసం విద్యనొక సాధనంగా, ఆయుధంగా వాడుకొంది. ఫలితంగా ఆధునిక విద్యను ప్రభుత్వం అందరికీ సమానంగా అందించడం ఈ యుగ లక్షణాల్లో ఓ ముఖ్యమైన లక్షణంగా మారింది. దీని ఫలితమే అమెరికా, యూరప్, జపాన్, కొరియాల్లో సైతం ప్రభుత్వ రంగంలో బలమైన పాఠశాల విద్యావ్యవస్థ ఏర్పడ్డం. ఇప్పుడిదంతా ఉల్టా అయిపోయింది.

దీనివల్ల ఏ మార్పులొచ్చాయి? ఏ ఫలితాలు తాండవిస్తున్నాయి అనేది సంక్షోభంలో విద్యారంగం అన్న ఈ చిన్న పుస్తకంలో రచయిత శ్రీ ఎం.కోటేశ్వరరావుగారు మనముందుంచే ప్రయత్నం చేశారు. వీలున్నంత సమాచారాన్ని సేకరించి మనముందు పెట్టారు.

ఈ మార్పుల్లో కీలకమైంది వందల ఏళ్ళుగా ఎంతో బలమైన వ్యవస్థలుగా వున్న పాఠశాలల్ని ప్రభుత్వం దివాళా తీయించడం. బడ్జెట్‌లో కోతలు పెట్టి నిర్వీర్యం చేయడం. ఆర్థిక సంక్షోభాలు ఈ పరిస్థితిని తెచ్చాయనడం సరైంది కాదు. ఆర్థిక విధానాలు దీనికి మూలం. ఈ విధానాలు ప్రపంచవ్యాప్తంగా రుద్దబడినవీ, నెత్తికెత్తుకొన్నవీ.

అమెరికాలాంటి దేశాల్లో 50-60 ఏళ్ళముందు కట్టిన భవనాలన్నీ శిథిలావస్థకు చేరుకొంటుంటే పునర్నిర్మాణం చేయరెందుకని? నెదర్లాండ్స్ నుంచి జపాన్ దాకా ఎంతో అద్భుతంగా వున్న ప్రభుత్వ స్కూళ్ళకు 2011 నుంచి 60 శాతం దాకా ఆర్థిక సాయం తగ్గించేశారెందుకని? ప్రపంచ జిడిపిలో 1999-2010 మధ్య విద్య కోసం చేసిన కేటాయింపులు 4.5% నుంచి 4.9%కి పెరిగినట్లు కన్పిస్తున్నా ఇది ఏ దేశాల్లో జరిగింది? ఏ దేశాల్లో జరగలేదు?.

ఇలా చూచినప్పుడు మన దేశంలోనూ కేటాయింపులు పెరిగినట్లు కన్పించొచ్చు. ఇది ప్రజల డిమాండు ఫలితంగా అన్పించవచ్చు లేదా పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యానికి తప్పనిసరి అవసరం అయితే కావచ్చు. కాని సారాంశంలో మాత్రం ప్రభుత్వ విద్య నానాటికి విఫ్యగా మారుతోంది. మన రాష్ట్రంలో గత పదేళ్ళలో 30% పిల్లలు ప్రభుత్వ స్కూళ్ళలో తగ్గారంటే పయనం ఎటో విస్పష్టమే.

కొట్టొచ్చినట్టు కన్పిస్తున్న మరో ధోరణి ప్రభుత్వ స్కూళ్ళమీద, టీచర్ల మీద నిరంతరం దాడి. 'నాణ్యమైన విద్య' పేరుతో ప్రమాణాల పేరుతో రకరకాల సర్వేలు, అధ్యయనాలు. కన్సెజెన్సీలు ఇంత పెద్ద ప్రభుత్వ రంగం వుంటే ఈ అధ్యయనాల్ని మాత్రం ప్రైవేటు సంస్థలు చేస్తాయి. వాటికి కార్పొరేట్ సంస్థలు విరాళాలిస్తాయి. మీడియా దీనికి వత్తాసు పలుకుతుంది. వాల్‌మార్ట్ అమెరికాలో ఇలాంటి వాటికి విరాళాలిస్తే, అంబానీలు మన ప్రథమ్‌లకిస్తారు. ఈ అధ్యయనాల సారం ఏమిటి? 'ప్రభుత్వ స్కూళ్ళు నాసిరకం విద్యనిస్తాయి. వీటిని నిర్వహించడం దండగ, ప్రైవేటును ప్రోత్సహించడం మంచిది. ఎంత నిధులిచ్చినా ఇవి ఈ కాలానికి పనికిరావు' అనేదే. అమెరికాలోనూ ఇంతే, ఆంధ్రప్రదేశ్‌లోనూ ఇంతే.

ఒకవేళ ఇది నిజమే అయితే దీన్ని సరిచెయ్యడానికి ఏం చెయ్యాలో ఈ అధ్యయనాలు చెప్పవు. ఒకప్పుడు అంత వెలుగు వెలిగినవి ఇప్పుడెందుకు వెనకబడ్డాయో వివరించరు. 'స్టాన్‌ఫోర్డ్' 17% మించి మంచి విద్యనివ్వగల ప్రైవేటు స్కూళ్ళు లేవన్నా, 37% నాసిరకం విద్యనిచ్చేవే అన్నా, పనికిమాలిన 15% స్కూళ్ళలో 1300 ప్రైవేటువేనని తేలినా, ఓహియోలో 70% 'ఎఫ్' గ్రేడు స్కూళ్ళు ప్రైవేటువేనని ఋజువైనా ఇవేవీ కార్పొరేట్ల అధ్యయనాల్లోకి ఎక్కవు. సర్కారు తలకసలే ఎక్కవు. ఈ పుస్తకం దీన్ని మాటి మాటికీ ఎత్తి చూపిస్తుంది.

కార్పొరేట్లను ముందు పెట్టి ప్రభుత్వమే ఈ నాటకం నడిపిస్తుంది. ప్రైవేటు స్కూళ్ళలో చేరితే పన్ను రాయితీలిస్తుంది. చార్టర్డ్ స్కూళ్ళ పేరుతో స్కూళ్ళను వారికప్పగిస్తుంది. కోర్టులు దీన్ని సమర్థిస్తాయి. ప్రైవేటు

స్కూళ్ళలో ఇప్పటికే చదువుతున్న వారికి నగదు చెల్లిస్తారు. ఇవన్నీ అచ్చం మన రాష్ట్రంలో వున్నట్లే వుంది గదూ! మన విద్యాహక్కు చట్టం ఇరవైఐదు శాతం పిల్లల్ని ప్రైవేటు స్కూళ్ళలో చేర్చాలనడం, ఫీజు చెల్లింపుల పథకం, ప్రభుత్వ ప్రైవేటు భాగస్వామ్యం లాంటి పలుకులన్నీ ప్రపంచ బ్యాంకు చిలక పలుకులే మరి! ఒకేలా వుండక ఎలా వుంటాయి?

అన్నిటికంటే ప్రమాదకరం ఇప్పటిదాకా వున్న విద్యా నిర్వచనమే మారిపోవడం. సమగ్ర వికాసం, సృజనాత్మకత, స్వేచ్ఛా విద్య, ప్రజాస్వామిక విలువలు లాంటివన్నీ నిఘంటువుల్లో మిగిలిపోవడం. నాణ్యమైన విద్య పేరుతో మార్కులు, ర్యాంకులు, ఒకటి రెండు సబ్జెక్టుల్లో పరీక్షలు లాంటివన్నీ ముందుకు రావడం, 'కొలవగల్గిన' సామర్థ్యాలనే కొలవడం, దీనికి తగ్గట్టు పాఠశాలలు మారాలనడం, నిరంతర మూల్యాంకనాలు, వ్యక్తిగత రిపోర్టులు, గ్రేడింగులు (టీచర్లకు కూడా!) బోధనకు బదులు రికార్డు, అభ్యసనానికి బదులు పరీక్షలు గొప్ప గీటురాళ్ళుగా మారి అవి లేవని పిల్లలపై తీవ్రమైన ఒత్తిడి పెట్టడం, టీచర్ల గొంతుపై కత్తిపెట్టడం. విద్యనీ, టీచర్లనీ, విద్యార్థుల్నీ అంతా మార్కెట్ సరుకుగా మార్చెయ్యడం.

మన రాష్ట్రంలో గురుకుల పాఠశాలల్లో జరుగుతున్నదిదే. వీటి అధికార్లు అమెరికా మానస పుత్రులు. ఇక కార్పొరేట్ స్కూళ్ళ వ్యాపార కళ అంతా పిల్లల్ని ఇలా వక్రీభవనం చెందించడంలోని పాండిత్యమే! ఇది భవిష్యత్ సమాజాన్ని ఎంత కలుషితం చేస్తుందో చెప్పలేము. కార్పొరేట్ యజమానులకిలాంటి సమాజమే గావాలి. పెట్టుబడిదార్లు ఇలాంటి రాజ్యాలనే ఏలగలరు మరి.

ఆర్థిక అసమానతలన్నీ విద్యలో ప్రతిఫలించడం మరో బాధాకరమైన జాడ్యం. అమెరికా, యూరపు, జపాన్‌లలోనే కాదు కొరియా, ఫిన్లాండు లాంటి దేశాల్లో కూడా అందరికీ ఒకే రకమైన విద్యను ప్రభుత్వ రంగంలో అందిస్తున్నారు. ఇప్పటికే అమెరికాలో 5 కోట్లమంది పిల్లలు ప్రభుత్వ స్కూళ్ళలో చదివితే, ప్రైవేటు స్కూళ్ళలోని పిల్లలు 20 లక్షలు దాటరు. ప్రభుత్వ స్కూళ్ళు తరతమ స్థాయి, ప్రమాణాలతో వున్నవన్నది వేరే అంశం. మనలాంటి దేశాలకి వారసత్వమే లేదు. ఇప్పటి విధానాలు పాటిస్తే అసమానతలు మనలాంటి దేశాల్లో ఊహాతీతంగా పెరుగుతాయి. లక్షల ఫీజులు చెల్లించే అక్షర స్కూళ్ళు, అక్షరం ముక్కరాని దళితవాడల స్కూళ్ళు దీనికి తార్కాణాలు. విద్యకు అసమానతల్ని, అంతరాల్ని తగ్గించే స్వభావం వుండేది. ఇప్పుడిది అసమానతల్ని శాశ్వతం చేసేదిగా మారింది!

కార్పొరేట్ సంస్థలిప్పుడు 'కొత్త పుంతలు' తొక్కుతున్నాయి. లక్షల డాలర్లు ఖర్చు పెట్టి పాఠశాల కమిటీల్లోకి ప్రవేశిస్తున్నాయి. సలహా మండళ్ళ అవతారం ఎత్తుతున్నాయి. అమెరికాలో కొన్ని రాష్ట్రాల్లో ప్రభుత్వ పాఠశాలలోని పిల్లల తండ్రులు, కమిటీలు కలిసి తీర్మానం చేస్తే దాన్ని చార్టర్ స్కూలుగా మార్చుకోవచ్చు. ఎవరికైనా అప్పగించవచ్చు. దీన్ని సమర్థవంతంగా కార్పొరేట్ సంస్థలు వాడుకొంటున్నాయి. బోధనా విధానాల్లో జోక్యం చేసుకొని తమ సామగ్రిని, సిడిలను, టాబ్లెట్లను, డిజిటల్స్‌ను స్కూళ్ళలోకి జొప్పిస్తున్నాయి. వ్యాపారానికి వ్యాపారం, పెత్తనానికి పెత్తనం! అంతకంటే మించి లోపలినుంచే ప్రభుత్వ వ్యవస్థను తొలిచెయ్యడం, తమ విలువల్ని జొప్పించడం. ఎంత తెలివితేటలలో చూడండి.

ఈ కథకి ఇంకా చాలా మలుపులున్నాయి. విద్యారంగంలో సామాజిక భాగస్వామ్యం క్రమంగా తగ్గిపోతోంది. పాలసీల్లో యూనియన్ల పాత్ర కనుమరుగవుతుంది. మనలాంటి దేశాల్లో బ్యురాక్రాట్ల చేతిలోకి, నియంతలైన మంత్రుల చేతిలోకి, వారి రాజకీయాల చేతిలోకి విద్యా వ్యవస్థ వెళ్ళిపోతోంది. రాజీవ్ విద్యామిషన్ నిధులు ఈ 12 ఏళ్ళలో ఎలా వ్యయం చేశారో చూస్తే ఇది మనకవగతమవుతుంది. ఇతర దేశాల్లో కార్పొరేట్ సంస్థలు, ప్రైవేటీకరణ విషయంలో ఏకాభిప్రాయం గల పార్టీలు, ఎప్పుడూ పెట్టుబడిదార్లను నెత్తికెత్తుకొనే మేధావులూ, తర్కంతో తిమ్మిని బమ్మిని చేసే పండితులు, కార్పొరేట్ మీడియా ఒకరికొకరు తోడై విద్యారంగాన్ని శాసించే స్థితివచ్చింది. ఇది చదువుల్ని డొల్ల చేసి, పాఠశాలల్ని దివాళా తీయించింది. పేదపిల్లల్ని దగా చేసింది.

ఐక్యరాజ్య సమితి, యునెస్కో, ఎడ్యుకేషన్ ఇంటర్నేషనల్ లాంటి సంస్థలు 'అయ్యో! ఎంత అన్యాయం' అంటుంటాయి. విశ్లేషణలు, రిపోర్టులు ప్రచురిస్తుంటాయి. సదస్సులు జరుపుతుంటాయి. దేశాల్ని హెచ్చరిస్తుంటాయి. తీర్మానాలు చేస్తుంటాయి. దేశాధినేతలు కూడా వీటి మీద సంతకాలు చేస్తుంటారు. మిలీనియం లక్ష్యాల్ని ప్రకటిస్తారు. ఇది అకడమిక్ పండితులకి బాగా పనికొస్తుంది. అయితే తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదం. నెత్తిమీద కూచున్న ప్రపంచబ్యాంకు మాటదే అంతిమ విజయమవుతుంది. 'ప్రపంచమంతా ఒకే మార్కెట్' 'ఏకీకృత విధానం', "అంతర్జాతీయ పెట్టుబడిదార్లు" ఇవి ఏ ప్రభుత్వాల కాళ్ళూ, చేతులూ కదలనివ్వవు. వాటికనుగుణంగా తలాతోకా ఆడించగలవారే దేశాధినేతలుగా వుంటారు. కోతులన్నిటికీ మూతులు ఒకటే అన్నట్లు పార్టీలన్నింటికీ పాలసీలు ఒకటే వుంటాయి.

ఇక చివరి సంగతి...

పిల్లలు, తల్లిదండ్రులు, మొత్తం సమాజమే దీనికి బలవుతుంది. కాకుంటే టీచర్లు ముందుగా బలవుతారు. వీరు సోమర్లని, జీతాలు ఎక్కువని, యూనియన్లది అరాచకమని నిందలు వేస్తారు. నిధుల కొరత పేర అర్హతలేని వార్ని నియమిస్తారు. తల్లిదండ్రుల్ని ఉసికొల్పుతారు. చివరికి పాలసీల్లో వీరి ప్రాధాన్యతను తగ్గిస్తారు. వీరి ఉద్యమాల్ని చిన్నాభిన్నం చేస్తారు. సంఘాల్ని ఎగదోస్తారు. ప్రపంచవ్యాప్తంగా జరుగుతున్నదిదే! మన రాష్ట్రంలోనూ జరుగుతున్నదిదే!

టీచర్లు ఒకవైపు తమపై దాడిని ఎదుర్కొని తిప్పికొట్టాలి. మరొకవైపు ఈ దాడి వెనకగల కుట్రనూ ఛేదించాలి. దీనికోసం టీచర్లకు స్ఫూర్తి, యూనియన్లకు మంచి నాయకత్వం కావాలి. తల్లిదండ్రుల్ని కలుపుకోవాలి. నికరంగా పోరాడాలి. చికాగో టీచర్ల సమ్మె దీనికి చక్కటి ఉదాహరణ.

రచయిత తన పుస్తకంలో ఇవన్నీ చెప్పారు. గణాంకాలతో, ప్రపంచానుభవాలతో, విశ్లేషణలతో చెప్పారు. అయితే ఓ క్రమంలో చెప్పలేక పోయారన్పించింది.

టీచర్లే గాదు విద్య చుట్టూ జరుగుతున్న ఈ చర్చలో అందరూ పాల్గొనాలి. అందుకీ పుస్తకం కావాల్సినంత సరుకుని సమకూరుస్తుంది. యుటియఫ్ 13వ రాష్ట్ర సభల సందర్భంగా ప్రస్తుత విద్యారంగపు ధోరణుల సారాన్ని పుస్తక రూపంలో, వెలుగులోకి తెచ్చినందుకు అభినందనలు.

(సంక్షోభంలో విద్యారంగం పుస్తకానికి వ్రాసిన ముందుమాట)

# 10వ తరగతి ఫలితాలు ఏమి తెలియజేస్తున్నాయి



ఎ.నర్సిరెడ్డి
యుటీయఫ్ రాష్ట్ర అధ్యక్షులు

విభిన్న వాతావరణములో ప్రభుత్వ, ప్రైవేటు పాఠశాలల విద్యార్థులు చదువుకున్నారు. ఒకే చోట జంబ్లింగ్ విధానములో పరీక్షలు వ్రాసారు. ప్రభుత్వ పాఠశాలల విద్యార్థులు, ఫలితాలలో మెరుగుదల సాధించారు. మార్చి / జూన్ 2013లో నిర్వహించిన 10వ తరగతి ఫలితాలు మే 17న వెలువడ్డాయి. ఈ ఫలితాల ద్వారా ప్రభుత్వ పాఠశాలల పనితీరులో మంచి మార్పు కన్పిస్తున్నది. 10,57,628 మంది విద్యార్థులు రెగ్యులర్ గా పరీక్షలు వ్రాసారు. అందులో 5,43,104 మంది బాలురు. 5,14,524 మంది బాలికలు. బాలుర ఉత్తీర్ణత 87.3%, బాలికలు 88.9% ఈ సం॥ కూడా బాలికల ఉత్తీర్ణతే అధికంగా యున్నది. ఇచట గమనించవలసింది ప్రచార, ఆర్భాటాలలో విద్యార్థులకు, తల్లిదండ్రులను పరీక్షల సునామిలో గింగిరాలు తిప్పుచున్న ప్రైవేటు పాఠశాలలు 92.69% ఉత్తీర్ణత సాధించాయి. వివిధ యాజమాన్యాల క్రింది ప్రభుత్వ పాఠశాలలు 84.77% ఉత్తీర్ణత సాధించాయి. ప్రభుత్వ, ప్రైవేటు పాఠశాలల మధ్య వ్యత్యాసము 7.92% యున్నది. ప్రభుత్వ పాఠశాలలో మొదటితరము మరియు రెండవ తరము విద్యార్థులు చేరుతున్నారు. ప్రైవేటు పాఠశాలల్లో రెండవ, మూడవ, నాల్గొవ తరము విద్యార్థులు చేరుతున్నారు. మొదటి తరము విద్యార్థికి ఇంటి దగ్గర ఎటువంటి చదువు వాతావరణము యుండదు. విద్యార్థుల హాజరులో కూడా ప్రభుత్వ, ప్రైవేటు పాఠశాలలకు వ్యత్యాసముంటుంది. ప్రభుత్వ పాఠశాలలో జూన్‌లో యున్న 10వ తరగతి విద్యార్థి మార్చిలో పరీక్ష రాసేవరకు అనేక ఆటంకాలను అధిగమించవలసి యున్నది. తల్లి దండ్రులు లేదా తోబుట్టువులకు అనారోగ్యము కల్గిందంటే వీరు పాఠశాలకు రాలేరు. పేద, మధ్యతరగతి రైతు కుటుంబాల పిల్లలైతే, తమ కుటుంభానికున్న కొద్ది పాటి భూమి సాగు సమయంలో మరియు నూర్పిడి సమయంలో బడికి సెలవు పెట్టాల్సిందే. అకస్మాత్తుగా కుటుంబంలో డబ్బుఅవసరమైతే కూలికి పోవాల్సిందే. ఇన్ని ఆటంకాలను అధిగమించి ఉపాధ్యాయులు మరియు ప్రధానోపాధ్యాయుల చొరవ వల్లనే, ఈ ఫలితాలు వస్తున్నాయి. ప్రైవేటు పాఠశాల కెళ్ళే విద్యార్థుల కుటుంబ పరిస్థితులు చాల అనుకూలంగా యుంటాయి. బడికి పోవుటకు అత్యధిక సహకారమందించబడుతుంది. పిల్లల చదువుల కొరకే తమ జీవితమన్నట్లుంటుంది. బ్రష్ చేసుకొనే దగ్గర నుండి బడి వరకు దింపేదాక మరియు సాయంత్రము 'ఇంటిపని (Home Work) చేయించే వరకుంటుంది. పరీక్షల సమయంలో ప్రత్యేక శ్రద్ధతో పరీక్షా కేంద్రము వరకు తీసుకెళ్ళటం, తీసుకురావడం జరగుతుంది. ఇన్ని వ్యత్యాసాలున్నప్పటికి ఈ ఉభయ రకాల విద్యార్థులు ఒకే పేపరుకు, ఒకే కేంద్రములో ప్రక్క ప్రక్కన కూర్చుని పరీక్షలు వ్రాస్తారు. అప్పుడు జిపిఏ ద్వారా ఇద్దరిని పోలుస్తారు. కాస్తమెరుగైన పరిస్థితులున్న గురుకుల పాఠశాలల్లో ఉన్నత ఫలితాలు సాధించారు. ఇందులో ఆంధ్రప్రదేశ్ గురుకుల పాఠశాలలకు 94.99% (95%)లో అగ్రభాగాన ఉన్నాయి. మూడు రకాల గురుకుల పాఠశాలలు 93.81% ఫలితాలు సాధించాయి. ప్రైవేటు పాఠశాలల కంటే 1.11% ఎక్కువ.

రాష్ట్రంలో మొత్తం 21495 ఉన్నత పాఠశాలలు, ఇందులో 10,049 ప్రైవేటు, 11446 ప్రభుత్వ యాజమాన్యంలోనివి. 53.24% ప్రభుత్వ పాఠశాలల్లో 58.18% మంది విద్యార్థులుంటే 46.76%గల ప్రైవేటు పాఠశాలల్లో 41.82% మంది విద్యార్థులు 10వతరగతి పరీక్షలు వ్రాశారు. ప్రభుత్వ యాజమాన్య పాఠశాలల్లోనే విద్యార్థుల సంఖ్య ఎక్కువగాయున్నది. ప్రభుత్వ ఉన్నత పాఠశాలలో సరాసరి 53.36, ప్రైవేటు ఉన్నత పాఠశాలల్లో సరాసరి 43.68 చొ॥న 10వ తరగతి విద్యార్థులు పరీక్షలు వ్రాసారు.

ప్రైవేటు పాఠశాలల్లో చదివిన 439030 మంది విద్యార్థులలో ఎక్కువ శాతము ఇంగ్లీషు మీడియం వారుంటారు. వీరిలో 50% విద్యార్థుల కుటుంబాల పిల్లల ఫీజులు చెల్లింపు కొరకు ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. రాష్ట్ర వ్యాప్తంగా యున్న 6500 సక్సెస్ ఉన్నత పాఠశాలల్లో ఇంగ్లీషు మీడియం తరగతుల బోధన కొరకు ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటే రెండున్నర లక్షలమంది విద్యార్థుల కుటుంబాలను ప్రైవేటు పాఠశాలలు ఫీజులు బాదుడు నుండి రక్షించ వచ్చును. ఉన్నత పాఠశాలలో ఏ ఒక్క సబ్జెక్ట్ పోస్టు భర్తీ కాకపోయినా ఆ సబ్జెక్ట్ బోధించే వారుండరు. జూన్‌లో పాఠశాల తెరిచేనాటికి ఉన్నత పాఠశాలలన్నింటిలో సబ్జెక్ట్ పోస్టులన్నిటిని భర్తీ చేసే విధంగా నిబంధనలు మార్చాలి. డియస్సీ ద్వారా భర్తీ చేసేలోగా తాత్కాలిక నియమకాలు పాఠశాల యాజమాన్య కమిటీల ద్వారా చేసి, మినిమమ్ బేసిక్ వేతనము నెలవారి చెల్లించే ఏర్పాట్లు చేయాలి. గత రెండు సం॥రాల నుండి ఈ ఏర్పాట్లు అరకొరగానే జరిగినవి. నియమించిన విద్యావలంటీర్లకు 2011-12 మరియు 2012-13 విద్యా సం॥రాలలో తొమ్మిది నెలల ఆనరోరియం బాకిపడి యున్నది. అదే ప్రైవేటు పాఠశాలల్లో, సబ్జెక్ట్ పోస్టును ఎప్పటికపుడు భర్తీ చేసుకుంటున్నారు. ప్రభుత్వ ఉన్నత పాఠశాలల్లో సబ్జెక్ట్ టీచరు లేని పాఠశాలల్లోనే 10వ తరగతి ఫలితాలు తక్కువగా యున్నాయి. ప్రభుత్వ విధానము వలన ఎయిడెడ్ పాఠశాలల పరిస్థితి దారుణంగా యున్నది. 2004 తర్వాత నియామకాలు లేక సగానికిపైగా పోస్టులు ఖాళీగా యున్నాయి. అయినా గతంకన్నా ఎక్కువ శాతం ఉత్తీర్ణులయ్యారు. ఎయిడెడ్ పాఠశాలల్లో పోస్టులు ఎప్పటికపుడు భర్తీ చేయుటకు అనుమతించాలి. సున్నా ఫలితాలు వచ్చిన వాటిలో ఆరు ప్రైవేటు, మూడు పభుత్వ, రెండు ఎయిడెడ్ పాఠశాలలున్నాయి. సమస్యలనధిగమిస్తూ, ప్రభుత్వ పాఠశాలలు 10వ తరగతిలో మంచి ఫలితాలు సాధించాయి.

## విద్యార్థులను శారీరకంగా మానసికంగా వేధించరాదు

2009 విద్యాహక్కు చట్టం అమలులో భాగంగా "విద్యార్థులను శారీరకంగా, మానసికంగా హింసించరాదనే"అంశంపై రాజీవ్ విద్యామిషన్ ఆధ్వర్యంలో మే 14న రాష్ట్ర ప్రాజెక్ట్ కార్యాలయంలో రాష్ట్రస్థాయి కార్య శిబిరం నిర్వహించారు. వర్క్‌షాప్ ఉద్దేశ్యాన్ని ఎస్‌పిడి వి.ఉషారాణి వివరిస్తూ క్రమశిక్షణ పేరుతో పిల్లలను శిక్షించడం పాతకాలం భావజాలమని, మారిన పరిస్థితుల్లో ఉపాధ్యాయులు, తల్లిదండ్రులు, సమాజం మారాలన్నారు. లైంగిక వేధింపులకు పాల్పడేవారిపై శాఖాపరంగా కఠిన చర్యలు తీసుకోవడం జరుగుతుందన్నారు. దీనిపై ఉపాధ్యాయ సంఘాలతో చర్చించి నిర్ణయాలు తీసుకొంటామన్నారు. ఈ తరహా వర్కుషాపులు జిల్లా, మండల స్థాయిలో నిర్వహిస్తామని తెలియజేశారు. నల్సార్ యూనివర్సిటీ ప్రొఫెసర్ డా॥మాడభూషి శ్రీధర్ మాట్లాడుతూ విద్య నేర్పే అధికారం వుందిగాని శిక్షించే అధికారం చట్టాల్లో లేదని, శిక్షించడం వల్ల సమస్యలు పరిష్కారం కావని, పిల్లలను శిక్షించడం, హింసించడం ద్వారా ఏమి సాధించగలమో ఆలోచించాలన్నారు. ఈ సందర్భంగా ఆయన పలు కోర్టు తీర్పులు ఉటంకించారు. ఈ కార్యక్రమంలో పలు యూనివర్శిటీల ప్రొఫెసర్లు, ఉపాధ్యాయ సంఘాల నాయకులు, స్వచ్ఛంద సంస్థల పక్షాన చర్చలో పాల్గొన్నారు. యుటియఫ్ తరపున ఎన్.నారాయణ, ఎ.నర్సిరెడ్డి, ఐ.వెంకటేశ్వర రావు పాల్గొన్నారు. ఎన్.నారాయణ మాట్లాడుతూ ఒకరిద్దరు ఉపాధ్యాయులు బహుళ తరగతి బోధనలో ఉండటం వలన ఉపాధ్యాయులపై మానసిక వత్తిడి పెరుగు తుందన్నారు. క్రమశిక్షణ పేరుతోనో, చదువు వెనుకబాటుతనం ఇతర కారణాల పేరుతో విద్యార్థులను శారీరకంగా, మానసికంగా హింసించే పద్ధతులు విరమించు కోవాలని, దీనికోసం బాధ్యతగల ఉపాధ్యాయ సంఘంగా తమవంతు కృషి చేస్తామన్నారు.

**లింగ వివక్ష కొనసాగుతున్నది :** ప్రైవేటు పాఠశాలల్లో 439030 విద్యార్థుల్లో 2,50,014 (57%) బాలురు, 1,89,016 (43%) బాలికలు 10వ తరగతి చదివారు. ప్రభుత్వ పాఠశాలల్లో 6,10,872 విద్యార్థుల్లో 289321 (47%) బాలురు 321551 (53%) బాలికలు 10వ తరగతి పరీక్షలు వ్రాశారు. ప్రైవేటు స్కూల్సుకు పంపే తల్లిదండ్రులు బాలికలకంటే బాలుర చదువు కొరకు ప్రాముఖ్యత ఇస్తున్నట్లు కన్పిస్తున్నది. మొత్తం బాలికలు 5,10,568 మందిలో 321551 (63%) ప్రభుత్వ పాఠశాలల్లో 1,89,016 (37%) ప్రైవేటు పాఠశాలల్లో చదివారు. మొత్తం బాలురు 5,39,335లో 2,50,014 (46%) ప్రైవేటు పాఠశాలల్లో, 289321 (54%) ప్రభుత్వ పాఠశాలల్లో చదివారు. 10వ తరగతి విద్యార్థుల గణాంకాలను ఇన్ని రకాలుగా ఇచ్చిన ప్రభుత్వ పరీక్షల డైరెక్టరు గారు అభినందనీయులు.

పై గణాంకాలను పరిశీలిస్తే, ఇప్పటికీ ప్రభుత్వ పాఠశాలలు పాఠశాల విద్యలో ప్రముఖ పాత్రను పోషిస్తున్నాయి. విద్యాహక్కు చట్టం ప్రకారం వనరులు పెంచినట్లయితే ఫీజుల భారం మోయలేక ఇబ్బంది పడుచున్న కుటుంబాలకు స్వాంతన చేకూరుతుంది. ప్రభుత్వ పాఠశాలలు వికసిస్తాయి. రాష్ట్ర ప్రభుత్వము తగు చర్యలు తీసుకొనుట కొరకు విద్యావికాస ఉద్యమము ద్వారా వత్తిడి చేద్దాము.

## యుటియఫ్ రాష్ట్ర మహాసభల జాతా

ఏప్రిల్ 27 నుండి 29 వరకు తిరుపతిలో జరగనున్న యుటియఫ్ 13వ రాష్ట్ర మహాసభల్ని పురస్కరించుకొని, ఖమ్మం నుంచి 2వ మహాసభల పతాక జాతా రాష్ట్ర కార్యదర్శి బి.నరసింహారావు నేతృత్వంలో ఏప్రిల్ 25 ఉదయం బయలుదేరింది. యుటియఫ్ కార్యాలయం వద్ద జరిగిన కార్యక్రమంలో సీనియర్ నాయకులు ఆర్.రాఘవయ్య పతాకాన్ని ఊపి జాతా ప్రారంభించారు. ఈ సందర్భంగా బి.నరసింహారావు మాట్లాడుతూ ప్రభుత్వ విద్యారంగం, పాఠశాలల పరిరక్షణ పేద పిల్లలకు నాణ్యమైన విద్య, ఉపాధ్యాయుల సమస్యల పరిష్కారమే లక్ష్యంగా యుటియఫ్ మహాసభల్లో చర్చిస్తామని తెలిపారు. జాతాలో యుటియఫ్ జిల్లా కార్యదర్శులు పి.కిష్టయ్య, ఎ.వెంకటేశ్వర్లు తదితరులున్నారు. ప్రారంభకార్యక్రమంలో యుటియఫ్ జిల్లా కార్యదర్శులు, సీనియర్ నాయకులు సిహెచ్.దుర్గాభవాని, ఎన్.వీరబాబు, ఎం.నరసింహారావు, ఎస్.కె.ఉద్దండు, కె.శ్రీనివాసులు, బోస్, ఎ.రమాదేవి, గీత, ప్రసూనాంబ, కేశ్యా, దాసు, రామారావు, కృష్ణారావు, ముత్తయ్య, శచేంద్రబాబు తదితరులతోపాటు వివిధ మండలాల కార్యకర్తలు పాల్గొన్నారు.

### ఖమ్మం, నల్గొండ జాతాలకు హైదరాబాద్‌లో స్వాగతము

ఖమ్మం, నల్గొండ నుండి బయలుదేరిన రాష్ట్ర మహాసభల జాతాలకు తేది.25.04.2013న సాయంత్రం 2 గంటలకు హైదరాబాద్‌లోని ఎల్‌బి నగర్‌లో రంగారెడ్డి జిల్లాశాఖ స్వాగతం పలికింది. ఈ సందర్భంగా విచ్చేసిన యుటియఫ్ సీనియర్ నాయకులు మోతుకూరి నరహరిగారు మాట్లాడుతూ మహాసభల ప్రాముఖ్యతను, ఉపాధ్యాయుల ఉద్యమ స్ఫూర్తిని, అనేక ఆటుపోటుల మధ్య సంఘం విస్తరించిన విధానాన్ని కొనియాడారు. మనకున్న అనేక సౌకర్యాలు పోరాటాల ద్వారానే సాధించుకొన్నామని వాటిని కాపాడుకోవాల్సిన బాధ్యత మనం దరిపైన ఉందని అన్నారు. ఈ కార్యక్రమంలో యుటియఫ్ రాష్ట్ర సహాధ్యక్షులు ఎం.సంయుక్త, రంగారెడ్డి జిల్లా అధ్యక్ష, కార్యదర్శులు పి.మాణిక్‌రెడ్డి, ఎం.ఆంజనేయులు, కోశాధికారి ఇ.గాలయ్యలతోపాటు పలువురు ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

### 9వ మహాసభల జాతా తిరుపతి ప్రయాణం

2003 సంవత్సరంలో యుటియఫ్ 9వ రాష్ట్ర మహాసభలను జరిపిన హైదరాబాదు జిల్లా శాఖ తిరుపతిలో జరుగనున్న 13వ రాష్ట్ర మహాసభలకు జాతా పతాకాన్ని చేబూని తిరుపతికి పయనమైంది. 2వ మహాసభలు నిర్వహించిన ఖమ్మం, 11వ మహాసభలు నిర్వహించిన నల్లగొండ జాతాలకు ఏప్రిల్ 25వ తేదీన యుటియఫ్ రాష్ట్ర కార్యాలయం అయిన దోమల్‌గూడాలో హైదరాబాద్ జిల్లా శాఖ ఘన స్వాగతం పలికింది. ఖమ్మం జాతాకు రాష్ట్ర కార్యదర్శి బి.నరసింహారావు, నల్లగొండ జాతాకు జిల్లా కోశాధికారి ఎర్ర సైదులు నేతృత్వంలో 20మంది కార్యకర్తలు హాజరైనారు. వారందరికీ ఆత్మీయ ఆహ్వానం, విందు భోజనం ఏర్పాటు చేసిన హైదరాబాద్ జిల్లా అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు ఎస్.వై.కొండలరావు, మేడె దేవదాసు, రాష్ట్ర ఆడిట్ కన్వీనర్ సిహెచ్.వి. రాజన్‌బాబ్‌లు 9వ జాతాను సిద్ధం చేశారు. రాష్ట్ర అధ్యక్షులు ఎన్.నారాయణ జాతాను ప్రారంభిస్తూ యుటియఫ్ మహాసభలను జయప్రదం చేసేందుకు జాతాలు ఊరూరా ప్రచారం చేస్తూ తిరుపతికి చేరుకోవాలని కోరారు. 9వ జాతాకు జిల్లా కార్యదర్శులు ఏ.రమాదేవి, శ్యాంసుందర్‌లు నాయకత్వం వహించారు.



# 10వ పీఆర్‌సీకి యుటియఫ్ ప్రతిపాదనలు




సి.హెచ్. సుభాష్‌చంద్రబోస్
యుటీయఫ్ పూర్వ అధ్యక్షులు

రాష్ట్ర ప్రభుత్వం ఉపాధ్యాయ, ఉద్యోగ, కార్మిక, పెన్షనర్ల సంఘాల (జెఏసీ) ఆందోళన ఫలితంగా రాష్ట్ర చరిత్రలో తొలిసారిగా 5 సం॥ కాలం పూర్తిగాక ముందే పీఆర్‌సీని నియమించడం ముదావహం. ఈ కమిటీకి రిటైర్డ్ ఐఏఎస్ అధికారి పి.కె. అగర్వాల్‌గారిని నియమించగా వారు అన్ని సంఘాలను పీఆర్‌సీకి ప్రతిపాదనలు పంపమని కోరారు. ఈ క్రమంలో యుటియఫ్ పక్షాన చేసిన ప్రతిపాదనలను మీముందుంచుచున్నాను.

"భారత దేశం సెక్యులర్, సోషలిస్ట్, సావరిన్, రిపబ్లిక్" అని రాజ్యాంగ పీఠికలో వ్రాసుకున్నాం. సోషలిస్ట్ వ్యవస్థలో ఉన్నతమైన వేతన వ్యవస్థ ఉండాలి. దిగువ, ఎగువ తరగతి ఉద్యోగుల మధ్య వేతన అంతరాలు 5 రెట్లకు మించరాదు. మెరుగైన జీవనం ఆశించడం, జీవరాసుల సహజ స్వభావం. కనుక ఉద్యోగులకూ అట్టి మెరుగైన జీవనం అందించడానికి ప్రస్తుతం ఉన్న సౌకర్యాలనన్నింటిని కొనసాగిస్తూ మరిన్ని సౌకర్యాలు కల్పించడానికై ప్రభుత్వం కృషి చేయాలి.

ఐఎల్‌సి (ఇండియన్ లేబర్ కాన్ఫరెన్స్) 15వ త్రైపాక్షిక సమావేశంలో అంగీకరించిన అంశాలను వేతన నిర్ణయాలు చేసేటప్పుడు పరిగణనలోనికి తీసుకోవాలి. అట్లాగే ఈనాటి ధరవరలు, మారిన జీవన విధానం, కనీస అవసరాలు దృష్టిలో ఉంచుకోవడంతో బాటు సగటు కుటుంబం వ్యక్తులుగా భావించి వారికి అవసరమైన ఆహార పదార్థాలు, బట్టలు, ఇతర అవసరాలను పరిగణనలోనికి తీసుకోవాలి.

వివిధ తరగతుల ఉద్యోగులతోపాటు ఉపాధ్యాయుల వేతనం నిర్ణయం చేసే సందర్భంలో సమాజంలో ఉపాధ్యాయుని పాత్ర, స్థానము దృష్టిలో .ఉంచుకోవలసియున్నది. ఉపాధ్యాయుల వేతనాలు వారి గౌరవాన్ని ఇనుమడింపజేసే విధంగా ఉండాలి. అంతేగాక ప్రతిభా వంతులైన వారు ఉపాధ్యాయ వృత్తిలోనికి రావాలన్నా, వచ్చిన వారు వృత్తిలో కొనసాగాలన్నా వారి వేతనాలు ఆకర్షణీయంగా ఉండాలి. ఉపాధ్యాయులు సాధారణ విద్యార్హతలతోపాటు ట్రైనింగ్ అర్హతలు ప్రత్యేకంగా కల్గి వుంటారు. ఇది నైపుణ్యంతో కూడిన వృత్తి. అందు చేత ఉపాధ్యాయులను నైపుణ్యంగల ఉద్యోగులుగా పరిగణించి ఆకర్షణీయమైన వేతనాలు యివ్వాల్సి ఉన్నది.

డా॥ అక్రాయిడ్ సూచించిన కనీస నికర కేలరీలు కలిగిన సమీకృతాహారం కొరకు నెలకు అయ్యే ఖర్చు రూ.9462/-, బట్టల నిమిత్తం రూ.1120/-, ఇంధనం వగైరాలు రూ.1865/-, ఇంటి అద్దె, కరెంట్ రూ.2700/-, విద్య, వైద్యం, సాంఘిక అవసరాలకు రూ.4500/-, వెరసి రూ.19647/- కనీస వేతనంగా వుండాలి.

కేంద్ర ప్రభు త్వోద్యోగి కనీస వేతనం, డిఏ కలిపితే రూ.13160/-గా ఉన్నది. రాష్ట్ర ప్రభుత్వోద్యోగి కనీస వేతనం రూ.10830/-గా వున్నది. ఈ ఇద్దరి మధ్య వ్యత్యాసం రూ.2330/- ఉన్నప్పటికీ కేంద్రం అమలు చేస్తున్న కనీస వేతనం 7 1/2 సం॥ (01.06.2006) నాటి ధరలను బట్టి నిర్ణయించబడినది. ఈ 7 1/2 సం॥ కాలంలో అన్ని రకాల ధరలు యిబ్బడిముబ్బడిగా పెరిగాయి. రూపాయి విలువ తగ్గిపోయింది. దీనితో అన్నింటిని అధిగమించి నేటి ధరవరలకి జీవనం సాగించాలంటే అదనంగా మరో రూ.4020/- కలిపితే రూ.14850/- కాగా దగ్గర వందకు సవరించగా సదరు మొత్తాన్ని రూ.15000/-లను కనీస వేతనంగా ప్రతిపాదిస్తున్నాము.

ఈ సందర్భంగా డా॥ అక్రాయిడ్ సూచన మేరకైతే రూ.19647/-గా కనీస వేతనం వుండాలి. 66 సం॥ల స్వాతంత్ర్యం తరువాత కూడ మన దేశంలో సుమారు 35% మంది పేదరికంలో మగ్గుతున్నారు. వారి సంక్షేమం, అభివృద్ధి కోసం ప్రభుత్వం కార్యక్రమాలు నిర్వహించవలసియున్నందున త్యాగబుద్ధితో కనీసం వేతనం రూ.15000/-లకే తగ్గించుకుని ప్రతిపాదిస్తున్నాము. కావున ఫిట్‌మెంట్ 60%గా వుండాలని, కనీసం వేతనం రూ.15000/-గాను, గరిష్ఠ వేతనం రూ. 1,41,330/-గా ఉండాలని, కనిష్ఠ, గరిష్ఠ వేతనాల నిష్పత్తి 1:9.42గా వుండాలని ప్రతిపాదిస్తున్నాము.

## నూతన మాస్టర్ స్కేల్

15000-530-16590-580-18330-650-20280-720-22440-790-24810-870-27420-960-30300-1060-33480-1200-37080-1300-40980-1450-45330-1600-50130-1750-55380-1950-61230-2150-67680-2400-74880-2650-82830-2900-91530-3200-101230-3550-111780-3900-123480-4350-136530-4800-141330 (70)

## టీచర్స్ పే స్కేల్స్

| | ప్రస్తుతం | ప్రతిపాదిత స్కేలు |
|---|---|---|
| ఎస్‌జిటి తత్సమానం | 10900-31550 | 24810-57330 |
| ఎస్‌ఏ తత్సమానం | 14860-39540 | 33480-77530 |
| యుపిఎస్ హెచ్‌ఎం | | 35880-82830 |
| హైస్కూల్ హెచ్‌ఎం | 18030-43630 | 40980-94730 |

హై స్కూల్ హెడ్మాస్టర్ / ఎంఇఓల స్కేలు ఒకే విధంగా వుండాలి. గతం నుండి ఒకే విధమైన పోస్టులుగా ఉండి పరస్పర బదిలీలకు అవకాశమున్న పోస్టులు కాబట్టి వీటి మధ్య తేడా ఉండరాదు. ఇంక్రిమెంట్ రేటు గతంలో 2.5%గా ఉండేది. ఇప్పుడు 3.5%గా వుండాలని, స్టాగ్నేషన్ ఇంక్రిమెంట్లు 5 ఉండాలని ప్రతి స్కేలులోను గతంలో 40 స్టేజిలుండగా ఇప్పుడు ఎక్కువ భాగం 25 స్టేజిలుండేటట్లు ప్రతిపాదించడం జరిగింది.

ఇంటి అద్దె అలవెన్స్‌ను నిర్ణయించేటప్పుడు 2011 జనాభా ప్రాతిపదికగా తీసుకోవాలి. గ్రామీణ ప్రాంతాల్లో 17%గాను, మున్సిపాలిటీలు 20%గాను, జిల్లా కేంద్రాలు 25%గాను, 5 లక్షలకు పై బడిన జనాభా కల్గిన కార్పొరేషన్లలో 30%గాను, గ్రేటర్ కార్పొరేషన్లలో 35%గాను ఉండాలని, మున్సిపాలిటీలకు 10 కి॥మీ॥ పరిధి, జిల్లా కేంద్రాలకు 15కి॥మీ॥ పరిధి, నగరశాఖ కార్పొరేషన్, గ్రేటర్

కార్పొరేషన్‌కు 20కి॥మీ॥ పరిధిని విస్తరించి ఇంటి అద్దె చెల్లించాలని కోరడం జరిగింది.

ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీములో ప్రస్తుతం వున్న 6/12/18 /24 బదులుగా 5/10/15/20/25 పద్ధతి ప్రవేశ పెట్టాలి. 10 సం॥లు తదుపరి ప్రమోషన్ స్కేలు, 15 సం॥ల తదుపరి అదే స్కేల్లో ఒక ఇంక్రిమెంట్, 20 సం॥ల ఆ తదుపరి ప్రమోషన్ స్కేలు, 25 సం॥ల అదే స్కేలుతో ఒక ఇంక్రిమెంటు యిచ్చే విధంగా ప్రతి పాదించడం జరిగింది. ఈ స్కేళ్ళు పొందే సందర్భంలో డిపార్ట్‌మెంట్ టెస్టులు పాస్ కావాలనే నిబంధన తొలగించాలని కోరడం జరిగింది.

స్టెప్‌అప్‌కు సంబంధించి "సబ్జెక్ట్ రిలెవెన్స్" తొలగించి సమానమైన హోదా అనగా స్కూల్ అసిస్టెంట్లందరకు (ఫిజిక్స్‌కు ఫిజిక్స్, లెక్కలను లెక్కలు) అనే నిబంధన లేకుండా అమలు చెయ్యాలని ప్రతిపాదించుట జరిగింది.

9వ పీఆర్‌సీలో సీనియర్లకు ఆశించిన మేరకు పెరుగుదల రాలేదు. ఇది వారిని తీవ్ర నిరాశకు గురి చేసింది. ముఖ్యంగా 2003,2006 డిఎస్‌సిల ద్వారా ఉద్యోగంలో ప్రవేశించిన వారికి ఒకే వేతనం వద్ద స్థిరీకరించడం జరిగింది. ఇది కూడ అలాంటి వారిని నిరాశకు గురి చేసింది. ఈ 10వ పీఆర్సీ ఈ విషయాలను లోతుగా పరిశీలించి సీనియర్లకు న్యాయం జరిగే విధంగా పరిష్కారం సూచించాలని కోరడం జరిగింది. వృత్తి విద్య ఉపాధ్యాయులకు నోషనల్ ఇంక్రిమెంట్లు యిచ్చి, ఆ సర్వీస్‌ను పెన్షన్‌కు గుర్తింపునివ్వాలని ప్రతిపాదించాం.

టీచర్ పోస్టుల పేర్లను ఎస్‌జిటిలను ప్రైమరీ టీచర్‌గాను, స్కూల్ అసిస్టెంట్‌లను గ్రాడ్యుయేట్ టీచర్‌గాను, హెడ్మాష్టర్ గ్రేడ్-2ను హెడ్మాష్టర్‌గాను మార్పు చేయాలని కోరడం జరిగింది.

ప్రాథమిక పాఠశాలల ప్రధానోపాధ్యాయులకు రూ.250/-, యుపి పాఠశాల ప్రధానోపాధ్యాయులకు రూ.350/-, ఉన్నత పాఠశాల (అప్‌గ్రేడెడ్) ప్రధానోపాధ్యాయులకు రూ.350/-, ఉన్నత తరగతులు బోధించే ఎస్‌జిటి, పండిట్‌లకు రూ.300/- ప్రత్యేక అలవెన్స్‌గా యివ్వాలని, అంధులకు రీడర్ అలవెన్స్ రూ.10% 2వేలు గరిష్టంగా యివ్వాలని కోరడం జరిగింది.

ఎల్‌టిసి ఒక బ్లాక్ పీరియడ్‌లో రాష్ట్రంలోను, మరో బ్లాక్ పీరియడ్‌లో దేశమంతటా తిరిగి రావడానికి అనుమతించి పాస్ సిస్టం ప్రవేశ పెట్టాలని ప్రతిపాదించడం జరిగింది.

మిగతా టూర్ - టిఏ, డిఏ, ఎఫ్‌టిఏలను, ఎస్‌సిఏను రెట్టింపు చేయాలని కోరడం జరిగింది. రిటైర్మెంట్ వయస్సు 60 సం॥కు పెంచాలి.

అంత్యక్రియలకు యిచ్చే సొమ్మును 10వేల నుండి 25వేలకు పెంచాలి. కనీస వేతనం మొత్తానికి తగ్గకుండా కనీస పెన్షన్ ఉండాలి. కనీస పెన్షన్ రూ.15వేలుగా వుండాలి. గ్రాట్యుటీ సీలింగ్ రూ.15 లక్షలుగా వుండాలి. 9వ పీఆర్సీ తగ్గించిన కమ్యుటేషన్ విలువను పునరుద్ధరించాలి. పెన్షన్ కమ్యుటేషన్‌ను తిరిగి 12 సం॥ల తర్వాత పూర్తిగా చెల్లించాలి. 15 సం॥కే వాలంటరీ రిటైర్మెంట్‌ను అనుమతించాలి.

కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులకు 6వ వేతన సంఘం సిఫారసులకు అనుగుణంగా 80 సం॥ల వయసు నిండిన నాటి నుండి ప్రతి 5 సం॥లకు పెన్షన్‌కు కొంత శాతం అదనంగా కలిపి చెల్లిస్తున్నారు. ఈ విధానమునకు, ప్రస్తుతము రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకు అమలు చేస్తున్న దానికి చాలా వ్యత్యాసం వున్నది. 6వ కేంద్ర వేతన సంఘం కేంద్ర ప్రభుత్వ పెన్షనర్లకు 80 సం॥లు పైబడిన వారికి 20%, 85 సం॥లు పైబడిన వారికి 30%, 90 సం॥లు పైబడిన వారికి 40%, 95 సం॥లు పైబడిన వారికి 50%, 100 సం॥లు పైబడిన వారికి 100% అదనంగా పెన్షన్ చెల్లిస్తున్నది. దీనినను సరించి రాష్ట్ర ప్రభుత్వ పెన్షనర్లకు 70 సం॥లు పైబడిన వారికి 20%, 75 సం॥లు పైబడిన వారికి 25%, 80 సం॥లు పైబడిన వారికి 30%, 85 సం॥లు పైబడిన వారికి 40%, 90 సం॥లు పైబడిన వారికి 50%, 95 సం॥లు పైబడిన వారికి 75%, 100 సం॥లు పైబడిన వారికి 100% అదనంగా పెన్షన్ చెల్లించాలని ప్రతిపాదిస్తున్నాము.

ఉద్యోగి రిటైరయిన / మరణించిన నాటికి పొందుతున్న చివరి వేతనం ఆధారంగా సర్వీస్ పెన్షన్, ఫ్యామిలీ పెన్షన్, రిటైర్మెంట్ గ్రాట్యూటీ మొత్తాలను లెక్కించు ప్రస్తుత విధానాన్ని మార్పు చేసి చివరి వేతనంలో 67% పెన్షన్ చెల్లించాలని మా సంఘం అభిప్రాయపడుతున్నది. ఉద్యోగి చనిపోయినప్పుడు అతని కుటుంబంలో వారికి కంపాషినేట్ అపాయింట్‌మెంట్ ఇవ్వలేని సందర్భంలో ఉద్యోగి చనిపోయిన నాటికి పొందుతున్న చివరి వేతనాన్ని అతనికి 58 సం॥లు వయసు వచ్చే వరకు ఆ కుటుంబానికి చెల్లించాలి. డెత్ గ్రాట్యూటీ రెట్టింపు చెల్లించాలి.

రిటైర్మెంట్ గ్రాట్యూటీ ప్రస్తుతం చెల్లించుచున్న విధంగానే చివరి వేతనం + డిఏపై లెక్కించి చెల్లించాలి. రిటైర్మెంట్ గ్రాట్యూటీ గరిష్ఠ పరిమితిని రూ.8,00,000/-ల నుండి రూ.15,00,000/-లకు పెంచాలని ప్రతిపాదిస్తున్నాము.

ఫ్యామిలీ పెన్షన్ కనీసం రూ.15000/-లుగా వుండాలి. కనీస ఫైనాన్షియల్ అసిస్టెంట్స్ 10వేలుగా ఉండాలి.

అంత్యక్రియలకు పెన్షనర్‌కుగాని, పెన్షనర్ భార్య / భర్తగాని, ముందుగా మరణించిన సందర్భంలోగాని, ఫ్యామిలీ పెన్షనర్ కాని రూ. 25వేలకు తగ్గకుండా యివ్వాలి. పెన్షనర్‌లకు కూడా ఇంటి అద్దె అలవెన్స్ చెల్లించాలి.

## జనరల్, మిస్‌లేనియస్ అంశాలు

మంచి నైపుణ్యం కల్గిన వారికి ప్రైవేట్ సంస్థలు మంచి జీతాలు చెల్లిస్తున్నాయి. అందుచేత ఎక్కువమంది అటే మొగ్గు చూపుతున్నారు. ఈ అంశాన్ని దృష్టిలో ఉంచుకొని ప్రతిభావంతులను ఆకర్షించుటకు వీలుగా ప్రభుత్వం ఎక్కువ జీతాలు చెల్లించాలి.

కాంపన్సేటరీ పెన్షన్ పథకాన్ని రద్దు చేసి పాత పెన్షన్ విధానాన్ని పునరుద్ధరించి కొనసాగించాలి.

ఇంతవరకు ఉపాధ్యాయులకు గృహ నిర్మాణం, వాహనం, కంప్యూటర్‌లు కొనుగోలు వగైరాలకు అప్పులివ్వడం లేదు. కొద్ది మేర ఫండ్ కేటాయించి ఉద్యోగులకు మాత్రమే ఈ అవకాశం కల్పిస్తున్నారు.

ఈ విధానాన్ని మార్చి ఉపాధ్యాయులకు పై సౌకర్యం కల్పించే విధంగా కొంత ఫండ్ కేటాయించే విధంగా సిఫార్సులు చేయాలని కోరడం జరిగింది.

ఎడ్యుకేషన్ ఫీజు రీయింబర్స్‌మెంట్ కూడ నామమాత్రంగా 2వేలు చెల్లిస్తున్నారు. దీనిని 5వేలకు పెంచి ఇంటర్ మీడియేట్‌కు 10వేలు, వృత్తి విద్యా కోర్సులు, పోస్ట్ గ్రాడ్యుయేషన్ వరకు విద్యార్థులు వాస్తవంగా చెల్లించే ఫీజును ప్రభుత్వమే చెల్లించే విధంగా సిఫార్సు చేయాలి.

ఏపిఎస్‌ఆర్‌టిసిలో ప్రయాణించే ఉపాధ్యాయులకు కూడ కన్సెషన్ సౌకర్యం కల్పించాలి. గ్రామీణ ప్రాంతాల్లో పనిచేసే ఉద్యోగులకు, ఉపాధ్యాయులకు ఈ సౌకర్యం కల్పించాలి. కన్సెషన్ 50%గా వుండాలి.

# టీచర్లపై

# లాకౌట్ ఆయుధ ప్రయోగం



ఎం.కోటేశ్వరరావు
ప్రముఖ పాత్రికేయులు

సమ్మె చేయలేదు,కనీసం ధర్నా వంటి నిరసనలు కూడా తెలపలేదు, సంప్రదింపులు పూర్తి కాలేదు, అయినా యాజమాన్యం ఏకపక్షంగా నెల రోజుల ముందే లాకౌట్ ప్రకటించటం ఆశ్చర్యంగా ఉంది కదూ. దీన్నే యజమానుల ఎదురుదాడి అంటారు. ప్రపంచ ధనిక దేశాలను కుదిపివేస్తున్న ఆర్థిక సంక్షోభం సమీప భవిష్యత్‌లో తొలగి పోయే సూచనలు కనిపించటం లేదని తాజా విశ్లేషణలు చెబుతున్నాయి. సంక్షోభ సమయంలో అతలాకుతలమైన జీవితాలకు రక్షణ కల్పించాలని కార్మికవర్గం తమ డిమాండ్లను యాజమాన్యాల ముందుంచటం సాధారణం. అలాంటిది కొత్తవాటిని కోరితే ఉన్నవాటికి కూడా హామీ ఉండదని బెదిరించేందుకు పాలకవర్గం పూనుకుంది. కార్మికవర్గంపై ఇతర ప్రజానీకాన్ని రెచ్చగొట్టేందుకు సైతం వెనుకాడటం లేదు. కీలక సమయాలలో ఉద్యోగ సంఘాలు తమ డిమాండ్లను ముందుకు తెస్తే విధిలేక ప్రభుత్వాలు అంగీకరించిన ఉదంతాలు ఉన్నాయి. అలాంటిది ప్రభుత్వమే డెన్మార్క్‌లో పరీక్షల ముందు పాఠశాలల సామూహిక లాకౌట్ ప్రకటించి సరికొత్త సవాలును సంఘటిత కార్మికోద్యమం ముందు ఉంచింది. లాకౌట్‌లను ఆకస్మికంగా ప్రకటిస్తారు. అయితే డెన్మార్క్ సర్కార్ ఏప్రిల్ రెండవ తేదీ నుంచి అమలులోకి వచ్చే లాకౌట్‌ను ఫిబ్రవరి 28నే ప్రకటించటం గమనించాల్సిన అంశం. మితవాదం, ఆర్థిక వాదానికి కార్మికోద్యమం గురైతే పోరాట పటిమను కోల్పోతుంది. డెన్మార్క్‌లో అదే జరిగింది. లాకౌట్ ప్రకటించగానే టీచర్లు తాము బోధనకు స్కూళ్లకు వెళతామని ప్రకటించినప్పటికీ తమ డిమాండ్లను ఒప్పుకోకుండా స్కూళ్లు తెరిచేది లేదని ప్రభుత్వం మూడువారాలకు పైగా మొండికేసింది.

ఐరోపాలో సంక్షోభం అంటే గ్రీసు, పోర్చుగల్, స్పెయిన్, ఇటలీ దేశాల పేర్లు ముందువరసలో ఉంటాయి. అలాంటిది ఆకస్మికంగా డెన్మార్క్ మరో రూపంలో ముందుకు వచ్చింది. టీచర్లను కూడా ఫ్యాక్టరీ కార్మికులుగా జమ కట్టిన ప్రభుత్వం ఏప్రిల్ ఒకటవ తేదీ నుంచి అమలు లోకి వచ్చే విధంగా 70 వేల మంది టీచర్లను బయటకు పంపుతూ ప్రాథమిక, సెకండరీ స్కూళ్లకు లాకౌట్ ప్రకటించింది. ఇటువంటి చర్య ప్రపంచంలో ఇదే ప్రథమం. దీంతో ఐరోపా వ్యాపితంగా నిరసన, ఖండనలు వెల్లువెత్తటం, తలిదండ్రుల నుంచి వత్తిడి రావటంతో తన వైఖరిలో ఎలాంటి సడలింపు లేకుండానే ప్రభుత్వం చివరి వారంలో లాకౌట్‌ను ఎత్తివేసింది. టీచర్లు ఎవరైనా తాము కార్మికులం కాదు, వైట్ కాలర్ ఉద్యోగులం అనుకుంటే ఈ ఉదంతంతో తాము కూడా కార్మికులమే అనుకోక తప్పదు. టీచర్లతో ప్రభుత్వానికి వివాదం ఎందుకొచ్చింది?

కార్మికులపై ఏడాదికేడాది పని భారాన్ని ఎక్కువ చేస్తూ ఉత్పత్తి ఎక్కువ చేయించు కొని తమ లాభాన్ని మరింత పెంచుకో చూడటం పెట్టుబడిదారుల నైజం అన్నది చరిత్ర చెప్పిన పాఠం. పని భారానికి వ్యతిరేకంగా చికాగో కార్మికులు ఉద్యమించి చారిత్రాత్మక మే దినోత్సవానికి నాంది పలికిన ఏప్రిల్ నెలలోనే డెన్మార్క్ పాలకులు తమ డిమాండ్లను టీచర్ల ముందు పెట్టారు. కార్మికులు తమ డిమాండ్లను యజమానుల ముందు పెట్టటం మామూలు విషయం. అందుకు భిన్నంగా యజమానులే తమ డిమాండ్లను ముందుకు పెడుతున్న వర్తమాన వాస్తవంలో భాగంగా ప్రభుత్వమే టీచర్ల ముందు తన డిమాండ్లను పెట్టింది. గతేడాది స్విడ్జర్లాండ్, నార్వే, డెన్మార్క్ ప్రభుత్వాలు వాటాదార్లుగా ఉన్న విమానయాన కంపెనీ అంతర్జాతీయ పోటీని ఎదుర్కొనేందుకు, నష్టాల పాలు కాకుండా ఉండేందుకు కార్మికులు త్యాగాలు చేయాలంటూ కార్మికుల హక్కులకు కోత పెట్టారు. ఇప్పుడు విద్యా సంస్కరణలు తెస్తున్నామని, వేతనాలు పెంచాలంటే టీచర్లు ఎక్కువ గంటలు బోధించాలని, ఆరుపదులు దాటిన తరువాత తక్కువ గంటల బోధన హక్కులను వదులుకోవాలని, గతంలో కుదుర్చుకున్న ఒప్పందంలోని అంశాల రద్దుకు కూడా అంగీకరించాలని డెన్మార్క్ సర్కార్ ప్రతిపాదించింది. దీనిపై సంప్రదింపులు జరిపేందుకు టీచర్లు తిరస్కరించటంతో ప్రభుత్వం వేతనాల చెల్లింపు నిలిపివేసింది. డెన్మార్క్‌లో ఉమ్మడి బేరసారాల ఒప్పందాలు రెండు, మూడు సంవత్సరాలు అమలులో ఉంటాయి. ఒప్పందం గడువు ముగియటంతో టీచర్ల కంటే ముందే గతేడాది చివరలో ప్రభుత్వమే సంస్కరణల పేరుతో తన డిమాండ్లను ముందుకు తెచ్చింది.

కార్మికవర్గం గతంలో సాధించుకున్న హక్కులు, సౌకర్యాలకు కోత పెట్టటం ఇప్పుడు సర్వసాధారణంగా జరుగుతోంది. డెన్మార్క్ విద్యారంగం, సామాజిక విధానాలు ఒక అభివృద్ధి నమూనాగా పెట్టుబడిదారులు గతంలో ముందుకు తెచ్చారు. ప్రస్తుతం అక్కడ వామపక్షంగా చెప్పుకొనే సోషల్ డెమొక్రటిక్ పార్టీ అధికారంలో ఉంది. రాబోయే రోజుల్లో ఇతర తరగతుల కార్మికవర్గంపై కూడా భారాలను మోపేందుకు ఒక ప్రయోగంగా టీచర్లతో ప్రారంభించారు. అయితే ఎడ్యుకేషన్ ఇంటర్నేషనల్‌కు అనుబంధంగా ఉన్న డేనిష్ యూనియన్ ఆఫ్ టీచర్స్(డిఎల్ఎఫ్) ప్రభుత్వ ఎత్తుగడను తిప్పికొట్టేందుకు తీవ్రంగా ప్రయత్నించలేదు. దీనికితోడు ఇతర యూనియన్లు టీచర్లకు మద్దతు ప్రకటించకుండా వేరు చేయటంలో ప్రభుత్వం సఫలమైంది. కుహనా వామపక్షాలన్నీ ప్రభుత్వానికి అండగా ఉన్నాయి. ఇలాంటి శక్తులే ఇప్పుడు అనేక దేశాలలో మితవాదులకు

ప్రత్యామ్నాయంగా చెప్పుకుంటూ ఓటర్ల ముందుకు వస్తున్నాయి. అధికారానికి వచ్చిన చోట్ల తిరోగమన విధానాలను అమలు జరుపుతున్నాయి. డేనిష్ వామపక్ష ప్రభుత్వం టీచర్లను ఇబ్బందులలో పెట్టేందుకు, పౌరులను వారిపై రెచ్చగొట్టేందుకు వీలుగా ఏప్రిల్ మాసంలో స్కూళ్లకు లాకౌట్ ప్రకటించింది. కొద్ది వారాలలో వార్షిక పరీక్షలు జరగ నుండగా నెల రోజుల పాటు స్కూళ్ల మూత తల్లిదండ్రులకు ఎంతో ఇబ్బంది కలిగించే అంశం. దేశంలో 82శాతం మంది కార్మికులుగా ఉన్న స్థితిలో అన్ని రోజులు పిల్లల కోసం సెలవులు పెట్టటం తల్లిదండ్రులకు కుదిరే పనికాదు. అందుకే ప్రభుత్వం టీచర్ల మెడలు వంచేందుకు లాకౌట్ ప్రకటించి పరోక్షంగా వత్తిడి తెచ్చింది.

ప్రస్తుతం డెన్మార్క్ టీచర్లు వారానికి 42గంటలు పని చేస్తున్నారు. దానిలోనే తరగతులకు ప్రిపరేషన్, బోధన, తలిదండ్రులతో సమావేశాలు, పరీక్ష పేపర్లు దిద్దటం వంటి పనులన్నీ ఉంటాయి. అయితే ప్రభుత్వం బోధనా ప్రిపరేషన్ కోసం కొన్ని గంటలు వినియోగించాల్సిన అవసరం లేదని ఆ మేరకు బోధించాలని వత్తిడి చేస్తోంది. తద్వారా టీచర్ల సంఖ్యను తగ్గించటం అసలు ఎత్తుగడ. ఇప్పటికే ఖాళీ అయిన పోస్టులను భర్తీ చేయటం నిలిపివేశారు. ప్రస్తుతం అక్కడ స్కూళ్లు ఉదయం ఎనిమిది గంటల నుంచి సాయంత్రం మూడున్నరవరకు పని చేస్తున్నాయి. దీన్ని కూడా పెంచాలన్నది ప్రతిపాదన.

సంస్కరణల్లో భాగంగా ఇంకా ఎలాంటి ప్రతిపాదనలను ముందుకు తెస్తున్నదో వెల్లడించేందుకు ప్రభుత్వం నిరాకరించింది. దీనిపై పార్లమెంట్ అంబుడ్స్‌మన్ స్పందిస్తూ వర్కింగ్ గ్రూప్ పత్రాలను పరిశీలించే అవకాశాన్ని ప్రభుత్వం టీచర్లకు ఇవ్వలేదని, కావాలనే ఇలా చేస్తున్నట్లు అనుమానించేందుకు ఈ చర్య తావిస్తోందని వ్యాఖ్యానించారు.

టీచర్లు పని సమయంలో 39.6శాతం మాత్రమే బోధనకు వినియోగిస్తున్నారని వారానికి 16 గంటలు బోధిస్తున్నారని ఇది చాలా తక్కువని స్థానిక సంస్థల మండలి ప్రభుత్వ కనుసన్నలలో నివేదికలు తయారు చేసింది. బ్రిటన్, ఆస్ట్రేలియాలలో వారానికి 35 గంటలు పిల్లలు స్కూల్లో ఉంటారని అలాగే ఇక్కడ ఉండాలని పేర్కొన్నది. అక్కడి పిల్లలు అలసిపోతున్నారని ఒకవైపు నివేదికలు విమర్శిస్తుండగా సంస్కరణల పేరుతో దాన్నే అమలు జరపాలని ప్రతిపాదించారు. ఈ మేరకు పత్రికల నిండా ప్రకటనలు కూడా ప్రచురించారు.

డెన్మార్క్ ప్రజాస్వామ్యం ఎలాంటిదంటే ఎవరైనా టెంట్‌లు వేసుకొని ధర్నాలు చేస్తే పోలీసులు తీసుకువెళ్లి గంటల తరబడి గొలుసులతో బంధిస్తారు. ఉద్యోగాల నుంచి తొలగిస్తారు. అందువలన టీచర్లు పిల్లలకు పాఠాలు చెప్పి నిరసన వ్యక్తం చేయాలని సూచించారు. అయితే ప్రభుత్వం ఇమెయిల్ వ్యవస్థకు తాళం వేసి పిల్లలను స్కూళ్లకు పంపమని తలిదండ్రులను కోరకుండా చేసింది ప్రభుత్వం. లాకౌట్ సమయంలో ఎవరైనా స్కూల్లో ప్రవేశిస్తే ఉద్యోగం ఖాళీ. అందుకే ప్రభుత్వం ప్రయోగించిన లాకౌట్ ఆయుధం దెబ్బను ఎలా కాచుకోవాలో అర్ధంగాక టీచర్లు అయోమయంలో పడ్డారు.

ప్రభుత్వం తలపెట్టిన విద్యా సంస్కరణలకు వ్యతిరేకంగా ఏప్రిల్ చివరి వారంలో మెక్సికో టీచర్లు లక్షల మంది వీధులలోకి వచ్చారు. విద్యార్థుల సామర్థ్యాన్ని పెంచే పేరుతో చేసిన చట్టసవరణకు పార్లమెంట్, మెజారిటీ రాష్ట్రాలు ఆమోదం తెలిపాయి. ఇక్కడ టీచర్ల యూనియన్లు ప్రభుత్వ అనుకూల వ్యతిరేక శిబిరాలుగా చీలిపోయాయి. అయితే టీచర్లను మభ్యపెట్టేందుకు ప్రభుత్వ అనుకూల యూనియన్లు కూడా సంస్కరణలకు వ్యతిరేకంగా ప్రదర్శనలకు పిలుపునిచ్చాయి. ప్రభుత్వ స్కూళ్ల వ్యవస్థను నాశనం చేసి దాని స్థానంలో ప్రయివేటు, మత సంస్థల యాజమాన్యాలను ప్రవేశ పెట్టాలన్నది ప్రభుత్వ యత్నం. బ్రిటన్‌లో పొదుపు చర్యలు, విద్యా సంస్కరణలకు వ్యతిరేకంగా రెండు యూనియన్ల నాయకత్వంలో ఏప్రిల్ చివరి వారంలో టీచర్లు ప్రదర్శనలు జరిపారు. జూన్‌లో సమ్మె జరపాలని పిలుపినిచ్చారు.

కథలు కవితల పోటీలో మొదటి బహుమతి పొందిన ...

# దెయ్యం చెట్టు



ఈ చెట్టుకి ఐదేళ్ళకోసారి వసంతకాలం
పచ్చనోట్ల పత్రాల్ని హామీల పువ్వుల్ని రాల్చి
ఓట్ల చిగుళ్ళతో పల్లవిస్తుంది
ఎప్పటికీ పుష్పించని పథకాల
మొగ్గల్ని మొలిపించుకుంటుంది
వేర్ల పాదాలతో గూడేల వైపు పాకి
గుడిసెల్లోని జనాలతో గుసగుసలాడుతుంది
సహపంక్తి భోజనాలకై చాపెక్కుతుంది
ఊరికోవేషం రోజుకో రంగూ మారుస్తూ
ఊసరవెల్లి అవతారమెత్తి
రోడ్డు షోల రథంపై రంకెలు వేస్తుంది
పగలంతా తాకికత్వ తత్వాలు పాడి
రాత్రి మతాన్ని మనుషుల్ని రెచ్చగొట్టి
కులపోరాట రచనకు కలాన్ని ఎత్తుతుంది
తన నీడలో తన విత్తునుకూడా మొలవనీయని చెట్టు
ఎన్నికల వసంతంలో కోయిలల్ని ఆహ్వానిస్తుంది
మత్తు ఫలాల మధుర రసాలను పంచి
బంధుత్వరాగం ఆలపిస్తుంది
చెట్టు ఆడే జూదంలో పిట్టలు పావులౌతాయి
నాలుగు రోడ్ల కూడళ్ళలో మైకులై మ్రోగుతాయి
పాడిన పాటనే పాడిపాడి తీసిన రాగమే తీసితీసి
కూసిన కూతలే కూసికూసి అలసిన రెక్కలతో
సాయంత్రం చెట్టు నీడలో విశ్రమిస్తాయి
నిద్రపట్టని చెట్టు మాత్రం రాత్రంతా వ్యూహాల్ని చిత్రించి
ఉదయాన్నే పిట్టల్ని లేపుతుంది....పాత పాట కోసం
మోసపోవడానికి అలవాటు పడ్డ మనిషి
పిట్టల పాటకు పరవశించిపోతాడు
పారవశ్యంలో ఓటు చిలుకను తొర్రలో వేస్తాడు
తొర్ర తలుపులు మూసుకుంటాయి
వసంతోత్సవం ముగుస్తుంది
ఊడలు సాగిసాగి, వేర్లు పాకి పాకి
చింకిరి పింకిరిగా, అస్తవ్యస్తంగా ఎదిగి
చెట్టు దెయ్యమౌతుంది




# పాఠశాల నిర్వహణ



ఎన్.కుమార్‌రాజా
గుంటూరు

వేసవి సెలవుల అనంతరం జూన్ 12న పాఠశాలలు పున: ప్రారంభం కానున్నాయి. బడిఈడు గల బాలబాలికలందరిని గుర్తించి ప్రభుత్వ మరియు ప్రభుత్వ గుర్తింపు గల పాఠశాలల్లో చేర్పించవలసింది గా పాఠశాల విద్యాశాఖ ఇప్పటికే సంబంధిత విద్యాశాఖాధికారులకు ఆదేశాలు జారీ చేసింది. మరోవైపు ప్రాథమిక స్థాయి తరగతుల విద్యార్థు లకు సంసిద్ధతా కార్యక్రమాలు పాఠశాలల్లో అమలు చేయవలసింది గా ప్రణాళికలు జారీ చేసింది. ఈ నేపథ్యంలో పాఠశాల నిర్వహణకు సంబంధించిన ఆం.ప్ర. ఎడ్యుకేషన్ నిబంధనలు (ఏఇఆర్) మరియు విద్యాహక్కు చట్టం అమలుకు రూపొందించిన ఉత్తర్వులలో పేర్కొన్న పలు అంశాలను తెలుసుకుందాము.

**అడ్మిషన్లు :**

(1) బడిఈడు గల బాలబాలికలను వారి వయస్సు ఆధారంగా ఒకటి నుండి ఎనిమిదవ తరగతి వరకు నేరుగా ఆయా తరగతులలో ప్రవేశం కల్పించవచ్చును.

(2) ఆగస్టు 31 నాటికి 5 సం॥లు నిండిన పిల్లలను ఒకటవ తరగతిలోను, 6 సం॥లు నిండిన వారిని రెండవ తరగతిలోను ఈ విధంగా ఎనిమిదవ తరగతి వరకు చేర్చుకొనవచ్చును.

(3) ప్రాథమిక తరగతులలో (1 నుండి 8 తరగతులలో) పిల్లలను చేర్చుకొనునప్పుడు పుట్టిన తేది డిక్లరేషన్ తల్లిదండ్రుల నుండి తీసుకోవాలి.

(4) వారికి ప్రవేశం కల్పించునప్పుడు ఎటువంటి ప్రవేశ పరీక్ష నిర్వహించరాదు.

(5) ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్య అమలులో ఉన్నందున వారి నుండి ఎట్టి ఫీజును వసూలు చేయరాదు. (కమీషనర్ మరియు డైరెక్టర్ ఆఫ్ స్కూలు ఎడ్యుకేషన్ వారి ఉత్తర్వులు ఆర్‌సి నం.247/ఇ1-2/2010, తేది.15.06.2010).

(6) తొమ్మిది మరియు పది తరగతులలో ప్రవేశం మాత్రము ప్రభుత్వ గుర్తింపు పొందిన పాఠశాలల నుండి పొందిన ట్రాన్స్‌ఫర్ సర్టిఫికెట్ (టిసి) ఆధారంగా కల్పించాలి. లేదా జిల్లా కామన్ ఎగ్జామినేషన్ బోర్డు నిర్వహించిన ప్రవేశ పరీక్ష ఉత్తీర్ణతా సర్టిఫికెట్ ఆధారంగా ప్రవేశం కల్పించవచ్చును.

(7) తొమ్మిది మరియు పది తరగతులకు స్పెషల్ ఫీజు సంవత్సరానికి రు.20/-లు చొప్పున వసూలు చేయాలి.

(8) గుర్తింపు పొందిన ప్రాథమిక పాఠశాలల ప్రధానోపాధ్యాయులు జారీ చేసిన రికార్డు షీటుపై విద్యాశాఖాధికార్ల ధృవీకరణ అవసరం లేదు.

(9) ఇతర రాష్ట్రాల నుండి ట్రాన్స్‌ఫర్ సర్టిఫికెట్ తెచ్చిన దానిని ఆయా రాష్ట్రాలలోని జిల్లా విద్యాశాఖాధికారులు ధృవీకరించాలి. మన రాష్ట్రంలో ఒక జిల్లా నుండి వేరొక జిల్లాకు మారితే ధృవీకరణ అవసరం లేదు.

**విత్‌డ్రాయల్స్ :**

(1) గుర్తింపు పొందిన ప్రాథమిక పాఠశాలలో ఐదవ తరగతి పూర్తి చేసిన విద్యార్థి ఆరవ తరగతిలో చేరుటకు ప్రాథమిక పాఠశాల ప్రధానోపాధ్యాయులు రికార్డు షీటు జారీ చేయాలి.

(2) ప్రాథమికోన్నత పాఠశాలలో 7వ తరగతి పూర్తిచేసిన విద్యార్థి ఎనిమిదవ తరగతిలో చేరుటకు ప్రాథమికోన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయుడు ట్రాన్స్‌ఫర్ సర్టిఫికెట్ జారీ చేయాలి.

(3) విద్యా సంవత్సరం మధ్యలో ఎవరైనా విద్యార్థి, వేరొక పాఠశాలకు మారాల్సి వస్తే రికార్డు షీటు / ట్రాన్స్‌ఫర్ సర్టిఫికెట్ విధిగా ఇవ్వాలి.

(4) ఏదేని కారణాలతో పాఠశాల విడచి ఒక సంవత్సరము గడచిన పిదప ట్రాన్స్‌ఫర్ సర్టిఫికెట్ కోరినట్లయితే ఒక రూపాయి రుసుము వసూలు చేయాలి (ఏఇఆర్-112).

**ప్రమోషన్లు :**

(1) ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్య అమలుకు ప్రభుత్వం చట్టం చేసినందున ప్రాథమిక తరగతులలోని విద్యార్థి డ్రాప్‌అవుట్‌గా ఉండరాదు.

(2) తొమ్మిది మరియు పది తరగతి విద్యార్థులకు హాజరు తగ్గిన యెడల పది శాతం వరకు పాఠశాల ప్రధానోపాధ్యాయులు కండోన్ చేయవచ్చును. అయితే ఇందుకు విద్యార్థి నుండి వైద్య ధృవపత్రము పొంది, ప్రత్యేక ఉత్తర్వులు జారీ చేయాలి. (జిఓ ఎంఎస్ నం.653,తేది.12.07.1979 మరియు జిఓ ఎంఎస్ నం.40, తేది.07.05.2002)

**సంస్థాగత ప్రణాళిక (ఇన్‌స్టిట్యూషనల్ ప్లాన్) :** ప్రతి పాఠశాల ప్రధానోపాధ్యాయుడు పాఠశాల సంస్థాగత ప్రణాళిక తయారు చేసుకొని ఉండాలి. విద్యా సంవత్సరము ప్రారంభానికి ముందుగా పాఠశాల అభివృద్ధికి, విద్యా ప్రమాణాల అభివృద్ధికి ప్రణాళిక సిద్ధం చేసుకొని, ఆ విద్యా సంవత్సరములో అమలు చేయాలి. సంస్థాగత ప్రణాళికలో (1) పాఠశాల పూర్వ చరిత్ర, (2) పాఠశాల స్థలం వివరాలు, (3) దాతల వివరాలు, (4) పాఠశాల రికగ్నిషన్ వివరాలు, (5) స్కూలు మేనేజ్‌మెంట్ కమిటీ వివరాలు, (6) పాఠశాల స్టాఫ్ ప్యాటర్న్ వివరాలు, (7) మంచినీటి వసతి వివరాలు, (8) శానిటరీ వివరాలు, (9) బోధన

మరియు బోధనేతర సిబ్బంది వివరాలు, (10) సైన్సు ల్యాబ్, కంప్యూటర్ ల్యాబ్, లైబ్రరీ వివరాలు, (11) పాఠశాల ఎన్‌సిసి, ఎన్‌జిసి, స్కౌట్ వివరాలు ఉండాలి.

విద్యా సంవత్సరం ప్రారంభంలోనే తరగతి మరియు ఉపాధ్యాయుల టైం టేబుల్ సిద్ధం చేయాలి. యూనిట్, టెర్మినల్, సంవత్సరాంత పరీక్షల నిర్వహణ ప్రణాళిక తయారు చేయాలి. సబ్జెక్టు ఉపాధ్యాయులతో చర్చించి యూనిట్ ప్లాన్ మరియు యాన్యువల్ ప్లాను తరగతి వారి, సబ్జెక్టు వారి తయారు చేయించి సిద్ధపరచాలి. సైన్సు రికార్డులు, కాంపోజిషన్లు, మ్యాపులు తయారి ప్రణాళిక, జాతీయ పండుగలు తదితర కార్యక్రమాల నిర్వహణ గురించి ప్రణాళిక సిద్ధం చేసుకొని ఆచరించాలి.

**నిర్వహించవలసిన ముఖ్య రిజిష్టరులు :** అన్ని పాఠశాలల ప్రధానోపాధ్యాయులు విధిగా ఈ దిగువ పేర్కొన్న రిజిష్టరులు నిర్వహించాలి. అవి (1) అడ్మిషను రిజిష్టరు, (2) విద్యార్థుల హాజరు పట్టీలు, (3) ఉపాధ్యాయుల హాజరు పట్టీ, (4) విద్యార్థుల కన్సాలిడేటెడ్ హాజరు పట్టిక, (5) సెంట్రల్ మార్క్స్ రిజిష్టర్, (6) స్టాకు రిజిష్టర్లు (ల్యాబ్, లైబ్రరీ, స్పోర్ట్సు, ఫర్నీచర్ మొ॥ విడివిడిగా), (7) టెక్స్ట్‌బుక్స్ ఇష్యూ రిజిష్టరు, (8) యూనిఫారమ్ ఇష్యూ రిజిష్టరు, (9) మిడ్ డే మీల్సు రిజిష్టరు, (10) పే బిల్ రిజిష్టరు (11) ఎక్విటెన్సు రిజిష్టరు (12) మూవ్‌మెంట్ రిజిష్టరు (13) స్టాఫ్ ఆర్డరు బుక్, (14) తీర్మానముల రిజిష్టర్సు, (15) బ్యాంక్ అకౌంట్స్ పాస్‌బుక్స్, (16) క్యాష్‌బుక్, (17) యుటిలైజేషన్ సర్టిఫికెట్స్ (18) స్టాఫ్ సెలవుల రిజిష్టరు, (19) విజిటర్స్ బుక్, (20) ఇన్‌స్పెక్షన్ రిజిష్టరు.

ఉన్నత పాఠశాలల ప్రధానోపాధ్యాయులు వీటికి అదనంగా మరికొన్ని రిజిష్టర్లు నిర్వహించవలసి వుంటుంది. అవి ....

(21) టర్మ్ ఫీ రిజిష్టరు, (22) డిఎఫ్‌సి రిజిష్టరు, (23) ఎబిసి రిజిష్టరు, (24) స్పెషల్ ఫీ క్యాష్‌బుక్, (25) లెడ్జరు, (26) ఇంక్రిమెంట్స్ రిజిష్టర్, (27) ప్రొసీడింగ్స్ నంబర్ల రిజిష్టరు (28) ఎల్‌పిసి పుస్తకము (29) ఎస్ఎస్‌సి ఆఫీసు కాపి రిజిష్టరు (3) స్కాలర్‌షిప్ ఎక్విటెన్సు రిజిష్టరు.

వీటితోపాటు పలు రకాల ఫైల్సు నిర్వహించడం అవసరం. అవి... (1) డిఇఓ ఆఫీసు ఫైలు, (2) జెడ్‌పి ఆఫీసు ఫైలు, (3) ఆర్‌జెడి ఆఫీసు ఫైలు, (4) డిసిఇబి ఫైలు, (5) ఆర్‌విఎం ఫైలు, (6) ఆర్ఎంఎస్ఏ ఫైలు (7) సిఎల్స్ ఫైలు, (8) మెడికల్ లీవ్స్ ఫైలు, (9) ఇంక్రిమెంట్స్ మంజూరు ఫైలు, (10) పే ఫిక్సేషన్సు ఫైలు, (11) ట్రెజరీ ఆఫీసు ఫైలు, (12) మెడికల్ రీయింబర్స్‌మెంట్ ఫైలు, (13) పెన్షన్సు ఫైలు, (14) జెన్యూన్ సర్టిఫికెట్స్ ఫైలు, (15) కాండోనేషన్ ఫైలు, (16) వోచరు ఫైలు మొదలగునవి.

**మరికొన్ని ముఖ్య విషయాలు :**

(1) ప్రభుత్వ మరియు గుర్తింపు పొందిన పాఠశాలల్లో పనిచేస్తున్న ప్రధానోపాధ్యాయులు, ఉపాధ్యాయుల విధులను జాబ్ చార్ట్‌గా పాఠశాల విద్యాశాఖ రూపొందించింది. వీటిని విధిగా పాటించాలి. (జిఓ ఎంఎస్ నం.13; తేది.08.01.1986 మరియు జిఓ ఎంఎస్ నం.54; తేది.01.06.2000).

(2) ప్రతి ఉపాధ్యాయుడు పాఠశాల ప్రారంభ సమయానికంటే ముందుగా పాఠశాలకు హాజరు అయి పాఠశాల అసెంబ్లీలో పాల్గొనాలి. తమ తరగతుల క్రమశిక్షణ చూసుకోవాలి. (డైరెక్టర్ ఆఫ్ స్కూల్ ఎడ్యుకేషన్ ఉత్తర్వులు ఆర్‌సి నం.90/ఇ1-2/02; తేది.07.06.2002).

(3) బోధనా పని ఉన్ననూ, లేకున్ననూ పాఠశాల వేళలలో ప్రతి ఉపాధ్యాయుడు పాఠశాలలోనే ఉండాలి (ఏఇఆర్-155).

(4) ఏ ఉపాధ్యాయుడు ప్రధానోపాధ్యాయుని యొక్క ముందస్తు అనుమతి లేకుండా సెలవు వాడుకొనరాదు. అనారోగ్య కారణములపై అయితే మెడికల్ సర్టిఫికెట్‌ను, సెలవు దరఖాస్తుకు జతపరచి పంపుతూ ముందు అనుమతి లేకపోయినా వాడుకొనవచ్చును. (ఏఇఆర్-154).

(5) పాఠశాలలో పనిచేయుచున్న ఉపాధ్యాయులు పూర్తికాలపు ఉద్యోగులు కనుక వారు ఇతరత్రా వ్యాపారములు, ప్రైవేటు ట్యూషన్లు చేపట్టరాదు (ఏఇఆర్-152).

(6) ప్రధానోపాధ్యాయుడు పాఠశాల అధిపతిగా పాఠశాల అంతర్గత యాజమాన్యమునకు బాధ్యత వహించును (ఏఇఆర్-77).

అలాగే రాష్ట్రంలోని అన్ని పాఠశాలలకు రాష్ట్ర ప్రభుత్వం అకడమిక్ క్యాలెండర్ రూపొందించి అందించడం జరుగుచున్నది. అందులోని అంశాలను ప్రధానోపాధ్యాయులు, ఉపాధ్యాయులు అధ్యయనం చేసి, ఆచరణలో పెట్టడం అవసరం. కావున పాఠశాలలు పున:ప్రారంభం కానున్న ఈ తరుణంలో పైన పేర్కొన్న ముఖ్య అంశాలను ప్రధానోపాధ్యా యులు, ఉపాధ్యాయులు అవగాహన చేసుకొని మన పాఠశాలలు ఆకర్షణీయంగా, అర్థవంతంగా, సమర్థవంతంగా పనిచేయడానికి కృషి చేయగలరని ఆశిద్దాము.

---

కథలు-కవితల పోటీలో ద్వితీయ బహుమతి పొందిన కవిత

## తిరుగుబాటు బావుటా



పురిమళ్ళ సునంద
ముదిగొండ, ఖమ్మం

అహంకార పద ఘట్టనల క్రింద
అస్తిత్వం అణచివేత
అనుచిత పదాల (సు) వాడి
ఆత్మగౌరవంపై అమానుష దాడి
మనో విశ్వాసాన్ని మట్టుపెట్టే మాటల తూటాలు
గుండె నిబ్బరాన్ని చెదరగొట్టే అహంకార ప్రసంగాలు
ఉనికి ఉసురుతీస్తున్న విషసంస్కృతి ఉరితాళ్ళు
అభివృద్ధిని అడ్డుకునే ఆంక్షల సంకెళ్ళు
ఆరిపోయే దీపాలుగా మార్చే అవమానాల గాయాలు
అండం నుండి అవసానందాకా
వెంటాడి వేటాడే మృగయా వినోదాలు
అతివలను కించపరిచే అదుపులేని వాచాలత్వం
అడుగడుగునా హక్కులను హరిస్తూ, కంటకాలను పరుస్తూ
ఆత్మస్థైర్యాన్ని కించపరిచిన చోట
మానవత్వం మంట గలిసిన వేళ
బాధలను విడమరిచి చెప్పలేక
మూగబోయిన భాష
ఆవేదనలకు రూపమివ్వలేక
అశ్రువులను ఒలికిస్తున్న హృదయం
అంతరంగంలో అణువణువూ పొగిలినపుడు
రగిలిన ఆత్మాభిమానం
హక్కుల కోసం పోరాడమని అగ్ని పర్వతంలా ఎగిసింది
సంకెళ్ళను తెంచుకోమని సునామీలా విరుచుకుపడింది
తిరుగుబాటు బావుటాను అవనియంత ఎగరేస్తూ.....

కథలు- కవితల పోటీలో మొదటి బహుమతి గెలుపొందిన కథ

# మార్పు




సంపటం దుర్గాప్రసాదరావు
కలెక్టరేట్ పోస్ట్, ఖమ్మం జిల్లా

"తాటి చెట్టూ కల్లూ కాదు... ఈత చెట్టూ ఇల్లూ కాదు
ఓ గువ్వల చెన్నా...నా మాట ఏద మంత్రం
నా మనసు రాజమంత్రం...."

"లచ్చీ...లచ్చీ...ఒసేయ్ లచ్చీ .... ఎక్కడ సచ్చావే నీ యవ్వ! మొగోడు ఇంటికి రాంగానే ఆడికి అన్నమెట్టి... మంచీ-సెబ్బరా నూనుకోవాలనే ఇంగితగ్నానం లేదటే" కస్సుమంటూ లేచాడు తాగిన మైకంలో జోగులయ్య.

"ఆ మాట నేనడగాల నిన్ను. అలా తాగొచ్చి నోటికొచ్చిన కూతలు కూత్తా వుంటే నాకూ సిర్రెత్తుకొత్తాంది. నాకూ సీమూ-నెత్తురుండాది ఆ..." అంటూ ముక్కు చీదుకుంటూ బదులిచ్చింది లచ్చి.

"ఏటే....ఏటే...మళ్లీ సెప్పు! నీకు సిర్రెత్తుకొత్తాందా! ఈ పచ్చడి మెతుకులు నా మొగాన పడేసినందుకు నిన్నేటి సేయాలా అని నాకూ రగతం కుతకుత లాడతాందే" అంటూ అగ్గి మీద గుగ్గిలం అయ్యాడు జోగులయ్య.

"అయితే ఇప్పుడేమంటా?" అంది బాధగా లచ్చి.

"ఏంటా? బువ్వలోకి నీసు ముక్కెట్టని నీకు ఇప్పుడు ముక్కెలిరుగు తాయంతే", హూంకరిస్తూ లచ్చి పైపైకి వెళ్తున్న జోగులయ్య రెక్క లొడిసిపట్టి

"ఏదీ? అమ్మ ఒంటి మీద దెబ్బేసి చూడు" అప్పుడే ఇంట్లోకి అడుగు పెడుతున్న పెద్ద కొడుకు శివుడు గద్దించాడు తండ్రి జోగులయ్యను.

"ఏటిరా? పెద్దంతరం, సిన్నంతరం లేకుండా నన్నే కొట్టేటంతటి పోటుగాడివయ్యావేటిరా?" పౌరుషం పొడుచుకొచ్చిన జోగులయ్య కొడుకు మాటలకు కస్సుమన్నాడు.

"కొట్టడం కాదు. తాగొచ్చి ఇలా రోజూ ఇంట్లో ఈరంగం ఏత్తా వుంటే సంపేత్తా కూడా" కొద్దిగా స్వరం పెంచి హెచ్చరిస్తున్న శివుడి నోటిపై చేతినడ్డుపెట్టిన లచ్చి

"ఒరేయ్...శివుడూ ఎంతైనా ఆడు నా పెనిమిటిరా....దైవంతో సమానంరా....... నీకు జన్మనిచ్చినోడురా! పైన తదాత్తు దేవతలుంటారట. అంతలేసి మాటలనకరయ్యా!" అన్నది లచ్చి.

"ఏటే అమ్మా! రోజూ తాగొచ్చి ఇల్లు పీకి పందిరేసేలాగా నీకు నరకం సూపిత్తా వుండే ఈ పెద్దమడిషి పై దైవమంటూ నీ కుందేమో గాని జాలి? నాకేమాత్రం లేదే" అనంటుండగా

"రోజుండే బాగోతమేగారా ఇదీ" అంటూ శివుడి తలపై చేతిని పెట్టి నిమురుతూ

"పెద్దోడా! పొద్దుననంగా బోయి ఈ ఏలకొచ్చావు. రాయ్యా... ఏడ్నీళ్లెట్టిన తానం సేసి, ఓ ముద్ద తిని పడుకో" అంటూ తల్లి ప్రేమను చూపించింది లచ్చి.

"అమ్మా! నా కోసం ఇట్టా సాలా రేతిరి దాకా ఎదురు సూడమాకే! పొద్దుగుంకంగనే ఇంతదిని పడుకోమని నీకెన్నిసార్లు చెప్పినా ఇనవాయే" అన్నాడు శివుడు.

"సర్లే గాని పెద్దోడా! పట్నంలో సదువుకుంటున్న మన సిన్నోడు గుర్తొత్తాండ్రా! పిచ్చి సన్నాసి ఎలాగున్నాడో ఏమో? ఏలకింత తింటున్నాడో లేదో?? మొన్నీ మద్దెన కరణంగోరబ్బాయి కాంతి బాబు గోరు వచ్చినప్పుడు సెప్పిన ఇషయాలు నీకు సెప్పాలనుందిరా" అన్నది లచ్చి.

"కాంతి బాబు ఏం సెప్పాడే?" అడిగాడు శివుడు.

"ఏముండాదిరా! డబ్బులు సాలక సిన్నోడు పట్నంలో చాలా కట్టాలు పడుతున్నాడని, వాడికవసరమైన కొంత డబ్బు తనే సరుదుబాటు సేసానని సెప్పాడురా" జాలిగా చెప్పింది లచ్చి.

"అవునే అమ్మా! సిన్నోడు ఎంతిబ్బంది పడుతున్నాడో ఏందో? పెద్దాసామి కిష్టయ్యగారి దగ్గర కెళ్ళి డబ్బులడక్కుత్తానే అప్పుగా" అంటూ శివుడు బయటికెళ్ళబోతుండగా

"శివుడూ! డబ్బులు తెత్తనట్టుగా మీ అయ్యగ్గానీ తెలిసిందో? ఇక మన కట్టాలు ఆ దేముడు కూడా తీర్సలేడురా! నువ్వు గమ్మున పోయొచ్చెయ్" అన్నది లచ్చి.

"అట్టాగేనమ్మా!" అంటూ వెళ్ళాడు కిష్టయ్య గారింటికి శివుడు.

"కిష్టయ్యగారూ....... కిష్టయ్య గారూ........"

"ఓ శివుడూ! నువ్వా? రా...రా...ఏంటీ ఇలా వచ్చావు?" అన్నారు కిష్టయ్య గారు.

"ఏం లేదయ్యగారూ! పట్నంలో సదూకుంటున్న మా సిన్నోడికి... అదే మా తమ్ముడు ఈరేసుకి డబ్బులవసరమై మీ కాన అప్పుగా తీసుకుందామని..." కొద్దిగా నసుగుతూ అడిగాడు శివుడు.

"దానికేముంది? ఎంతకావాలో తీసుకెళ్ళు" అన్నారు కిష్టయ్య.

"ఈ పాలికి ఓ పదేలు సర్దండయ్యా? సరిపోద్ది" అన్నాడు శివుడు.

"శభాష్ శివుడూ! నువ్వు రెక్కలు ముక్కలు చేసుకొని రోజంతా కష్టపడుతూ కూడా తమ్ముడి పెద్ద చదువులకు చూపుతున్న శ్రద్ధ ఫలించి తీరుతుంది" అన్నారు కిష్టయ్య.

"అంతా మీ అభిమానమండయ్యా! ఈ సంవత్సరంతో ఆడి సదువు పూర్తయితే మా కట్టాలన్నీ ఈడేరతాయయ్యా" అన్నాడు శివుడు.

"సరే! ఈ డబ్బు తీసుకెళ్ళి మీ నాన్న కంట పడకుండా జాగ్రత్తపడితే అదే పదివేలు. ఇదిగో! భద్రంగా తీసుకెళ్ళి మీ తమ్ముడు వీరేష్‌కి పంపించు" అన్నారు కిష్టయ్య.

ఇంటికి తిరిగొచ్చిన శివుడికి శివాలెత్తి పోతున్న తండ్రి నోట్లోనుంచి వస్తున్న మాటలు పెద్దగా, స్పష్టంగా వినపడుతున్నాయి.

"నీ పెద్దకొడుకు ఓ పేద్ద దొరోరాయే! ఇంత రాతిరేల ఏ రాసకార్యం ఎలగబెట్టడానికి ఎల్లినట్టో" ఒంటికాలు మీద లేచాడు జోగులయ్య.

"అమ్మ పెట్టదూ అడుక్కు తినానీయదు అన్న సందంగా సోయి లేకుండా మాట్టాడే నీలాటోల్లకి ఏది సెప్పినా బుర్రకెక్కదులే గానీ గమ్మున పడుకోవయ్యా" చిరాగ్గా అంది లచ్చి.

"ఏమేవ్! మీకెవురికి నేనర్థంకాకపోయినా నా సిన్నకొడుక్కి మాత్రం

నేనంటే పానమే. అది దగ్గరికే పోతా. రేప్పొద్దున్నే పట్నం పోతా" అంటూ చిన్న పిల్లాడిలా మారిపోయాడు గద్గద స్వరంతో జోగులయ్య.

తెల్లవారింది. ఊరంతా ఒకటే సందడి. ఎటు చూసినా ఈ దేశ భవిష్యత్తు మా చేతుల్లోనే ఉందన్న ధీమా కనపరుస్తున్న ఉడుకు నెత్తురు ఉరకలెత్తుతున్న సుశిక్షితులైన సైనికుల్లాంటి ఎన్ఎస్ఎస్ కాంప్ కొరకు వచ్చిన కాలేజీ పిల్లలతో ఆ పది రోజులూ పండగ వాతావరణం నెలకొంది. రామాపురంలో ఎటు చూసినా ఓ పక్క మురుగు కాల్వలు శుభ్రం చేసే వాళ్ళు, ఆ ఊరి బడి గదులకు సున్నం వేసే వాళ్ళు, మరో పక్క మొక్కలు నాటే వాళ్ళు, దూరం నుంచి చాటింపు వినపడుతోంది.

"ఈ రోజుతో పట్నం నుండొచ్చిన కాలేజీ పిల్లల సెమదానం కారెక్కరమాలు ముగింపుకొచ్చిన సెందర్భంగా ఈ రోజు సాయంత్రం మన ఊరి బడి అవరణలో నాటికలు, డాన్సులు పెట్టారు గనక అందరూ వచ్చి సూడండహో..." అంటూ దప్పుకొడుతూ చాటింపు వేశాడు ఓబులేసు.

ఆ రోజు సాయంత్రం ఊరు ఊరంతా కోలాహలంగా ఉంది. సీతాకోకచిలకల్లాంటి కాలేజీ పిల్లల ఆటలు...పాటలు... కేరింతలు...తుళ్ళింతలు....ఇంతలోపే ఓ వ్యాఖ్యాత ముందుకొచ్చి "ఇప్పటివరకూ మీరు చూసిన కార్యక్రమాలన్నీ ఒక ఎత్తు-ఇప్పుడు మీరు చూడబోతున్నారు ఓ అద్భుతమైన మ్యాజిక్...మ్యాజిక్..."అంటూ ఆ వ్యక్తి వెళ్ళగానే. తలపై పొడుగాటి టోపి, మెళ్ళో టై, చేతిలో ఓ పొన్ను కర్రను పట్టుకొని, కాళ్ళకు షూ వేసుకొని, నల్లని దుస్తులు ధరించిన ఆకర్షణీయమైన ముఖంగల ఓ పొడవాటి కుర్రాడు "రండి బాబూ రండి అందరూ చూడండి నా చేతిలో ఉన్న ఈ సీసాలో సారాయి వుంది. మీకేమైనా అనుమానం ఉంటే వచ్చి వాసన చూడొచ్చు..." అంటూండగానే ప్రేక్షకుల్లోనే ఉండి అంతా గమనిస్తున్న సారాయి ప్రియుడైన జోగులయ్య "అబ్బో ఆ వాసన ఈడదాకా వత్తానే ఉండాదిలే గాని అసలిసయమేమిటో సెప్పు" అన్నాడు సారాయి ప్రయోగమేమిటా అన్న కుతూహలంతో.

ఆ మాటకు బదులుగా వెంటనే ఆ కుర్రాడు "అ...అ...అసలు విషయానికొస్తున్నా ఆ పెద్దాయన పడే ఆరాటానికి జవాబుకొద్ది సేపట్లోనే మీ ముందుకొస్తుంది" అంటూ "నా దగ్గర ఉన్న ఈ చిన్న మాంసపు ముక్కను ఈ సారాయి ఉన్న సీసాలో వేస్తున్నాను చూసుకోండి" అంటూ ఆ సీసాను ప్రేక్షకులందరికీ కనపడేలా ప్రదర్శించగానే ఆ ప్రాంగణమంతా చప్పట్లతో మారుమ్రోగిపోయింది.

ఇదంతా గమనిస్తున్న జోగులయ్యకు తరువాత ఏమవుతుందోనన్న ఉబలాటం ఆగక "ఆ తర్వాత ఏటవుద్దీ..." అన్నాడు సాగదీతగా.

"చూడండి బాబూ! చూడండి!! మీ కళ్ళముందే నేను వేసిన ఈ మాంసం ముక్క ఏమవుతుందో తెలియచెప్పటానికి ఒక పదినిమిషాలు సమయం పడుతుంది. మీరు వేచి చూడండి. ఈలోగా మీ అందరినీ అలరించటానికి మా విద్యార్థులు ఒక మంచి పాటతో నృత్యం చేస్తారు" అన్నాడు. నృత్యం మొదలైంది. పది నిమిషాలు సాగింది. "ఒన్స్‌మోర్" అంటూ ప్రేక్షకులు ఈలలు...గోలలు...చప్పట్లు...వాటన్నిటినీ అధిగమించే స్వరంతో ఆ వ్యాఖ్యాత "మీరెప్పుడెప్పుడా అని ఎదురు చూస్తున్న రసవత్తర సన్నివేశం రానే వచ్చేసింది. చూడండి ఈ మాంసం ముక్కకు ఎన్ని రంధ్రాలు పడ్డాయో! పది నిమిషాలకే ఈ సారాయిలో పడ్డ మాంసం ముక్క ఇలా అయిందంటే రోజూ ఒళ్ళు తెలియక తాగే అమాయకుల గుండె జల్లెడలా ఎన్ని చిల్లులవుతుందో మీరే ఊహించుకోండి. ఒక్కసారి ఆలోచించండి. దయచేసి ఈ మహమ్మారి సారాయిని దరిచేరనీయకండి. ఊరి పొలిమేరల నుంచి తరిమి కొట్టండి". అనగానే జోగులయ్య శరీరంలో అణువణువూ కంపించటం మొదలయ్యింది.

జనంలోంచి మెల్లగా జారుకొని ఇంటికొచ్చిన జోగులయ్య పడుకుందామని మంచం మీద వాలాడే గాని అటూ ఇటూ దొర్లాడుతూ కంటి మీద కునుకు లేదు సరికదా పిల్లలు చూపిన ఆ మాంసం ముక్క తన ఒంట్లోదేమోనన్నంత రీతిగా మథన పడుతున్న భర్త జోగులయ్యను చూసిన లచ్చి "ఏందయ్యా! ఎప్పుడూ లేంది తాక్కుండా వచ్చినవ్ ఈ రోజు సిత్రంగ అగపడతండావే! ఏమైందయ్యా నీకూ? నిన్నిట్టా సూత్తాఉంటే ఓ పక్క బెయం మరో పక్క సంతోసంగానూ ఉండాదయ్యా. ఇగయ్యో నా మీన ఒట్టేసి సెప్పు. ఈ రోజులానే ఇలానే ఎప్పుడూ వుంటానని! నా కంటికి ఇప్పుడు నువ్వు మా రాజులా కనిపిత్తండావయ్యా! నాకు ఇయ్యాల పండగలా ఉండాది" అనే లచ్చి మాట పూర్తవకుండానే "లచ్చీ...నా బంగారు మా లచ్చీ... ఈ పండుగ మన ఇంట ఇక రోజూ ఉంటాదే! ఓలమ్మో ఆ కాలేజీ బాబులు సేసిన మాయా మచ్చింత్రాలు...అదేనే... ఇంగిలీసులో మ్యాజిక్కో గిజిక్కో ఏదో అంటారే అయి సూసినాంక... ఎవుడైనా తాగాడు అంటే ఆడు మనిషే కాదనీ అట్టాంటి ఎదవలు భూదేవికి బరువని సెప్పిన ఇదాయకం సానా సానా నచ్చేసిందే! లచ్చీ... లచ్చీ .... నన్ను సెమించే లచ్చీ...సత్తె పెమానకంగా నీమీదొట్టేసి సెపుతున్నా ఈ ఏల్టి నుండి ఆ మాయదారి సారా జోలికి పోనంటే పోనే" అనగానే లచ్చి కళ్ళల్లో నుండి గిర్రున నీళ్ళు తిరిగాయి పట్టరాని ఆనందంతో.

ఇదంతా తన తండ్రిని మార్చడానికి పట్నంలో ఉన్న చిన్న కొడుకు వీరేశ్ ఎన్ఎస్ఎస్ క్యాంప్ పేరుతో వచ్చి ఆడించిన నాటకమని ఆ పిచ్చి మాలోకం జోగులయ్యకు మాత్రం ఎప్పటికీ తెలియదు.

## విభిన్న ప్రతిభావంతుడు

వాడికి నోరే లేదు కాని
కళ్ళు మాట్లాడతాయ్
చెవులు చూస్తుంటాయ్
రహస్య శక్తి వానికెక్కడిదో
కాని అంతు పట్టకున్నది!
కళ్ళతో చూసింది కాళ్ళతో రాసేస్తాడు
చెవులు వినపడకున్నా
సంగీత సుస్వరాలు పలికేస్తాడు!
కాళ్ళసలే లేవు చేతులే ఆధారం
సంగీతానికి తగ్గట్టు
నృత్య విన్యాసం చేస్తాడు!
శారీరక వైకల్యమే కాని
భావానికి, అనుభవానికి తీసిపోని
బహుముఖ ప్రజ్ఞాశాలి
మనకంటె మెరుగైన మేధావి!
జాలిపడటం కాదు
తగిన ప్రోత్సాహమిద్దాం!
మనలో ఒకడిగా మన వాడుగా గుర్తిద్దాం!




# షికాగోలో ప్రభుత్వ పాఠశాలల మూసివేత

అమెరికా ప్రజాస్వామ్య చరిత్రలో మొట్టమొదటిసారిగా అత్యంత ప్రతిష్ఠాత్మకమైన స్కూళ్ళతోపాటు మొత్తం 50 పబ్లిక్ స్కూళ్ళను షికాగో రాష్ట్ర స్థానిక ప్రభుత్వం మూసివేస్తున్నట్లు ప్రకటించింది. షికాగో నగరానికి పడమర, దక్షిణం వైపుగానున్న అత్యంత నిరుపేదలుండే ఆవాస ప్రాంతాల స్కూళ్ళను మూసివేశారు. మొత్తం షికాగోలో వున్న 681 స్కూళ్ళలో మూసివేయబడినవి 8శాతం. నాలుగు లక్షలకుపై చిలుకు విద్యార్థులు ఈ 50 పాఠశాలల్లో చదువుతున్నారు. వీరంతా ఆఫ్రో అమెరికన్, హిస్పానిక్ జాతులకు చెందిన అతిపేద కుటుంబాల పిల్లలు. న్యూయార్కు టైమ్స్ పత్రిక కథనం ప్రకారం షికాగోలో 2001 నుండి 100 పాఠశాలలకుపైగా మూసివేశారు.

షికాగో పబ్లిక్ స్కూల్స్ సిస్టం (సిపిఎస్) ముఖ్య కార్యనిర్వహ ణాధికారి బార్బరా బెన్నిట్ నిధుల కొరత కారణంగా పాఠశాలలను మూసి వేస్తున్నట్లు పేర్కొన్నారు. స్కూళ్ళను మూసివేసినా నిధుల కొరత నుండి బయటపడేట్టు కనిపించడం లేదని అన్నారు. నాణ్యత కరువైన పాఠశాలలను మూసివేసి మెరుగైన, నాణ్యమైన విద్యనందించే ప్రదేశంలోని స్కూళ్ళకు ఈ విద్యార్థులను పంపిస్తామని బార్బరా పేర్కొన్నారు. అయితే నాణ్యమైన పాఠశాలలకు పంపుతామనే మాట నమ్మశక్యంగా లేదనే విషయం అనేక సర్వేలు చెబుతున్నాయని, ప్రభుత్వం కావాలనే ప్రభుత్వ విద్యను నిర్లక్ష్యం చేస్తున్నదని షికాగో టీచర్ల, యూనియన్ విమర్శిస్తున్నది. షికాగో ప్రభుత్వ చర్యను అమెరికన్ ఫెడరేషన్ ఆఫ్ టీచర్సు (ఏఎఫ్‌టి), నేషనల్ ఎడ్యుకేషన్ అసోసియేషన్లు సైతం తీవ్రంగా ఖండించాయి. ఈ చర్య ద్వారా పేద పిల్లలకు చదువును దూరం చెయ్యడం తప్ప మరొకటి కాదని విమర్శించాయి. కొత్త పాఠశాలలు తెరవకుండా ఉన్నవి మూసివేయడం చేస్తే విద్యార్థి, టీచరు నిష్పత్తిలో సంబంధం లేకుండా కిక్కిరిసిన తరగతి గదుల్లో విద్యార్జన చేయవలసి వస్తుందని వారన్నారు. విద్యార్థులు తమ ఆవాస ప్రాంతాన్ని విడిచి మరొక ఆవాస ప్రాంతంలోని స్కూళ్ళకు వెళ్ళటం స్థానిక పరిస్థితుల దృష్ట్యా (వివిధ ముఠాల మధ్యనున్న వైరం కారణంగా) క్షేమకరం కాదని సిటీయు పేర్కొంటున్నది. పాఠశాలల మూసివేతను షికాగోలోని 19% మాత్రమే కోరుకుం టున్నారని మిగతావారంతా వ్యతిరేకిస్తున్నారని షికాగో ట్రిబ్యూన్ పోల్ ఫలితాలు తెలుపుతున్నాయి.

అమెరికా ప్రభుత్వం ప్రభుత్వ విద్యారంగాన్ని బలహీనపరిచి ప్రైవేటు (చార్టర్ స్కూల్సు) స్కూళ్ళను బలోపేతం చేసే చర్యలు చేపడుతున్నా రనడానికి ఈ మూసివేత నిదర్శనంగా నిలుస్తుంది.

## సుశిక్షితులైన ఉపాధ్యాయులే దేశాభివృద్ధి, నాణ్యమైన విద్యకు మూలం

మే 23వ తేదీన బ్రస్సెల్స్‌లో యూరోపియన్ యూనియన్ అత్యున్నతస్థాయి సభలో పాల్గొన్న వక్తలు సుశిక్షితులైన, నిపుణులైన ఉపాధ్యాయుల చేతుల్లోనే విద్యారంగం, దేశాభివృద్ధి ఇమిడి ఉన్నాయని పేర్కొనడం విశేషం. ఆయా దేశాల విద్యామంత్రులు, అత్యున్నత స్థాయి మేధావులు ఈ సభకు హాజరైనారు. నాణ్యమైన, సమానమైన విద్యను అందించడంలో ఎదురవుతున్న అవకాశాలు, సవాళ్ళను సైతం చర్చల సందర్భంగా వారు ప్రస్తావించారు. 2015 అనంతర కాలంలో విద్య ప్రముఖ స్థానం ఆక్రమించబోతున్న విషయాన్ని వారు చర్చించారు. 2013 సెప్టెంబర్‌లో జరగబోయే ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీ సమావేశాల్లో ఈ అంశంపై చర్చ జరిగే అవకాశం ఉంది. ఈ సందర్భంగా రెండు ప్లీనరీ సమావేశాలను నిర్వహించారు.

మొదటిది: మెరుగైన, మరింత సమానమైన విద్యా విధానం; రెండవది: 2015 అనంతరం కాలంలో విద్య పాత్ర.

అందరికీ విద్యనందించడం లో అందరూ భాగస్వాములు కావాలని, విద్యనందించడంలో ఇంత కాలం నుండి ఎదుర్కొంటున్న సవాళ్ళ స్థానంలో మంచి అవకాశాలు వస్తున్నాయని, మన ప్రయత్నాలను ముమ్మరం చేయాలని యూరోపియన్ యూనియన్ కమీషనర్ ఆంద్రిస్ సభ్య దేశాల ప్రతినిధులకు సూచించారు.

విద్యపై ప్రజల్లో వస్తున్న చైతన్యానికి, ప్రభుత్వాలపై పెరిగిన వత్తిడికి యీ చర్చ ఒక ఉదాహరణ.

## ఉగ్రవాదుల దాడులతో పాఠశాలల్లో తగ్గిన హాజరు

నైజీరియాలో పాఠశాలలు ఉగ్రవాదుల దాడులతో బెంబేలెత్తు తున్నాయి. పాఠశాలల్లోకి జొరబడి టీచర్లను చంపడం, భవనాలను తగలబెట్టడం చేస్తున్నారు. అత్యధికంగా ప్రాథమిక పాఠశాలలు ఈ దాడులకు గురవుతున్నాయి. బోర్నో స్టేట్ విద్యా మంత్రిత్వశాఖ వెలువరించిన నివేదికలు పై అంశాలను తెలుపు తున్నాయి. దాడులతో భయాందోళనలకు లోనైన విద్యార్థులు పాఠశాల పేరు చెబితేనే వణుకుతున్నారు. కొందరేమో ప్రైవేటు ఇస్లామిక్ పాఠశాలలకు మారిపోతున్నారు. 6వారాల వేసవి సెలవుల అనంతరం మే 6వ తేదీన పాఠశాలలు తెరవ వలసి వున్నా మే నెలాఖరు వరకు మూసివేసే వున్నాయి. బోకో హరామ్ (బిహెచ్) అనే ఉగ్రవాద సంస్థ ఈ దాడులు తామే జరుపుతున్నట్లు ప్రకటించుకున్నారు. గత ఫిబ్రవరి మాసం నుండి ఈ దాడులు జరుగుతున్నట్లు పేర్కొంటున్నారు. బోర్నో స్టేట్‌లోనే 15000 ప్రాథమిక పాఠశాలల పిల్లలు బడులకు దూరంగా వుంటున్నారు.

దాడులకు గురైన పాఠశాలల వద్ద సాయుధ దళాలను గస్తీకి ఉంచడంతో కక్షతో దాడుల తీవ్రత పెరుగుతుందని పిల్లల తల్లిదండ్రులు భయపడుతున్నారు. తమ దాడులతో ఇటు పిల్లలను అటు టీచర్లను భయపెడుతున్న బోకోహరామ్ సంస్థనేత అబూబాకర్

షేక్ నైజీరియా ప్రభుత్వ మిలటరీ దళాలు మైదుగురిలోని ఇస్లామిక్ పాఠశాలలపై చేసిన దాడులకు ప్రతిగా తాము ఈ దాడులకు పాల్పడుతున్నట్లు పేర్కొనడం గమనార్హం. ప్రధానంగా వీరు మత సంస్థలు నిర్వహించే ఇస్లామిక్ పాఠశాలలను ప్రోత్సహించే క్రమంలో ఇది జరుగుతున్నట్లు తెలుస్తున్నది.

వాదప్రతివాదాలు ఏ కక్షతో, కార్పణ్యాలతో ఘర్షణలు పడినా పాఠశాలలను ధ్వంసం చేయడం టీచర్లను, విద్యార్థులను టార్గెట్ చేయడం సరైంది కాదు. మత సంస్థలైనా, ఉగ్రవాద సంస్థలైనా తమ అసమ్మతిని ప్రదర్శించే తీరు మాత్రం ఇది కాదని విశ్వ వ్యాప్తంగా విద్యాభిమానులు నైజీరియా ఉగ్రవాదుల చర్యలను తీవ్రంగా ఖండిస్తున్నారు.

## పాఠశాలల్లో లైంగిక వేధింపులు ఆందోళనకరం

మన దేశంలో ఇటీవలి కాలంలో బాలికలపై, యువతులపై నిత్యం జరుగుతున్న లైంగిక దాడులు, వేధింపులపై ఒక వంక నిరసన ఉద్యమాలు ఉవ్వెత్తున ఎగిసిపడుతున్నా మరోవంక ఈ హింస యధేచ్ఛగా కొనసాగుతున్నది.

హర్యానా రాష్ట్రంలోని ఒక్క రెవారి జిల్లా పాఠశాలల్లోనే 5-12 సం॥ల మధ్య వయసుగల వేయిమంది బాలికలపై లైంగిక హింస జరిగినట్లు ఒక సర్వే పేర్కొనడంతో సమస్య తీవ్రత వెలుగులోకి వచ్చింది. ఆ రాష్ట్ర విద్యాశాఖ మాదిరి సర్వే నిమిత్తం రెవారీ జిల్లాను ఎంచుకొని ప్రభుత్వ పాఠశాలల్లో పనిచేస్తున్న 60మంది మహిళా ఉపాధ్యాయులను నియమించింది. ఆ బృందం 443 ప్రాథమిక పాఠశాలలు, 99 ప్రాథమికోన్నత పాఠశాలలను వీరు సందర్శించి 30,000మంది బాలికల ను కలిసింది. ఒక్కో టీచరు 10మంది బాలికలతో మాట్లాడి విషయాలను సేకరించారు. అనేకమంది బాలికలు తాము హింసకు గురైనా ధైర్యంగా నోరు తెరచి బృందం సభ్యులకు వివరాలు తెలపలేదు. 1000మంది మాత్రం తమ బంధువులు, పక్కింటి వారు కొందరు పాఠశాల ఉపాధ్యాయులు తమను లైంగిక వేధింపులకు గురి చేస్తున్నారని తెలిపారు. 7,8 తరగతులు అభ్యసిస్తున్న 800మంది విద్యార్థినులు ఈ అంశాలపై వివరాలను ఇవ్వడానికి ఇష్టపడలేదు. తమపై జరుగుతున్న హింసను గూర్చి తమ తల్లులకు తెలిపినా మౌనంగా, నిస్సహాయంగా ఉంటున్నారని, ఎవరైనా ఫిర్యాదు చేస్తే అనంతర పరిణామాలు, దాడులకు భీతిల్లుతున్నారని ఆ విద్యార్థినులు ఆవేదన వ్యక్తం చేశారు. ఇంటా బయట రక్షణ కరువైన తాము ఎలా ప్రశాంతంగా చదువుకోగలమని, అందమైన బాల్యాన్ని ఎలా అనుభవించ గలమని ప్రశ్నిస్తున్నారు.

హర్యానా ప్రభుత్వం సర్వే రిపోర్టును చాలా తీవ్రంగా పరిగణించింది. రాష్ట్ర ముఖ్యమంత్రి భూపేందర్‌సింగ్ హుడా, విద్యాశాఖ మంత్రి గీతా భుక్కాల్ రాష్ట్రంలోని అన్ని పాఠశాలలను సందర్శించి సమస్య లోతుపాతులను సమీక్షించాల్సిందిగా రాష్ట్ర బాలల హక్కుల కమీషన్ సభ్యులను ఆదేశించారు.

## యుటియఫ్ గేయం



పల్లవి : చెన్నుపాటి ఆశయాల జ్యోతి మన యుటియఫ్
ఏవిఎస్ కలలు కన్న దీప్తి మన యుటియఫ్
మైనేని ఉద్యమాల స్ఫూర్తి మన యుటియఫ్
ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ మన యుటియఫ్
॥చెన్నుపాటి॥

చరణం-1 : ఐక్యమత్యమన్నదే మన సూత్రం రా
అలుపన్నది ఎరుగనిదే యుటియఫ్ రా ॥2॥
ఉద్యమాల బాటలో మనమే ప్రథమంరా
ఆశయాల సాధనలో "ప్రప్రథమమేను రా ॥2॥

చరణం-2 : ఆధిపత్యమన్నది మనలోన లేదురా
కార్యకర్త సైతం అధిపతియేనురా ॥ఉద్యమాల బాటలో॥

చరణం-3 : ఎర్రజెండా పట్టి ముందడుగు వేయరా
సమస్యల పరిష్కారం పోరాట ఫలమురా
॥ఉద్యమాల బాటలో॥

చరణం-4 : నాయకుడా నీరసపడే స్థితికి రావద్దు రా
నీవే నీరసపడితే "సంఘ బలమేముందిరా
॥ఉద్యమాల బాటలో॥

చరణం-5 : ప్రతీ సమావేశమందు ముందుండి నడవరా
నడిస్తేనే పొందిన ఫలితాలు మిగులునురా
॥ఉద్యమాల బాటలో॥

చరణం-6 : అవినీతి అంతమే మన లక్ష్యం రా
పట్టుదలతో నిలవడమే మన పంతం రా
॥ఉద్యమాల బాటలో॥

## ఎర్రెర్రని పతాక మెగిరింది



ప॥ ఎర్రెర్రని పతాక మెగిరింది
వెన్నెల పంచే జాబిలిలా
అరుణారుణ మై మెరిసింది
భూమాత పులకించేలా

చ॥ చెమట చుక్కలే పూపిరిగ
శ్రమజీవులే ప్రాణంగ
చిగురించే ఆశలు బలిమై
కష్టజీవుల కలలే పండేలా... ॥ఎ॥

చ॥ క్షణక్షణం ఆగని యంత్రంలా
ప్రతి పనిలో స్పందించే హృదయంలా
నవనాడులు స్పృశించే శోధనలో
ఫలితం నోచని పల్లెల్లో... ॥ఎ॥

చ॥ కారుచీకటి కమ్మిన కోనల్లో
కాయకష్టం చేసే కార్ఖానాల్లో
తీరనిదాహం స్వేదం ఆరని రోదనలో
గుండెతట్టే జేగంటయ్యింది

చ॥ అణువణువు ఎర్రని కణమై
ఆర్తనాదపు సుడిగుండాల్లో
చీకటి చీల్చే మెరుపయింది
బతుకు నావకు వెలుగయింది ॥ఎ॥



# విద్యా వికాస ఉద్యమం దిశగా అడుగులు వేసిన యుటియఫ్ 13వ రాష్ట్ర మహాసభలు

ఆంధ్ర ప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ (యుటియఫ్) 13వ రాష్ట్ర మహాసభలు రాష్ట్రంలో ప్రముఖ యాత్రా స్థలంగా ప్రసిద్ధికెక్కిన చిత్తూరు జిల్లా తిరుపతిలో 2013 ఏప్రిల్ 27,28,29 తేదీల్లో ఘనంగా జరిగాయి. నిరంతరం గోవిందనామస్మరణతో మారుమోగే తిరుమల యుటియఫ్ నినాదాలతో మారుమోగింది. వేలాదిగా తరలివచ్చిన గురు దేవుళ్ళతో వీధులన్నీ సందడి సందడిగా మారాయి. బ్రహ్మోత్సవాల సందర్భంగా ఆధ్యాత్మిక వాతావరణాన్ని మాత్రమే చూసిన తిరుమల పురజనులు సామాజిక స్పృహతో కుల, మత, ప్రాంతాలకతీతంగా, మనిషి మనుగడ లో కీలక భూమిక పోషించే ప్రభుత్వ విద్యారంగాన్ని రక్షించుకోవాలన్న తపన, అందరికీ సమానమైన, నాణ్యమైన విద్యనందించడం ద్వారానే సమాజంలోని అంతరాలు తొలగిపోతాయన్న విశ్వాసంతో, శ్రీకాకుళం నుండి చిత్తూరు, ఖమ్మం నుండి కరీంనగర్ వరకు కదలివచ్చిన యుటియఫ్ శ్రేణులతో తిరుమలలో మూడు రోజులు పండుగ వాతావరణం నెలకొన్నది. నగరమంతా అరుణవర్ణమైంది. యుటియఫ్ తోరణాలు, స్వాగత ద్వారాలు, అతిథులకు, ఆత్మీయ ఆహ్వానం పలుకుతున్న ఫ్లెక్సీలు, బ్యానర్లు, మహాసభలు ప్రారంభించిన ఎన్‌టిఆర్ స్టేడియం ప్రాంగణంలో అమరులను స్మరించుకుంటూ ఏర్పాటు చేసిన ప్రత్యేక ద్వారాలు అమరుల స్థూపం స్ఫూర్తిమంతంగా ఉన్నాయి.

ఊరూరా మహాసభల సంరంభాన్ని ప్రచారం చేస్తూ తరలివచ్చిన మహాసభల జాతాలు రాష్ట్ర వ్యాప్తంగా యుటియఫ్ వాణిని విన్పిస్తూ తిరుపతికి చేరుకున్నాయి.

ఏప్రిల్ 27వ తేదీ ఉదయం గత 12 మహాసభల సూచికలుగా తీసుకొచ్చిన పతాక జాతాలకు తిరుపతి రామానుజం సర్కిల్ వద్ద ఎమ్మెల్సీలు, యుటియఫ్ రాష్ట్ర నాయకత్వం ఘనస్వాగతం పలికారు.

ఆ పతాకాలను ఎన్‌టిఆర్ స్టేడియం ప్రాంగణంలో రాష్ట్ర ఆఫీస్ బేరర్లు స్వీకరించి ప్రతిష్ఠాపన చేయడం, పతాకావిష్కరణలతో మహాసభలు ఘనంగా ప్రారంభమయ్యాయి. ఎస్‌టిఎఫ్ఐ పతాకాన్ని గౌరవాధ్యక్షులు సిహెచ్.సుభాష్‌చంద్రబోస్, యుటియఫ్ పతాకాన్ని మాజీ ఎమ్మెల్సీ డి.రామిరెడ్డి ఆవిష్కరించారు. ఉద్యమ ప్రస్థానంలో అమరులైన వారికి అమరవీరుల స్థూపం వద్ద ఘనంగా జోహార్లు అర్పించారు. ఎన్.నారాయణ అధ్యక్షతన ప్రారంభ సభ జరిగింది. సమావేశం ప్రారంభంలో ఉద్యమ నిర్మాతలు చెన్నుపాటి లక్ష్మయ్య, ఏ.వెంకటస్వామి, మైనేని వెంకటరత్నం చిత్ర పటాలకు పూల మాలలు వేసి ఘనంగా జోహార్లు అర్పించారు. ఈ మహాసభల కాలంలో మరణించిన ప్రముఖులకు రాష్ట్ర కార్యదర్శి ఎన్.తాండవకృష్ణ సంతాప తీర్మానాన్ని ప్రవేశ పెట్టారు. పతాకావిష్కరణలు చేసిన సిహెచ్.సుభాష్ చంద్రబోస్, డి.రామిరెడ్డిలు సందేశాలు ఇచ్చారు. ఆహ్వాన సంఘం అధ్యక్షులు, ఎమ్మెల్సీ వై.శ్రీనివాసులు రెడ్డి చిత్తూరు జిల్లా చారిత్రక నేపథ్యాన్ని, ఉద్యమ ప్రస్థానాన్ని ప్రస్తావించి మహాసభ అతిథులు, ప్రతినిధులు, ఉపాధ్యాయులకు ఘనస్వాగతం పలికారు. ఎన్.నారాయణ మాట్లాడుతూ ఈ మహాసభల కాలంలో ఉద్యమపరంగా అనేక విజయాలు సాధించామని చెప్పారు. ఈ మహాసభలో విద్యారంగ అభివృద్ధి,ఆటంకాలు, పరిష్కారాల గురించి చర్చించాలని ముఖ్య మంత్రి, విద్యామంత్రులను ఆహ్వానించామని, ప్రాధాన్యత గలిగిన ఈ సమావేశానికి వారు హాజరు కాకపోవటం విచారకరమన్నారు. నాలుగు గోడల మధ్య కూర్చొని ప్రభుత్వ విద్యారంగాన్ని ధ్వంసం చేసే ప్రణాళికలు రూపొందించి అమలు చేస్తున్నారని ఎద్దేవా చేశారు. పాఠ్య పుస్తకాలు, దుస్తులు అన్నింటిని ప్రైవేట్ వారికి అప్పగించిన ప్రభుత్వం విద్యారంగానికి సంబంధించిన స్థాయి సంఘానికి కూడా కార్పొరేట్ ప్రతినిధిని చైర్మన్‌గా నియమించడమేమిటని ప్రశ్నించారు. ప్రభుత్వ విద్యారంగాన్ని బలోపేతం చేయడానికి ఈ మహాసభ దిశానిర్దేశం చేస్తుందన్నారు.



**మహాసభల్లో ప్రారంభోపన్యాసం చేసిన రాజ్యసభ సభ్యులు సీతారాం ఏచూరి మాట్లాడుతూ....**

మొదటిసారి 1986 యుటియఫ్ మహాసభలలో పాల్గొన్నాను. అప్పటి నుండి క్రమం తప్పకుండా యుటియఫ్ మహాసభలన్నిటికి హాజరవుతున్నాను. స్వగ్రామం కాకినాడ, పుట్టింది చెన్నయ్, పెరిగింది హైదరాబాద్, చదువుకున్నది ఢిల్లీ, ప్రాతినిధ్యం వహిస్తున్నది బెంగాల్‌కు. నేను భారతీయుడిని తప్ప ఏ ఒక్క రాష్ట్రానికీ చెందినవాడిని కాను. ఎస్ఎఫ్ఐ జాతీయ కార్యదర్శిగా ఉన్నప్పటి నుండి యుటియఫ్‌తో కలసి విద్యారంగానికి సంబంధించిన సమస్యలపై పనిచేశాము. పాలకుల విధానాలకు వ్యతిరేకంగా ప్రత్యామ్నాయ విధానాలను రూపొందించి యుటియఫ్ ప్రజల్లోకి తీసుకు వెళ్లింది. ఈనాడు రాష్ట్ర విద్యారంగం ఏ పరిస్థితుల్లో ఉన్నదో నారాయణగారు చెప్పారు. రెండు సం॥ల నుండి స్టాన్ ఫోర్డ్ యూనివర్శిటీ వాళ్లు నన్ను పిలుస్తున్నారు. అమెరికాలో ఉన్న ఒక యూనివర్శిటీ ఒక కమ్యూనిస్ట్‌నైన నన్ను పిలిచే సాహసం చేయడం ఏమిటి? ఆ యూనివర్శిటీ ప్రక్కనే సిలికాన్ వ్యాలీ ఉంది. అక్కడ ఎక్కువమంది తెలుగువారు. వాళ్లంతా ఒకప్పుడు ప్రభుత్వ విద్యనభ్య సించినవాళ్ళు. కాని ఈ రోజు ప్రైవేటీకరణ విధానాలతో ప్రభుత్వం ప్రభుత్వ విద్యారంగాన్ని నాశనం చేస్తోంది. తన బడ్జెట్‌తో ప్రభుత్వ పాఠశాలలను అభివృద్ధి చేయడం కాకుండా ప్రైవేటు స్కూళ్లను బలపరచేందుకు వినియోగిస్తోంది. ఆర్‌టిఇ యాక్ట్ పార్లమెంటు ఆమోదించినా ఈనాటికీ అమలు కావడం లేదు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఎవరి వాటా ఎంత అనే దానిపై కీచులాడుకుంటున్నాయి. ప్రతి యేటా 35,000 కోట్ల చొప్పున 5 సం॥లు ఖర్చు చేస్తే ఆర్‌టిఇ యాక్ట్‌ను అమలు పరచవచ్చని ఒక సంస్థ సర్వేలో తేల్చింది. 1,75,000 కోట్లు మొత్తం ఖర్చు చేయాల్సి వుంటుంది. 2జి స్పెక్ట్రమ్ కుంభ కోణం 1,76,000 కోట్లు, దాన్ని అదుపు చేస్తే అందరికీ విద్య అందేది. 2జి స్పెక్ట్రమ్‌లో నిజాలను బయటికి రానివ్వరు. అందుకు ఒక మంత్రిని బలి యిచ్చారు కదా! దీనితో సరి. బొగ్గు కుంభకోణంపై సిబిఐ అధికారి వెలిబుచ్చిన నిజాలు ఇవాళ పేపర్లో వచ్చాయి. కేంద్ర ప్రభుత్వం సిబిఐని జేబు సంస్థగా వినియోగించు కుంటూ నిజాలు బయటకు రాకుండా చూస్తోంది. ఈ బొగ్గు కుంభ కోణం 1,86,000 కోట్లు. ఈ డబ్బుతో 2 సం॥లపాటు ఈ దేశంలో ఆకలి కేకలు లేకుండా చూడవచ్చు. దేశంలో ఉన్న వనరులన్నీ ప్రజలకు వినియోగపడకుండా కుంభకోణాల రూపాల్లో పెద్దల చేతుల్లోకి పోతున్నాయి. దేశ ఆర్థికాభివృద్ధి రోజురోజుకీ తగ్గిపోతున్నది. గత యేడాది మన దేశ ద్రవ్య లోటు 5.20 లక్షల కోట్లు. అదే సందర్భంలో అదే ఏడాది కార్పొరేట్ శక్తులకు యిచ్చిన టాక్సుల రాయితీ 5.76 లక్షల కోట్లు. ఈ సొమ్ము టాక్సులుగా వసూలు చేసివుంటే దేశానికి ద్రవ్య లోటు ఉండేది కాదు కదా. ప్రజలకు కావలసిన అవసరాలతోబాటు మౌలిక వసతులు కల్పించగలిగి ఉండేవాళ్లు. అనేక లక్షల మందికి ఉద్యోగాలు దొరికి ఉండేవి. తద్వారా ఆర్థికాభివృద్ధి పెరిగేది. ధనికుల కిచ్చే రాయితీలు ప్రోత్సాహక మంటున్నారు. పేదలకిచ్చే రాయితీలు భారమంటున్నారు. ధనికులకిచ్చే రాయితీల వల్ల ఆర్థికాభివృద్ధి జరుగు తుందంటున్నారు. కాని ఈ సంవత్సరం వృద్ధిరేటు 5%కే పరిమితమయింది. ఇప్పుడో విదేశీ పెట్టుబడులకు ద్వారాలు తెరుస్తున్నారు. దీనివల్ల వచ్చే లాభాలు ఎవరికి చెందుతాయి? ఇవాళ దేశంలో 2 భారత దేశాలు ఏర్పడుతున్నాయి. ఒకటి ధనిక దేశం, రెండవది పేద దేశం. ఇలాంటి పరిస్థితులన్నిటికీ ప్రత్యామ్నాయ విధానాలు కావాలి. బిజెపి అప్పుడే అధికార పీఠం ఎక్కేసినట్లు, ఎవరు ప్రధాని కావాలి అనే అంశంపై కీచులాడుకుంటోంది. ప్రత్యామ్నాయ విధానాలు వామపక్షాలు మాత్రమే సూచిస్తున్నాయి. అలాగే పాఠశాల విద్యారంగంలో ప్రత్యామ్నాయం సృష్టించే దానికి యుటియఫ్ తనవంతు కృషి చేయాలి. ప్రజా ఉద్యమాలకు తోడ్పాటునివ్వాలి. వాటిలో భాగస్వాములు కావాలి. ఒక నూతన భారతదేశ నిర్మాణానికి మీరంతా కలసి వస్తారని ఆశిస్తున్నాను.

**ప్రొ॥ కె.నాగేశ్వర్ మహాసభలకు సందేశం యిస్తూ**

పిడిఎఫ్ ఎమ్మెల్సీలుగా గెలిచిన 9మందికి మద్దతు యిచ్చిన ఏకైక సంఘం యుటియఫ్. మీ ఆకాంక్షలకు అనుగుణంగా పని చేస్తున్నాం. గతంలో రోడ్లు వెడల్పు చేస్తున్నామంటూ ప్రక్కల చెట్లు నరికే వారు. ఇప్పుడో విద్యాహక్కు చట్టం అమలు చేస్తున్నామంటూ పాఠశాలలు మూసేస్తున్నారు. వచ్చే సంవత్సరం 3000 స్కూళ్లు మూతబడతాయి. మరో 5,10 సం॥లలోనే ప్రభుత్వ పాఠశాలలు మూతబడనున్నాయి. ఏ రాష్ట్రంలోనూ



లేనంతగా అనేకమంది విద్యాశాఖ మంత్రులు ఈ రాష్ట్రంలో ఉన్నారు. ఏ ఒక్కరికీ ఖాళీ లేదో లేక ఇందిరమ్మ కలల్లో విద్యారంగం లేదో? తెలుసుకోవాలి. అనేక రంగాల్లో రాష్ట్రం ముందుంటున్నది. కాని విద్యారంగం క్రిందనుండి లెక్క పెట్టుకోవాలి. పాఠశాలల్లో చేరుతున్న విద్యార్థుల సంఖ్య ప్రతీయేటా పెరుగుతూ ఉంది. 65000 ప్రాథమిక పాఠశాలలున్నాయి. ఆర్‌విఎం ద్వారా గత 12 ఏళ్లలో 19000 కోట్లు ఖర్చు పెట్టారు. అయినా ఈ పరిస్థితి ఎందుకు వచ్చింది? దీనికి ముందు 28% విద్యార్థులు ప్రైవేటు స్కూళ్లలో చదివేవారు. ఇప్పుడు 46% చదువుతున్నారు. ప్రభుత్వం అమలు చేస్తున్న పథకాలు ప్రైవేటు విద్యారంగాన్ని ప్రోత్సహిస్తున్నాయి. ఒక స్కూలు కనీసంగా ఉండాలంటే 1 హెచ్ఎం, అన్ని క్లాసులకు టీచర్లు, 150మంది పిల్లలు పూర్తి స్థాయిలో ఉంటే అది ఒక మోడల్ స్కూల్. కేరళలో ఇలాంటివి 98% వుంటే ఈ రాష్ట్రంలో 6% మాత్రమే ఉన్నాయి. పిల్లలున్నా రేషనలైజేషన్ పేరుతో టీచర్లను బదిలీ చేస్తున్నారు. ప్రభుత్వ అస్తవ్యస్త విధానాల వల్లనే ఈ రకమైన పరిస్థితులు ఏర్పడుతున్నాయి. ప్రైవేట్ కాలేజీల్లో ఎన్‌రోల్మెంట్ పెరగడానికి ప్రభుత్వ పాఠశాలల్లో ఇంగ్లీషు మీడియం ప్రారంభించారు. కంప్యూటర్ విద్య ప్రవేశ పెట్టి టీచర్లకు 2000/- మాత్రమే జీతం ఇస్తున్నారు. ఇలాంటి విధానాల వల్లనే ప్రైవేటు పాఠశాలల్లో ఎన్‌రోల్ మెంటు పెరుగుతోంది. దీనిపై పోరాడాల్సిన బాధ్యత యుటియఫ్‌పై ఉంది. దీనిలో మన పాత్ర ఏమిటి? యుటియఫ్ ప్రతీ కార్యకర్త స్కూలు ఎందుకు మూతబడుతున్నదో సర్వే చేయాలి. మనమే కారణమైతే సరి చేసుకోవాలి. లేకపోతే ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా పోరాడాలి. విద్య కోసం ఖర్చు చేయడానికి ప్రభుత్వాలు డబ్బుల్లేవంటున్నాయి. ఒక ఓబులపురం గనులు మాకు కేటాయిస్తే మా విద్యారంగాన్ని మేమే నిర్వహించుకుంటామని చెప్పవచ్చు. నాణ్యత కలిగిన విద్యను పేద పిల్లల హక్కుగా ఈ మహాసభ పిలుపునివ్వాలి.

**రాష్ట్ర జెఏసి చైర్మన్ వి.గోపాల్‌రెడ్డి**

రాష్ట్ర బడ్జెట్‌లో 18% విద్యపై ఖర్చు చేస్తున్నారు. కాని విద్యారంగం ఎడారిగా మారుతోంది. విద్యా సంస్కరణలన్నీ ప్రైవేటు విద్యా రంగంలో అమలు జరుగుతున్నాయి. హైదరా బాద్ కలెక్టరు నవీన్ మిట్టల్ అనేక స్కూళ్లు మూసేసారు. ప్రభుత్వరంగంలో నాణ్యమైన విద్య ఉంది, క్వాలిఫికేషన్ ఉన్న ఉపాధ్యాయులున్నారు. కాని వీరిని విద్యేతర కార్యక్రమాలకు వినియోగిస్తున్నారు. దీని వల్ల ప్రభుత్వ విద్య కుంటు బడుతుంది. బాలికలకు కావలసిన కనీస వసతులు ఏ పాఠశాలల్లోనూ లేవు. కేంద్ర ప్రభుత్వం చవటాయను నేనంటే, రాష్ట్ర ప్రభుత్వం నీకంటే నేను పెద్ద చవటనంటోంది. ఈ రెండు ప్రభుత్వాలు పోటీపడి విద్యారంగాన్ని నాశనం చేస్తున్నాయి. విద్యతోబాటు వైద్యరంగం కూడా ఇవే విధానాలతో నాశనమౌతోంది. సర్వీసు టాక్సుల ద్వారా లక్షల కోట్ల రూపాయల ఆదాయం వస్తుంది. దీనినంతా ప్రైవేటు వ్యక్తులకే ధారపోస్తున్నారు. చివరికి మంచినీళ్లు కూడా ప్రైవేటు వ్యాపార వస్తువుగా మారిపోయాయి. రోడ్లపై ప్రయాణం చేయాలంటే టాక్స్ కట్టాలి. ఇలా ప్రతీ రంగం ప్రైవేటీకరణకు గురి అవుతోంది. 2004 తర్వాత ఈ రాష్ట్ర ఉద్యోగులకు పెన్షన్ లేదు. కాంట్రిబ్యూటరీ పెన్షన్ స్కీమ్ తెచ్చి ఆ డబ్బంతా షేర్లలో పెడ్తున్నారు. 30 సం॥ల తర్వాత పెన్షన్ వస్తుందనే గ్యారంటీ లేదు. ప్రభుత్వాలు తమ మనుగడ చూసుకుంటున్నాయి తప్ప ప్రజల సమస్యలు పట్టించుకోవడం లేదు. పీఆర్‌సీ కమీషన్ ఏర్పాటైనా డిసెంబర్ లోపు ఎన్నికలు వస్తే పీఆర్‌సీ వచ్చే అవకాశం లేదు. కాంట్రాక్టు, పార్ట్‌టైమ్ ఉద్యోగులను రెగ్యులరైజ్ చేయాలి. ప్రభుత్వం జి.ఓ.177 రద్దు చేయాలి. రెడ్‌రెసల్ ఫోరమ్ ఏర్పాటు చేయాలి. మనకు సమ్మె చేసే హక్కు వుండాలి. ఈ మహాసభలకు ముఖ్యమంత్రి రాకపోవడం సరికాదు. ఉద్యోగులు, ఉపాధ్యాయులు, కార్మికులు పెట్టుకొనే ఏ సభకైనా ముఖ్యమంత్రి రావాలి. టీచర్లకు పాఠాలు చెప్పుకునే పరిస్థితి కల్పించాలి. వారికి విద్యేతర కార్యక్రమాలు అప్పగించవద్దు. ముఖ్యమంత్రికి ఇక్కడ జరిగే విషయాలన్నీ లేఖ ద్వారా తెలియజేయాలి.



**ఎస్‌టిఎఫ్‌ఐ ప్రధానకార్యదర్శి కె.రాజేంద్రన్**

13వ రాష్ట్ర మహాసభలు జరుపుతున్న సందర్భంగా యుటియఫ్‌కు అభినందనలు. దేశానికి స్వాతంత్ర్యం వచ్చి 65 సం॥లైనా 25% మంది విద్యకు దూరంగా వున్నారు. అందరికీ విద్య గరిపేందుకు ఆర్‌టిఇ యాక్ట్ కోసం పోరాడాల్సి వచ్చింది. పార్లమెంటు ఆమోదం పొందినా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య చట్టం అమలులో చాలా వ్యత్యాసం ఉంది. ఒకే విధంగా ఆలోచించే సంఘాలన్నిటినీ కూడగట్టి కేంద్రంపై వత్తిడి తెచ్చాం. 1,76,000 కోట్ల రూపాయల 2జి స్పెక్ట్రమ్ కుంభకోణం ద్వారా దోచిపెట్టారు. అదే విద్యపై ఖర్చు పెట్టి ఉంటే అందరికీ విద్య అందేది. అందుకే దీనిపై ఉద్యమాన్ని కొనసాగించాలని ఎస్‌టిఎఫ్‌ఐ నిర్ణయించింది. పాఠశాలలు తిరిగి తెరిచేనాటికి ప్రజా ఉద్యమంగా దీనిని మల్చాలి. మహిళా ఉపాధ్యాయినులు, విద్యార్థినులతో కోటి సంతకాలు సేకరించి బాలికావిద్యపై రాష్ట్రపతికి విజ్ఞాపన పత్రం అందించాలి. దీనిలో యుటియఫ్ ముఖ్యపాత్ర వహించాలి. ఉద్యోగ నియామకాల్లో కాంట్రాక్టు విధానాన్ని వ్యతిరేకించాలి. అప్రెంటీస్ వ్యవస్థకు వ్యతిరేకంగా పోరాడి సాధించుకొన్నారు. కాని చాలా రాష్ట్రాలలో ఈ వ్యవస్థ కొనసాగుతోంది. దీనిపై పోరాడుతున్న వారి పట్ల ప్రభుత్వాలు అమానుషంగా వ్యవహరిస్తున్నాయి. టీచర్లు మాత్రమే కాదు ఏ ఉద్యోగమైనా 45% కాంట్రాక్టు విధానంలో నియమిస్తున్నారు. సరళీకరణ ఆర్థిక విధానాల ఫలితంగా ఈ రకమైన సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి. యుపిఏ ప్రభుత్వమే కాదు ఎన్‌డిఏ ప్రభుత్వం కూడా ఇదే రకంగా వ్యవహరించింది. యుపిఏ-1 ప్రభుత్వ హయాం లో పిఎఫ్‌ఆర్‌డిఏ బిల్లు ఆమోదం పొందలేదు కాని యుపిఏ-2 ప్రభుత్వంలో అమలు చేస్తున్నారు. కేరళ, బెంగాల్, త్రిపుర ప్రభుత్వాలు మాత్రం సిపిఎస్ అమలు చేయలేదు. ఇప్పుడు కేరళలో అమలు చేయాలని చూస్తున్నారు. రిటైరు అయ్యే వారికి కనీస పెన్షన్ నిర్ణయించాలి. 70వ దశకంలో సరళీకరణ విధానాలు అవలంబించిన లాటిన్ అమెరికన్ దేశాలలో విప్లవాల వెల్లువ వచ్చింది. ప్రత్యామ్నాయ విధానాలను ముందుకు తెచ్చింది. ఎస్‌టిఎఫ్‌ఐ ప్రతిపాదించిన రెండు పోరాట కార్యక్రమాలు పూర్తి చేయడంలో యుటియఫ్ కీలకపాత్ర వహిస్తుందని ఆశిస్తున్నాను.



## విద్యా సదస్సు

విద్యారంగ విశ్లేషకులు, ఎమ్మెల్సీ వి.బాలసుబ్రహ్మణ్యం సదస్సుకు అధ్యక్షత వహించారు.

విద్యారంగ పత్రాన్ని ప్రధానకార్యదర్శి ఐ.వెంకటేశ్వరరావు ప్రతిపాదించారు. వివిధ రాజకీయ పార్టీల ప్రతినిధులు సదస్సులో పాల్గొని విద్యారంగ పత్రంపై మాట్లాడారు.

**కాంగ్రెస్ పార్టీ అధికార ప్రతినిధి, ఇరవై సూత్రాల కార్యక్రమం చైర్మన్ యన్.తులసిరెడ్డి మాట్లాడుతూ**



సమాజంలో ఎన్ని రంగాలున్నా విద్యారంగానికి విశిష్ట స్థానం ఉంది. తరగతి గదిలో సమాజానికి కావలసిన అన్ని రంగాల నిపుణులు తయారవుతారు. 2001 సెన్సస్ ప్రకారం 74.4% అక్షరాస్యత జాతీయ స్థాయిలోను 67.7% ఆంధ్రప్రదేశ్‌లో సాధించగలిగాము. మిగిలిన రాష్ట్రాలతో, జాతీయ స్థాయిలో పోల్చుకున్నా తక్కువే సాధించాం. మహిళా అక్షరాస్యత 59.7% మాత్రమే. ప్రాచీన భారతీయ విద్యా విధానం నాణ్యమైన విద్యను అందించింది. ఆనాడు ఇన్ని పాఠశాలలు లేవు. కాని సంస్కారంతో కూడిన చదువు ఉండేది. పోటీ ప్రపంచంలో మన విద్యార్థులు నిలదొక్కుకునే విద్యనందిస్తున్నామా? ఆలోచించాలి. రాజ్యాంగం రూపొందించుకున్న 10 సం॥లలోపే 6-14 బాలబాలికల అందరికీ విద్యనందించాలనుకున్నాము కాని సాధించలేకపోయాం. అందుకే

విద్యను ప్రాథమిక హక్కులలోకి తీసుకురావడం జరిగింది. 100% అక్షరాస్యత సాధించాలంటే పాఠశాలలు అందుబాటులో ఉండాలి. ఈ రాష్ట్రంలో 95% ప్రాథమిక, 96% ప్రాథమికోన్నత పాఠశాలలున్నాయి. 2500/- చొప్పున ట్రాన్స్‌పోర్టు చార్జెస్ యిస్తున్నారు. మౌలిక సదుపాయాల కల్పన జరుగుతోంది. రకరకాల గ్రాంట్స్ గతంకంటే మెరుగ్గా యిస్తున్నాం. ఆర్‌విఎం, ఆర్‌ఎంఎస్‌ఏ పథకాల ద్వారా వీటిని అందిస్తున్నా, ఇంకా ఇవ్వాల్సింది వుంది. ఉచిత పాఠ్య పుస్తకాలు, దుస్తులివ్వడం, ఇంగ్లీషు మీడియం పెట్టడం జరుగుతోంది. బాలికా విద్యను కస్తూర్బా పాఠశాలల ద్వారా ప్రోత్సహిస్తున్నాం. చిన్నారి చూపు ద్వారా ఆరోగ్యం, ఎస్‌ఆర్‌సి సెంటర్ల ద్వారా బడిబయట బాలలకు పాఠశాలలు నడుపుతున్నాం. 1,04,236 పాఠశాలలు, 4,95,000 టీచర్లు, 1,33,00,000 విద్యార్థులు మన రాష్ట్రంలో ఉన్నారు. నాన్‌టీచింగ్ స్టాఫ్ లేరనేది వాస్తవం. ఇది చాలా అవసరం. ఈ విషయాన్ని రాష్ట్ర ప్రభుత్వం దృష్టికి తీసుకువెళ్తాను. ఖచ్చితంగా దీని అమలుపై ప్రయత్నిస్తాను. ప్రతీ సంవత్సరం డిఎస్‌సి జరపాల్సిందే. క్యాలెండర్ సంవత్సరం విధానంలో దీనిని అమలు పరచేలా ప్రభుత్వంపై వత్తిడి తెస్తాను. బడ్జెట్ పెరిగినా % తగ్గుతోంది. ఇది పెరిగేటట్లు చూస్తాము. ప్రభుత్వం, టీచర్లు, తల్లిదండ్రులు, పిల్లలు అందరూ కలిస్తేనే విద్యారంగం బాగుపడుతుంది. బాలబాలికలను విద్యావంతులుగా తీర్చిదిద్దాల్సిన బాధ్యత ఉపాధ్యాయులపై ఉంది. అందరి సహకారంతో రాష్ట్రాన్ని సంపూర్ణ అక్షరాస్యత సాధించిన రాష్ట్రంగా తీర్చిదిద్దుదాము. అర్హతతో కూడిన, నాణ్యమైన విద్య అందించే దానిలో యుటియఫ్ కూడా ప్రముఖ పాత్ర వహించాలి.

**వైఎస్సార్ సిపి ప్రతినిధి భూమన కరుణాకరరెడ్డి**



తిరుపతిలో అన్ని పాఠశాలల్లో ఉచిత భోజన వసతి కల్పించాము. నగదు బదిలీ అంశం మాదికాదు. హక్కులతో బాటు బాధ్యతల గురించి కూడా నొక్కి చెప్పే సంస్థ అయిన యుటియఫ్‌కు అభినందనలు. మా పార్టీ అధికారంలోకి వచ్చినప్పుడు యుటియఫ్ చేసిన సూచనలన్నీ అమలు పరచాల్సిన బాధ్యత మాకు వుంటుంది. బడ్జెట్ కేటాయించడంతో సరిపోదు. ప్రభుత్వాలే విద్యను పోషించాలి. దానిని విస్మరించి ప్రైవేటు కళాశాలలకు ద్వారాలు తెరచి, ఆంగ్ల మాధ్యమంలో చదువుకుంటేనే భవిష్యత్ అనేటట్లుగా ప్రభుత్వం అభిప్రాయం కలిగించడం శోచనీయం. మేమంతా వీధి బడులలోనే చదువుకున్నాం. మాలో సంస్కారమైన అభిప్రాయాలు కలిగించారు మా గురువులు. యుటియఫ్‌లో వున్న టీచర్లందరూ ఇదే వైఖరితో ఉన్నారు. జీతభత్యాల పెరుగుదల కాదు, విద్యా ప్రమాణాలు పెంపుదల కోసమే ఈ మహాసభలు ప్రయత్నిస్తున్నాయి. మా ప్రభుత్వమే ఆ పరిస్థితులు సదుపాయాలు కల్పించడం తోబాటు, విద్యా ప్రమాణాలకు కృషి చేస్తాం.

**లోక్‌సత్తా పార్టీ ప్రతినిధి ఓంకార్**



యుటియఫ్ ప్రతిపాదించిన అన్ని అంశాలలో వాస్తవముంది. మీకు తోడుగా మేము ఉంటాము. 49% పాఠశాలలు ఒక్క టీచరుతోనే నడుస్తున్నాయి. ఉన్న ఒక్క టీచరు రాకపోతే స్కూల్సు మూత బడుతున్నాయి. పాఠశాలలలో ఎందుకు విద్యార్థులు తగ్గుతున్నారో విశ్లేషించకుండానే మూతబడుతున్నాయి. దీనంతటిపైన సర్వే చేసి, ఉపాధ్యాయ సంఘాలతో చర్చించి, ప్రభుత్వానికి ప్రతిపాదనలు యిచ్చాము. అన్ని రాజకీయ పార్టీలు, సంఘాలు అందరూ కలిసి డ్రాపవుట్లపై చర్చిద్దాం.

**సిపిఐఎం రాష్ట్ర కార్యదర్శి బి.వి.రాఘవులు**



గత 2 దశాబ్దాలుగా రాష్ట్ర విద్యా వ్యవస్థ దిగజారి పోతున్నది. టిడిపి, కాంగ్రెస్ ప్రభుత్వాలు రెండూ తమ విధానాల ద్వారా విద్యను ఒక సరుకుగా మార్చారు. డబ్బున్నవారికే చదువు తప్ప పేదలకు కాదన్నట్లు ప్రభుత్వాలు వ్యవహరిస్తున్నాయి. నాణ్యమైన విద్య కొందరికే లభిస్తోంది. విద్యలో క్వాలిటీ, క్వాంటిటీయే కాదు, ఈక్విటీ కూడా కావాలి. కొద్దిమంది బాగా చదువుకుని అంతర్జాతీయ ఖ్యాతి పొందితే చాలు. మిగిలినవారు ఏమైనా పర్వాలేదన్నట్లు ఉంది విద్యా మన వ్యవస్థ. విద్యను కొనుక్కోవడం నేర్చుకున్నవారు, అమ్ముకోవడం కూడా నేర్చుకుంటున్నారు. భారత్ ఎన్నటికీ సూపర్ పవర్ కాలేదు. నాణ్యమైన విద్య లేకుండా ఏ దేశమూ సూపర్ పవర్ కాదు. అమెరికాలో 92% ప్రభుత్వ పాఠశాలల్లోనే చదువుకుంటున్నారు. కాబట్టి సూపర్ పవర్ కాగలిగింది. ఉపాధ్యాయులు, ఎమ్మెల్సీలు మాత్రమే విద్యారంగాన్ని బాగు చేయలేరు. అందరినీ కలుపుకురావాలి. అంటే మన దగ్గర చదువుతున్న పిల్లల తల్లిదండ్రులందరినీ కలుపుకురావాలి. దానికి గాను వారికి చైతన్యం కలిగించాలి. ప్రజల భాగస్వామ్యం లేకుండా టీచర్లు, ప్రభుత్వంలో మాత్రమే చైతన్యం తెస్తే చాలదు. అనేక పాఠశాలలు తిరిగాను. ఎక్కడా టాయిలెట్స్ లేవు. పాఠశాలల్లో మౌలిక సదుపాయాలు కల్పించాలి. జీతాలు, భత్యాలు, హక్కుల గురించి పోరాడండి, సాధించండి. దానితోబాటు పాఠశాలల్లో ఉన్న సమస్యలపైన కూడా పోరాడండి. ఈ పోరాటంలో సమాజాన్ని భాగస్వామిని చేయండి. ఈ సంవత్సరం పాఠశాలలన్నీ సర్వే చేస్తాం. ప్రతీ పాఠశాలపైన రిపోర్టులు చేసేందుకు ప్రయత్నిస్తాం. ఎస్‌ఎంసిలను ప్రభుత్వంపై పోరాడేట్లు చేయాలి. అందరితో కలిపి ఒక ఉద్యమం నిర్మించి ప్రభుత్వంపై ఒత్తిడి తెద్దాం. దీనికి కావలసిన విశాల ఐక్య వేదిక నిర్మిద్దాం.

# మహాప్రదర్శన




ఐక్య ఉపాధ్యాయ సంఘం (యుటియఫ్) 13వ రాష్ట్ర మహాసభల ప్రారంభం సందర్భంగా 2013 ఏప్రిల్ 27న తిరుపతిలో భారీ ర్యాలీ నిర్వహించారు. మధ్యాహ్నం విద్యాసదస్సు అనంతరం మహాసభలకు రాష్ట్రం నలుమూలల నుండి విచ్చేసిన వేలాదిమంది ఉపాధ్యాయుల తో నగర వీధుల్లో భారీ ప్రదర్శన నిర్వహించారు. తారకరామా స్టేడియం నుంచి ప్రారంభమైన ర్యాలీ బాలాజీ కాలనీ, ప్రకాశం రోడ్డు, గాంధీ రోడ్డు మీదుగా ఆర్టీసీ బస్టాండ్ సమీపంలోని గాంధీ విగ్రహం వరకు సాగింది. ఈ ర్యాలీలో ఎమ్మెల్సీలు వై.శ్రీనివాసులురెడ్డి, విఠపు బాల సుబ్రహ్మణ్యం, డా॥ ఎం.గేయానంద్, బి.నాగేశ్వరరావు, కె.ఎస్.లక్ష్మణ రావు, మాజీ ఎమ్మెల్సీ జార్జివిక్టర్, ఎస్‌టిఎఫ్ఐ జాతీయ ప్రధాన కార్యదర్శి కె.రాజేంద్రన్, యుటియఫ్ రాష్ట్ర నాయకులు ఎన్.నారాయణ, సిహెచ్.సుభాష్‌చంద్రబోస్, ఐ.వెంకటేశ్వర రావు, పి.బాబురెడ్డి, ఎం.సంయుక్త, పి.మాణిక్‌రెడ్డి, సిహెచ్.రవి, ఎన్.కిష్టయ్య, కె.విజయ గౌరి, ఎ.నర్సిరెడ్డి, కె.ఎస్.ఎస్.ప్రసాద్, ఎన్.తాండవకృష్ణ, ఎస్.కె.సాల్జీ, టి.లక్ష్మారెడ్డి, ఎం.వెంకటేశ్వరరెడ్డి, బి.నరసింహారావు, జిల్లా నాయకులు జి.శ్రీరామమూర్తి, ఎన్.సోమచంద్రారెడ్డి, నిర్మల, వరలక్ష్మి, ఉదయలక్ష్మి తదితరులు పాల్గొన్నారు. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల నుంచి మహాసభల కోసం విచ్చేసిన జాతాలు ర్యాలీలో పాల్గొని సందడి చేశాయి. కోలాహలంగా సాగిన ఈ ర్యాలీని నగర ప్రజలు ఆసక్తిగా తిలకించారు.

## ప్రతినిధుల సభ

మే 28వ తేదీన మహతి ఆడిటోరియంలో 13వ రాష్ట్ర మహాసభల ప్రతినిధుల సభ ప్రారంభమైంది. అధ్యక్ష వర్గంగా సిహెచ్.సుభాష్‌చంద్ర బోస్, ఎన్.నారాయణ, పి.బాబురెడ్డి, ఎం.సంయుక్త, ఎ.నర్సిరెడ్డి, మినిట్స్ కమిటీకి కె.విజయగౌరి, కె.ఎస్.ఎస్.ప్రసాద్, యాదయ్య, తీర్మానాల కమిటీకి ఎ.నర్సిరెడ్డి. పి.బాబురెడ్డి, ఎం.వెంకటేశ్వరరెడ్డి, అర్హతల కమిటీకి బి. నర్సింహారావు, పి.వి. నర్సింహారావు, టి.మల్లేశ్వరరావు, ఆర్.నర్సింహ చారిలను మహాసభ ఎన్నుకున్నది.

## విద్యారంగంలో అన్ని మేనేజిమెంట్ల టీచర్లనూ ఐక్యం చేసి పోరాటాలు చేయాలి- ఎం.వి.ఎస్.శర్మ

ప్రతినిధుల సభను శాసనమండలి పిడిఎఫ్ ఫ్లోర్ లీడర్, ఎమ్మెల్సీ ఎం.వి.ఎస్.శర్మ ప్రారంభించారు. ఉపాధ్యాయ రంగంలో ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ (యుటియఫ్) ప్రత్యేక లక్షణాలతో పనిచేస్తున్న సంఘం. యుటియఫ్ నాయకులకు, కార్యకర్తలకు ఆశయ బలం ఉంది కనుకనే అనేక ఆటుపోట్లను తట్టుకొని ఉద్యమాన్ని ముందుకు



తీసుకు పోతున్నారు. విద్యారంగంలో క్షేత్ర స్థాయి నుండి ఎదురౌతున్న సమస్యలు ప్రస్తావిస్తూ ఉపాధ్యాయులు కూడ ప్రపంచీకరణ ప్రభావానికి లోనవుతున్నారని, సంఘ ప్రయోజనాలకంటే వ్యక్తిగత ప్రయోజనాలకు ప్రాధాన్యం యిస్తున్నారని ప్రభుత్వ పాఠశాలలను ప్రభుత్వం బలోపేతం చేయడానికి ప్రయత్నిస్తున్నట్లు పైకి కనిపిస్తుందని, లోతుగా పరిశీలన చేస్తే ప్రభుత్వమే ప్రభుత్వ పాఠశాలలను బలహీనం చేస్తుందన్నారు. విద్యారంగంలో వచ్చే సమస్యలపై సంఘటిత పోరాటాలను మరింతగా పెంచాలి. గతంలో ప్రభుత్వమే పని గట్టుకొని ఉపాధ్యాయ సంఘాలను చీల్చే పని చేసింది. అన్ని మేనేజిమెంట్లలో ఉపాధ్యాయులను ఐక్యం చేసే వాతావరణం తీసుకురావాలి. విద్యారంగంలో కాంట్రాక్ట్ టీచర్లు పెద్ద సంఖ్యలో వున్నారు. వీరిని ఐక్యం చేసి సంఘటితం చేయాలి. ప్రభుత్వ విద్యారంగాన్ని రక్షించుకొనేందుకు ఉపాధ్యాయ ఉద్యమంలో మరిన్ని ఐక్య పోరాటాలను చేసే దిశగా మహాసభ కర్తవ్యాలు, ప్రణాళికలు రూపొందించాలన్నారు.

## మహిళా సదస్సు

అంతరిక్షం నుంచి అంగన్వాడీ కేంద్రాల దాకా మహిళలు పని చేస్తున్నారని, అయితే వారికి భద్రత కరవవుతుందని యుటియఫ్ మహిళా సదస్సునుద్దేశించి స్విమ్స్ డైరెక్టర్ డా॥వెంగమ్మ అన్నారు. 2013 ఏప్రిల్ 28న జరిగిన మహిళా ఉపాధ్యాయ రాష్ట్ర సదస్సులో ఆమె మాట్లాడుతూ మహిళలపై జరుగుతున్న లైంగిక దాడుల నేపథ్యం లో కఠినంగా శిక్షించేందుకు నిర్భయ చట్టాన్ని సమర్ధవంతంగా అమలు చేయాలని డిమాండ్ చేశారు. యుటియఫ్ వంటి సంఘాలతోనే మహిళల్లో మనోస్థైర్యం ఏర్పడుతుందన్నారు. స్కూల్ టీచర్స్ ఫెడరేషన్ ఆఫ్ జాతీయ ప్రధానకార్యదర్శి కె.రాజేంద్రన్ మాట్లాడుతూ మహిళా ఉద్యోగులకు అండగా వుండేందుకు యుటియఫ్ వంటి సంఘాల్లో మహిళలకు సబ్ కమిటీలు ఏర్పాటు చేశామన్నారు. మహిళా ఉద్యోగుల జాతీయ కన్వీనర్ ఎం.సంయుక్త మాట్లాడుతూ మహిళా టీచర్లు, బాలికలు ఎదుర్కొంటున్న సమస్యలపై కేంద్రీకరించి తమ సంఘం పని చేస్తున్నదని చెప్పారు. మహిళా ఉపాధ్యాయులు, బాలికలు అధికంగా వున్న పాఠశాలల్లో మౌలిక సదుపాయాల కొరత వేధిస్తుందన్నారు. రాజీవ్ విద్యామిషన్ వంటి పథకాలు ప్రవేశపెట్టినా ఫలితం మాత్రం లేదన్నారు. దేశంలో జరుగుతున్న లైంగిక దాడులకు నిరసనగా దేశ వ్యాప్తంగా కోటి సంతకాల సేకరణ ఉద్యమం చేపడుతున్నట్లు ఆమె తెలిపారు. ఎస్‌టిఎఫ్ఐ జాతీయ నాయకురాలు సెల్వకుమారి మాట్లాడుతూ మహిళలను గడపదాటనీయడం, తల్లి కడుపు కూడా దాటనీయడం లేదన్నారు. దేశంలో జరుగుతున్న దాడులపై కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కఠిన చర్యలు తీసుకోవాలని డిమాండ్ చేశారు. సిఐటియు రాష్ట్ర కార్యదర్శి ధనలక్ష్మి మాట్లాడుతూ ప్రపంచీకరణ నేపథ్యంలో ఐక్య పోరాటాలు చేస్తేనే ప్రభుత్వాన్ని నిలదీయగలమన్నారు. రాష్ట్ర కార్యదర్శి కె.విజయగౌరి మహిళా సమస్యలపై పత్రం ప్రవేశ పెట్టారు. మహిళా నాయకురాలు డి.నిర్మల తీర్మానాన్ని బలపరుస్తూ మాట్లాడారు. యుటియఫ్ ప్రధానకార్యదర్శి ఐ.వెంకటేశ్వరరావు సందేశం యిచ్చారు. రాష్ట్ర మహిళా విభాగం నాయకులు సిహెచ్.దుర్గాభవాని సదస్సుకు ఆహ్వానం పలుకగా, డిఎల్ ప్రసన్నకుమారి వందన సమర్పణ చేశారు.

**సిఐటియు రాష్ట్ర కార్యదర్శి ధనలక్ష్మి సందేశం**



పాలకుల విధానాల ఫలితంగా అసంఘటిత ఉద్యోగుల సంఖ్య రోజు రోజుకీ పెరుగుతుందన్నారు. సంఘటిత, అసంఘటిత కార్మికుల సమస్యలపై జరుగుతున్న పోరాటాలలో ఉపాధ్యాయులు కూడా కలిసి రావాలని, సహకారం అందించాలని కోరారు. అదే విధంగా ఉపాధ్యాయులు చేసే పోరాటాలకు తమ సహకారం అందిస్తామన్నారు. వినాశకర విధానాలు ఎదుర్కొవాలంటే ఉద్యోగులు, ఉపాధ్యాయులు, కార్మికులు కలిసి పోరాడాలన్నారు. ఉపాధ్యాయులు, విద్యార్థులేకాక సమాజానికీ బోధకులు అని, ప్రపంచీకరణ దుష్ఫలితాలను అర్థమయ్యే పద్ధతిలో ఉపాధ్యాయులు చెప్పగలరని ఆ విధంగా తమకు సహకారం అందించాలని విజ్ఞప్తి చేశారు.

## నివేదికలు

సంఘం నివేదికను రాష్ట్ర ప్రధానకార్యదర్శి ఐ.వెంకటేశ్వరరావు ప్రవేశ పెట్టారు. గత రెండు సంవత్సరాల కాలంగా అంతర్జాతీయంగా, జాతీయంగా, రాష్ట్రంలోను జరిగిన రాజకీయ, ఆర్థిక, సాంఘిక పరిస్థితులను క్లుప్తంగా విశ్లేషించారు. ఈ కాలంలో విద్యారంగంలో వచ్చిన మార్పులు వివరిస్తూ ప్రభుత్వ విధానాల వలన ప్రాథమిక విద్య ప్రమాదంలో పడిందన్నారు. యుటియఫ్ స్వతంత్రంగాను, సమరశీలంగా పోరాటాలు చేసిందన్నారు. అప్రెంటిస్ రద్దు కోసం 8 రోజుల పాటు రాష్ట్ర అధ్యక్షులు ఎన్.నారాయణ, ఎమ్మెల్సీల కె.ఎస్.లక్ష్మణరావు, వై.శ్రీనివాసులురెడ్డి నిరవధిక నిరాహార దీక్షలు మరియు 2011 మే నుండి సెప్టెంబర్ వరకు చేసిన అవిశ్రాంత పోరాటాల వలన అప్రెంటిస్ వ్యవస్థ రద్దు కావడం చారిత్రాత్మక విజయం యుటియఫ్ సాధించిందన్నారు. ఎస్‌సి, ఎస్‌టి, బిసి అన్‌ట్రైన్డ్ ఉపాధ్యాయులకు నోషనల్ ఇంక్రిమెంట్లు, పాత పెన్షన్, పిఎఫ్ అమలు, మున్సిపల్, ఎయిడెడ్, గిరిజన సంక్షేమ ఉపాధ్యాయులకు 01.04. 2009 నుండి నోషనల్ ఇంక్రిమెంట్లు అమలు, గిరిజన సంక్షేమ ఉపాధ్యాయులకు సబార్డినేట్ సర్వీస్ రూల్స్, గిరిజన సంక్షేమ పాఠశాలలను స్పెషల్ డిఎస్‌సి సాధించుకోవడం వంటి చారిత్రాత్మక విజయాలు సాధించుకోవడం జరిగిందన్నారు. పండితుల, పిఇటిల అప్‌గ్రేడేషన్, 398 స్పెషల్ టీచర్లకు నోషనల్ ఇంక్రిమెంట్లు, ఎంఇఓ పోస్టుల భర్తీ, విజయవాడ, విశాఖ ఉపాధ్యాయులకు 010 హెడ్ జీతాలు, మున్సిపల్ సర్వీస్ రూల్స్, ఎయిడెడ్ ప్రమోషన్లు, రేషనలైజేషన్, యాక్టులు రద్దు వంటి సమస్యలపై కేంద్రీకరించి పోరాడామన్నారు.

జెఏసీ ఆధ్వర్యంలో జరిగిన సమావేశాలు, పోరాటాలు, ప్రాతినిధ్యంలో పాల్గొన్నామని, ఎస్‌టిఎఫ్ఐ కార్యక్రమాలను జయప్రదం చేయడం జరిగిందన్నారు. సంఘ నిర్మాణం, పని విధానాన్ని సమీక్షించారు. ఈ రెండేళ్ళ కాలంలో ప్రోగ్రెసివ్ డెమోక్రటిక్ ఫ్రంట్ తరపున మన ఎమ్మెల్సీలు ఉపాధ్యాయరంగ సమస్యలు పరిష్కారానికి మంచి తోడ్పాటునందించారన్నారు. ఇతర రంగాల సమస్యల పరిష్కారానికి కృషి చేసారన్నారు. కోశాధికారి పి.మాణిక్‌రెడ్డి ఆర్థిక నివేదికను ప్రవేశపెట్టారు.

ఐక్య ఉపాధ్యాయ ప్రధానసంపాదకులు సిహెచ్.రవి పత్రిక నివేదికను ప్రవేశపెట్టారు. ఉపాధ్యాయుల్లో ఐక్య ఉపాధ్యాయ పట్ల మంచి ఆదరణ ఉన్నదని, ఉపాధ్యాయుల ఆకాంక్షలకనుగుణంగా పత్రిక నిర్వహిస్తున్నామని, వివిధ శీర్షికల ద్వారా సమాచారం యిస్తున్నామని చెబుతూ ఈ రెండేళ్ళకాలంలో ఐక్య ఉపాధ్యాయ నిర్వహణను సమీక్షించారు.

నివేదికలపై జరిగిన చర్చలలో జి.గిరిధర్, సిహెచ్.రవీంద్ర (శ్రీకాకుళం), అశోక్, జ్ఞానమంజరి (మెదక్), డి.రాము, జి.వెంకట్రావు (విజయనగరం), బి.లక్ష్మిరాజా (కడప), కె.వెంకటేశ్వర్లు (కరీంనగర్), సి.చంద్రశేఖర్ (నెల్లూరు), సి.లక్ష్మణరావు (ఆదిలాబాద్), ఎస్.శ్రీకాంత్, బి.ఎస్.ప్రకాశరావు (పశ్చిమగోదావరి), కె.కె.జాజులు, జి.కె.స్వామి (విశాఖ), జి.వి.తాతారావు, జి.రమేష్ (కృష్ణ), సిహెచ్. రాములు (నల్గొండ), ఎం.ఆంజనేయులు, ఇ.గాలయ్య (రంగారెడ్డి), ఏ.రమాదేవి (హైదరాబాద్), ఎన్.విజయభాస్కర్ (అనంతపురం), సోమశేఖర్ (వరంగల్), ఎ.పోశెట్టి(నిజామాబాద్), ఎన్.అరుణకుమారి, కె.సత్తిరాజు (తూర్పుగోదావరి), వై.మనోహర్ (కర్నూలు), ఈశ్వరరావు, ఎం.హనుమంతరావు (గుంటూరు), పి.జె.విలియం, వీరారెడ్డి (ప్రకాశం), ఎన్.వీరబాబు(ఖమ్మం), ఎన్.వెంకటేష్, ఎం.వెంకటప్ప (ఎం.నగర్), ఎస్.రహమాన్ (చిత్తూరు), మహిళలు కనకదుర్గ (పశ్చిమగోదావరి), శ్రీదేవి (నెల్లూరు), సుమిత్ర (వరంగల్), ప్రేమమ్మ (ప్రకాశం), డి.నవభారతి (కృష్ణ), సరోజినిదేవి(తూ॥గో॥) పాల్గొన్నారు.

ఎమ్మెల్సీ వి.బాలసుబ్రహ్మణ్యం పిడిఎఫ్ తరపున చేసిన కృషిని వివరిస్తూ సందేశం యిచ్చారు. ప్రభుత్వ విద్యారంగ పరిరక్షణకు ఈ మహాసభ కర్తవ్యంగా తీసుకొని ఉద్యమించాలన్నారు.

## తీర్మానాలు

సంఘ నిబంధనావళికి సవరణలు, పండిత, పిఇటి పోస్టుల అప్‌గ్రేడేషన్, స్పెషల్ టీచర్ల సమస్యపై, రేషనలైజేషన్, విద్యాహక్కు చట్టంపై, గిరిజన విద్యారంగంపై, ఎయిడెడ్ సమస్యలపై, మున్సిపల్ సమస్యలపై, హెల్త్‌కార్డుల పై, ప్రభుత్వ విద్యారంగ పరిరక్షణ సమస్యలపై రాష్ట్ర ఆఫీస్ బేరర్లు తీర్మానాలు ప్రవేశ పెట్టారు.

చర్చల అనంతరం మహాసభ నివేదికలు / తీర్మానాలను ఏకగ్రీవంగా ఆమోదించింది. ఏప్రిల్ 29 మధ్యాహ్నం ఉద్యమ సీనియర్ నాయకులు ఎం.ఏ.కె.దత్తు నూతన కమిటీలకు ఎన్నికలు నిర్వహించారు. 117 మంది కార్యవర్గాన్ని మహాసభ ఏకగ్రీవంగా ఎన్నుకున్నది. కార్యవర్గం ఆఫీస్ బేరర్లను, ఆడిట్ కమిటీని ఎన్నుకున్నది. మహాసభలను జయప్రదంగా నిర్వహించిన చిత్తూరు జిల్లా శాఖకు మహాసభ అభినందనలు, ధన్యవాదాలు తెలియజేసింది.




**పూనూరి బాబూరావు** ఎస్‌జిటి, ఎంపిపిఎస్, కొండెపి, ప్రకాశం జిల్లా. 31.03.2013న ఉద్యోగ విరమణ సందర్భంగా ఐక్య ఉపాధ్యాయకు విరాళం రూ.500/-లు

# ఐక్య ఉపాధ్యాయ పత్రిక నివేదిక

## (2011 మే నుండి 2013 ఏప్రిల్ వరకు)

పత్రికలు, మీడియా ప్రజాస్వామ్యానికి పట్టుకొమ్మలు. భారత స్వాతంత్ర్య ఉద్యమంలో సైతం ప్రజలను చైతన్యపరచడంలో, జాతీయోద్యమాన్ని సక్రమ మార్గంలో నడిపించటంలో పత్రికలు కీలక పాత్ర పోషించాయి. అయితే పత్రిక యాజమాన్యం వర్గ ప్రయోజనాలకనుగుణంగానే ఆయా పత్రికలలో భావజాల వ్యాప్తి జరుగుతుంటుంది. అత్యధిక వార్తా పత్రికలు పెట్టుబడిదారుల యాజమాన్యంలోనే నిర్వహించ బడుతున్నాయి. కనుక ఆ వర్గ ప్రయోజనాలను కాపాడడానికే అవి పరిమితమౌతున్నాయి. ఇటీవలి కాలంలో పెట్టుబడిదారుల మధ్య, పాలకుల మధ్య వస్తున్న పరస్పర ఘర్షణలలో ఆయా కుటుంబాలు, వ్యక్తుల ప్రయోజనాల రక్షణ కోసమే పరిమితమై జర్నలిజం విలువలను కూడా దిగజారుస్తున్న పత్రికలను గమనిస్తున్నాము. అదే క్రమంలో పీడిత ప్రజల ఆకాంక్షలను ప్రతిబింబిస్తూ, పాలకుల ప్రజా వ్యతిరేక విధానాలను తూర్పారబడుతూ, సమస్త వృత్తుల ప్రజానీకం శ్రేయస్సును కాంక్షిస్తూ ఆయా వర్గాలను నిత్యం చైతన్యపరుస్తూ కర్తవ్య బోధ చేస్తున్న పత్రికలూ కొన్ని వున్నాయి. మన "ఐక్య ఉపాధ్యాయ" మాస పత్రిక కూడా ఆ కోవకు చెందినదే. సాధారణ ప్రజలు, ఉద్యోగులు, ఉపాధ్యాయులు, కార్మికులు, రైతుల విస్తృత భాగస్వామ్యంతో ఆయా వర్గాల ప్రజల ఆకాంక్షలను ప్రతిబింబించే 10 టీవీ లాంటి ఎలక్ట్రానిక్ మీడియా ప్రారంభం కావడం కూడా ఇటీవలి కాలంలో ఒక ఆశావహ పరిణామం. యుటియఫ్ కార్యకర్తలు, ఉపాధ్యాయులు కూడా 10 టీవీ యాజమాన్యంలో కీలక భాగస్వాములు కావడం హర్షణీయం, అభినందనీయం. ప్రపంచీకరణ ప్రభావంలో ఇంటర్నెట్, ఎలక్ట్రానిక్ మీడియా విస్తృతమైనప్పటికీ ప్రింట్ మీడియా ప్రాధాన్యత ఏ మాత్రం తగ్గలేదని ఇటీవల కొన్ని సర్వేలు వెల్లడించాయి.

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ అధికార వాణిగా 1975 జనవరిలో "ఐక్య ఉపాధ్యాయ" మాస పత్రికను ప్రారంభించారు. అధ్యయనం, అధ్యాపనం, సామాజిక స్పృహ లక్ష్యాలుగా ఉపాధ్యాయుల వృత్తికి, ప్రవృత్తికి సంబంధించిన ఆకాంక్షలకనుగుణంగా నిత్య నూతనత్వాన్ని సంతరించుకుంటూ, అనతి కాలంలోనే రాష్ట్రంలోనే అత్యధిక సర్క్యులేషన్ కలిగిన విద్యా విషయక తెలుగు మాసపత్రికగా ఎదిగింది ఐక్య ఉపాధ్యాయ. 38 ఏళ్ళ ప్రస్థానంలో ఏ పార్టీ అధికారంలో వున్నా, పాలకులు ఎవరైనా సరే వారనుసరించే విద్యా, ఉపాధ్యాయ వ్యతిరేక చర్యలను పదునైన భావజాలంతో నిర్మొహమాటంగా ఎండగట్టడం, ప్రజానుకూల చర్యలను స్వాగతించటం ఐక్య ఉపాధ్యాయ నైజం. అందుకే ఐక్య ఉపాధ్యాయ పత్రిక విశిష్టతను గుర్తించి ఉపాధ్యాయ బాహుళ్యంలోకి విస్తృతంగా తీసుకెళ్ళాల్సిన కర్తవ్యాన్ని ఈ మహాసభ మరోసారి స్వీకరిస్తుందని ఆశిస్తున్నాము.

ఐక్య ఉపాధ్యాయ కేవలం ఉపాధ్యాయుల వృత్తి సమస్యలకే పరిమితమైన పత్రిక కాదు. ఉపాధ్యాయులలో శాస్త్రీయ ఆలోచనను, సామాజిక అవగాహనను పెంపొందించేందుకు, సమస్యల మూలాలను గుర్తింపజేసి, వాటి పరిష్కారం కోసం నిర్వహించే ఉద్యమాలలో బాధితోపాధ్యాయులు భాగస్వాములయ్యే విధంగా చైతన్యాన్ని కలిగించే సాధనం. వర్తమాన విద్యారంగంతో పాటు, సామాజిక, ఆర్థిక రంగాలలో వస్తున్న పరిణామాలను నిశితంగా పరిశీలించి, శాస్త్రీయంగా విశ్లేషిస్తూ ప్రమాదకర విధానాలపై నిరంతరం పాఠకులను అప్రమత్తం చేసి దిశా నిర్దేశం చేసే వేగుచుక్క మన ఐక్య ఉపాధ్యాయ.

2011 మే 9,10,11 తేదీలలో కర్నూలులో నిర్వహించిన 12వ రాష్ట్ర మహాసభల అనంతరం నియామకమైన నూతన సంపాదక వర్గం సారథ్యంలో గత 2 సం॥ల ఐక్య ఉపాధ్యాయ ప్రగతిని ఈ సందర్భంగా సమీక్షించుకుందాము.

గత 24 నెలల కాలంలో 23 ఐక్య ఉపాధ్యాయ సంచికలు వెలువడినాయి. 2011 మే, జూన్ నెలలకు కలిపి మహాసభల ప్రత్యేక సంచికగానూ, మిగిలిన 22 నెలలకు ఏ నెలకానెల ప్రచురించాము. ఆయా సంచికలలోని శీర్షికలు, పత్రిక నిర్వహణ, సర్క్యులేషన్ తదితర అంశాలను క్లుప్తంగా పేర్కొంటున్నాము.

**ముఖ చిత్రాలు :** ఐక్య ఉపాధ్యాయ ముఖ చిత్రాన్ని (కవర్ పేజీ) ఏ నెలకానెల వైవిధ్యభరితంగానూ, వర్తమాన సామాజిక అంశాలను ప్రతిబింబించేవిగానూ ప్రచురించాము.

**సంపాదకీయాలు :** వర్తమాన విద్యారంగం, ఉపాధ్యాయ సమస్యలు, సామాజిక, రాజకీయ అంశాలపై సంపాదకీయాలు వ్రాశాము. విషయాన్ని క్లుప్తంగానైనా పాఠకులకు అవగాహన కలిగించి, కర్తవ్యాన్ని ప్రబోధించే విధంగా సంపాదకీయాలను వ్రాశాము.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అనుసరిస్తున్న ప్రజా వ్యతిరేక విధానాలు, విద్యారంగం, ఉపాధ్యాయులు, సమాజంపై ఏ విధమైన ప్రభావం చూపుతున్నాయి వాటిని ఎదిరించడంలో ఉపాధ్యాయులు ఏ విధంగా వ్యవహరించాలనే అంశాలపై విజ్ఞానదాయకమైన ఆలోచనాత్మకమైన, ఆచరణాత్మకమైన వ్యాసాలు ప్రచురించాము.

వ్యక్తిత్వ వికాసం, జీవన విధానం, వృత్తి నైపుణ్యాల అభివృద్ధి, శాస్త్రీయ విజ్ఞానం, మహిళా సమస్యలు తదితర అంశాలపై కూడా వ్యాసాలు ప్రచురించాము. వ్యాస రచయితలు మరియు అనువాదకులకు ధన్యవాదములు.

**విద్యా వీక్షణం :** విద్యారంగం పోకడలను ఎప్పటికప్పుడు గమనిస్తూ ఉపాధ్యాయులలో ఆలోచన రగిలించి కర్తవ్యాన్ని నిర్దేశించే విధంగా "విద్యావీక్షణం" శీర్షికను యుటియఫ్ రాష్ట్ర అధ్యక్షులు నాగటి నారాయణ నిర్వహిస్తున్నారు.

**అంతర్జాతీయ విద్యారంగం :** దేశ, విదేశాలలో విద్యారంగం పరిణామాలను గమనిస్తూ, నెలనెలా ఒక ముఖ్యమైన అంశంపై వ్యాసాన్ని జూన్ 2012 నుండి క్రమం తప్పకుండా అందజేస్తున్నారు ప్రముఖ పాత్రికేయులు ఎం.కోటేశ్వరరావు.

**చెన్నుపాటి స్మృతులు :** ఉపాధ్యాయ ఉద్యమ పితామహులు అమరజీవి చెన్నుపాటి లక్ష్మయ్య శతజయంతిని పురస్కరించుకొని 2012 జులై నుండి 2013 జూన్ వరకు చెన్నుపాటి జీవితం, ఉద్యమం తదితర విశేషాలపై వారి సహచరుల జ్ఞాపకాలను అక్షర బద్ధం చేసి వ్యాస రూపంలో ప్రచురించాము.

**వ్యాసరచన పోటీ :** చెన్నుపాటి శతజయంతి ఉత్సవాలను పురస్కరించుకొని "మారుతున్న సమాజంలో ఉపాధ్యాయుని పాత్ర" అనే అంశంపై వ్యాసరచన పోటీని నిర్వహించాము. 75మంది తమ వ్యాసాలను పంపించారు. వాటిలో ఉత్తమమైన మొదటి నాలుగు

వ్యాసాలను మరియు జిల్లాకొక వ్యాసాన్ని ఎంపిక చేసి 2012 జులై 14న గుంటూరులో నిర్వహించిన చెన్నుపాటి శతజయంతి ఉత్సవాల ముగింపు సభలో వ్యాస రచయితలకు బహుమతులు అందజేశాము. మొదటి 3 వ్యాసాలను పత్రికలో ప్రచురించాము. వ్యాస రచన పోటీకి న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించిన పి.ఝాన్సీకుమారి, పి.వి.కృష్ణారావు, కె.ఆనందాచారిలకు ధన్యవాదములు.

**కథలు - వ్యంగ్య రచనలు :** కథలు-కవితలు 2011 పోటీలో ఎంపికైన కథలు, కవితలతో పాటు విడిగా వచ్చిన కథలు, కవితలు, వ్యంగ్య రచనలను స్థల లభ్యతను బట్టి ప్రచురించాము.

**కథలు - కవితలు పోటీ -2013 :** 13వ రాష్ట్ర మహాసభలను పురస్కరించుకొని కథలు – కవితలు పోటీ 2013ను నిర్వహించాము. 26 కథలు, 100 కవితలు వచ్చాయి. వచ్చిన వాటిలో మెరుగైన మొదటి 4 కథలు, కవితలను బహుమతుల కోసం, మరొక 7 కథలు, 70 కవితలను సాధారణ ప్రచురణకు ఎంపిక చేశాము.

**వర్తమానం :** వార్తా ప్రపంచం, జాతీయ అంతర్జాతీయ పరిణామాలు, కరెంట్ అఫైర్స్ పేరిట ప్రపంచవ్యాప్తంగా జరిగిన ముఖ్యమైన పరిణామాలను పాఠకులకు అందించాము. ఎం.సంయుక్త, జె.బాబూరావు, కె.ఎస్.లక్ష్మణరావులు ఈ శీర్షికను నిర్వహించారు.

**విశ్వంలో విద్య :** విశ్వంలో విద్య అనే నూతన శీర్షికను ఇటీవలే ప్రారంభించాము. వివిధ దేశాల్లో ప్రభుత్వ విద్యారంగం రక్షణ కోసం సాగుతున్న కృషి ఉపాధ్యాయ ఉద్యమాలు, పోరాటాల వివరాలను సేకరించి ముఖ్యమైన వాటిని క్లుప్తంగా ప్రచురిస్తున్నాము. ఎం.సంయుక్త ఈ శీర్షికను నిర్వహిస్తున్నారు.

**నియమ నిబంధనలు :** ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ నూతన నిబంధనలు-అర్హతలు, ఫీజు రీయింబర్స్‌మెంట్, ఎల్‌టిసి, జిఐఎస్ నిబంధనలు, ఇన్‌కంటాక్స్ నిబంధనలు, కాంట్రిబ్యూటరీ పెన్షన్, అప్పులు-అడ్వాన్సులు, పెన్షన్ ఆన్‌లైన్ ప్రతిపాదనలు, అకడమిక్ మానిటరింగ్ కమిటీలు, పాఠశాలలకు గ్రాంట్లు వినియోగం తదితర అంశాలపై సమగ్రమైన సమాచారాన్ని ఈ శీర్షిక ద్వారా అందించే ప్రయత్నం చేశాము.

**ప్రశ్నోత్తరాలు :** ఇటీవలి కాలంలో అత్యంత పాఠకాదరణ పొందిన శీర్షిక ప్రశ్నోత్తరాలు ఇ-మెయిల్, లేఖల ద్వారా సగటున నెలకు 50పైగా ప్రశ్నలు వస్తున్నాయి. ఇ-మెయిల్ ద్వారా అడిగిన అన్ని ప్రశ్నలకు వెంటనే సమాధానం పంపుతున్నాము. లేఖలలో ముఖ్యమైనవి, అందరికీ ఉపయుక్తమైన వాటిని ఎంపికచేసి 14/15 ప్రశ్నలకు పత్రిక ద్వారా సమాధానాలు ఇస్తున్నాము. రిప్లై కార్డులు జత చేసిన వారికి వీలైనంత మేరకు వ్యక్తిగతంగా సమాధానాలు వ్రాస్తున్నాము.

**పాఠకుల అభిప్రాయాలు :** పత్రికలో వస్తున్న వివిధ శీర్షికలు, వ్యాసాలపై పాఠకుల అభిప్రాయాలను, సూచనలను ఈ శీర్షిక ద్వారా ఆహ్వానిస్తున్నాము.. పాఠకుల అభిప్రాయాలకనుగుణంగా పత్రికను తీర్చిదిద్దుకునే అవకాశం వుంటుంది. కానీ ఈ శీర్షికకు స్పందన ఆశించినంతగా లేదు. తూర్పుగోదావరి జిల్లా పి.గన్నవరం నుండి జి.శివప్రసాద్, పి.మహేష్ మాత్రమే క్రమం తప్పకుండా పత్రికపై అభిప్రాయాన్ని లేఖ ద్వారా తెలియజేస్తున్నారు వారికి ప్రత్యేక ధన్యవాదములు.

**ఎమ్మెల్సీ ఎన్నికలు :** ఎమ్మెల్సీ ఎన్నికలలో ఐక్య ఉపాధ్యాయ తనవంతు కృషి నిర్వహించింది. యుటిఎఫ్ అభ్యర్థుల పరిచయం, ముఖచిత్రంపై ఫోటోలతో ప్రచారం, పిడిఎఫ్ ఎమ్మెల్సీల కృషిపై వ్యాసాలు, ఎన్నికల నిధికి విరాళాలకై విజ్ఞప్తి, దాతల వివరాల ప్రకటన, ఎన్నికల క్యాంపెయిన్ వార్తలు, ఫోటోలు ప్రముఖంగా ప్రచురించాము. 2012 నవంబర్ నుండి 2013 ఫిబ్రవరి వరకు ప్రతి నెల 2000 అదనపు కాపీలు ప్రింటు చేయించి ఎన్నికలు జరిగిన జిల్లాలకు పంపించాము.

**రచయితలు - భాగస్వామ్యం :** గతంతో పోల్చుకుంటే ఇటీవలి కాలంలో పత్రికకు రచనలు పంపుతున్న కవులు, రచయితల సంఖ్య స్వల్పంగా పెరిగింది. పత్రిక పేజీల సంఖ్య 40కి పెరిగినందున వచ్చిన రచనలలో ఏ మాత్రం ప్రచురణార్హం అన్పించినా ప్రచురిస్తున్నాము. ఉపాధ్యాయులలో అనేకమంది ఇతర పత్రికలకు (ఉపాధ్యాయ పత్రికలు కాదు) రచనలు పంపుతున్నారు. అవి నాణ్యంగా కూడా ఉంటున్నాయి. అటు వంటి వారి నుండి మన పత్రికకు రచనలు ఎందుకు రావటం లేదో అని పరిశీలించుకోవాలి. రచయితలను, రచనా వ్యాసంగంపై ఆసక్తి వున్న వారిని ప్రోత్సహించి పత్రికకు పంపించే విధంగా మండల / పట్టణ శాఖల స్థాయిలో కృషి మరింతగా పెరగాల్సిన అవసరం వున్నది.

**ఉద్యమ వార్తలు :** రాష్ట్ర వ్యాప్తంగా వివిధ ప్రాంతాల్లో సంఘం నిర్వహించిన కార్యక్రమాలను, ఐక్య ఉపాధ్యాయకు అందిన మేరకు ప్రచురించాము. ఉద్యమ వార్తలు ఐక్య ఉపాధ్యాయలో ప్రచురితమైతే ఉద్యమ చరిత్రకు శాశ్వత రికార్డుగా మిగిలిపోతాయి. కానీ పలు జిల్లా శాఖలు ఈ ప్రాధాన్యతను గుర్తించడం లేదు. జిల్లా స్థాయిలో నిర్వహించిన ముఖ్యమైన కార్యక్రమాల రిపోర్టును, నాణ్యమైన ఫోటోలను పంపించడంలో శ్రద్ధ చూపడం లేదు. ఐక్య ఉపాధ్యాయకు వార్తలు పంపించేందుకు ప్రత్యేకంగా ఒక బాధ్యుడిని కేటాయించుకోవాలని సూచించినా స్పందన లేదు. అయితే గతంతో పోలిస్తే పరిస్థితి కొంత మెరుగుపడింది. ఇటీవలి కాలంలో కొన్ని జిల్లా శాఖలు తరచుగా వార్తలు పంపుతున్నాయి. జిల్లా వార్తలు పత్రికలో రాకపోతే సాధారణ పాఠకులలో అపోహలకు, అనవసర చర్చలకు తావిచ్చినట్లౌతున్నది. పాఠకులు అధిక సంఖ్యలో వున్న పశ్చిమగోదావరి, నెల్లూరు వంటి జిల్లా శాఖలు స్వీయ పరిశీలన చేసుకొని ఈ లోపాన్ని సవరించుకోవాలి.

**ప్రభుత్వ ఉత్తర్వులు :** ఈ మధ్యకాలంలో విడుదలైన ఉపాధ్యాయులకు, పెన్షనర్లకు ఉపయుక్తమైన జిఓలు, మెమోలు, సర్క్యులర్లు, ఉత్తర్వులను అన్నింటినీ పత్రికలో ప్రచురించాము. ముఖ్యమైన ఉత్తర్వుల సారాంశాన్ని తెలుగులో కూడా ప్రచురించాము. ఇంకా సంపాదక లేఖలు, ప్రముఖుల ఇంటర్వ్యూలు, మంచి సినిమాలు, పుస్తకాల సమీక్షలు ప్రచురించాము.

**ఎడిటర్స్ వర్క్‌షాప్ :** భావసారూప్యం కలిగిన ప్రజా సంఘాలు నిర్వహించే పత్రికల ప్రధాన సంపాదకుల వర్క్‌షాప్ 2012 నవంబర్ 25న హైదరాబాద్‌లో నిర్వహించారు. సమీక్షలో ఐక్య ఉపాధ్యాయ పత్రిక కంటెంట్, డిజైన్‌ల పట్ల సంతృప్తి వ్యక్తం చేసినప్పటికీ, సభ్యత్వానికి తగిన విధంగా సర్క్యులేషన్ లేకపోవడం పట్ల అసంతృప్తి వ్యక్తమైంది. ఆర్గనైజర్‌గా ఉపయోగపడటంతోపాటు సాధారణ ఉపాధ్యాయులను ఆకర్షించే విధంగా పత్రిక ఉండాలని, ఆ విధంగా శీర్షికలు, కంటెంట్‌ను అభివృద్ధిపరచుకోవాలని సూచించారు.

**సర్క్యులేషన్ :**

2013 ఏప్రిల్ 20 నాటికి అందిన వివరాల ప్రకారం ఐక్య ఉ

పాధ్యాయ చందాలు వార్షిక **12274**, అర్ధ దశాబ్ది **465**, దశాబ్ది **7419**, జీవిత **416**, కాంప్లిమెంటరీలు **350** మొత్తం **20924**.

పశ్చిమగోదావరి జిల్లా శాఖ ఈ సంవత్సరం ఏప్రిల్‌లో స్పెషల్ డ్రైవ్ క్యాంపెయిన్‌ను సీరియస్‌గా నిర్వహించి ఎన్నో సంవత్సరాల నుండి మొదటి స్థానంలో కొనసాగుతున్న నెల్లూరు జిల్లాను అధిగమించి **3313** చందాలతో మొదటి స్థానాన్ని కైవసం చేసుకున్నది. పశ్చిమగోదావరి జిల్లా శాఖకు ప్రత్యేక అభినందనలు. 2929 చందాలతో నెల్లూరు, **2519** పత్రికలతో తూర్పుగోదావరి, **2247** పత్రికలతో ప్రకాశం, **1821** పత్రికలతో ఖమ్మం జిల్లాలు తరువాతి నాలుగు స్థానాలలో వున్నాయి. ఆ తర్వాత స్థానాలలో కృష్ణ **1051**, నల్లగొండ **1034**, గుంటూరు **896**, హైదరాబాద్ **800**, వరంగల్ **648**, మహబూబ్‌నగర్ **563**, కర్నూలు **518**, ఆదిలాబాద్ **243**, అనంతపురం **277**, శ్రీకాకుళం **333**, కడప **277**, రంగారెడ్డి **268**, చిత్తూరు **251**, విజయనగరం **219**, మెదక్ **203**, విశాఖపట్నం **124**, కరీంనగర్ **101**, నిజామాబాద్ **69** ఉన్నాయి. గత 3 సం॥ల సర్క్యులేషన్ వివరాలు పట్టిక 2లో చూడవచ్చు.

ఐక్య ఉపాధ్యాయ పట్ల పాఠకులలో మంచి ఆదరణ ఉన్నది. ఉపాధ్యాయులు సంఘాలకతీతంగా ఐక్య ఉపాధ్యాయను అభిమానిస్తున్నారు. యుటియఫ్ ప్రతిష్ట కూడా ఇటీవలి కాలంలో బాగా పెరిగింది. కానీ ఐక్య ఉపాధ్యాయ సర్క్యులేషన్ మాత్రం ఆ స్థాయిలో పెరగడం లేదు. సంఘ నిబంధనావళి ప్రకారం అన్ని స్థాయిలలో కార్యవర్గ సభ్యులుగా ఎన్నికైన వారందరూ ఐక్య ఉపాధ్యాయ చందాదారులై వుండాలి. కానీ చందాల సంఖ్యను పరిశీలిస్తే కొన్ని జిల్లాలలో ఈ నిబంధన అమలు జరగటం లేదనిపిస్తున్నది. యుటియఫ్ సభ్యులలో కేవలం **18%**, మొత్తం ఉపాధ్యాయులలో **7%** మాత్రమే ఐక్య ఉపాధ్యాయ చందాదారులుగా ఉన్నారు.

**మొత్తం ఉపాధ్యాయుల సంఖ్యతో పోల్చినప్పుడు రాష్ట్ర సగటు (7%)కంటే అధికంగా చందాలు కలిగిన జిల్లాలు :** తూర్పుగోదావరి (14%), పశ్చిమగోదావరి (23%), ప్రకాశం (16%), నెల్లూరు (23%), ఖమ్మం (15%), నల్గొండ (7%), హైదరాబాద్ (12%).

2011,2012,2013 చందాల వివరాలను పోల్చిచూస్తే జిల్లాల వారీ హెచ్చు తగ్గులతో మొత్తంగా చందాల సంఖ్య నిలకడగా ఉంటున్నది. మనం గత మహాసభలో నిర్ణయించుకున్న విధంగా సర్క్యులేషన్ 30వేలకు పెంచుకోవాలన్న లక్ష్యాన్ని చేరుకోలేకపోయాము. వచ్చే మహాసభ నాటికైనా మొత్తం ఉపాధ్యాయులలో 10% చందాలు లక్ష్యంగా నిర్ణయించుకోవాలి.

**అర్ధ దశాబ్ది చందాలు :** గత మహాసభ నిర్ణయం మేరకు అర్ధ దశాబ్ది (5సం॥) చందా రు.450/-ను తీసుకుంటున్నాము. ఇప్పటి వరకు 465 చందాలు మాత్రమే వచ్చాయి. పశ్చిమగోదావరి 112, నెల్లూరు 67, తూర్పుగోదావరి 31, చందాలతో మొదటి మూడు స్థానాల్లో ఉన్నాయి. జిల్లాల వారీ వివరాలు పట్టిక 2లో చూడగలరు.

**దశాబ్ది చందాలు :** 2006 జనవరిలో రు.500/-లతో దశాబ్ది చందాలను ప్రారంభించాము. 2010 ఏప్రిల్‌లో రు.600/-కు, 2011 మే నుండి రు.850/-కి పెంచాము. దశాబ్ది చందాలు పత్రికకు ఆర్థిక భారమే అయినప్పటికీ కార్యకర్తల వెసులుబాటు కోసం కొనసాగిస్తున్నాము.

ప్రస్తుతం ఉన్న దశాబ్ది చందాలు 7419. పశ్చిమగోదావరి 1383 చందాలతో ప్రథమ స్థానంలో నిలువగా, తూర్పుగోదావరి 1253, ఖమ్మం 1171 చందాలతో తరువాతి రెండు స్థానాల్లో వున్నాయి. జిల్లాల వారీ దశాబ్ది చందాల వివరాలు పట్టిక 2లో చూడగలరు.

**మిస్సింగ్ ఫిర్యాదులు - నిరోధానికి చర్యలు :** పత్రిక అందడం లేదనే ఫిర్యాదులు పూర్తిగా నిరోధించలేకపోయాం కానీ తీవ్రత తగ్గించ గలిగాము. 2012 జనవరి నుండి పత్రికను కవర్‌లో పెట్టి పోస్ట్ చేస్తున్నాము. ఒక్కొక్క పత్రికకు రు.1.20 పైసలు అదనంగా ఖర్చు అవుతున్నది. అప్పటినుండి ఫిర్యాదులు గణనీయంగా తగ్గాయి. ఇంకా సుమారు 100 పత్రికలు బట్వాడా కాకుండా వెనుకకు తిరిగివస్తున్నాయి. ప్రతినెలా 100 నుండి 150 వరకు పత్రికలు అందడం లేదనే ఫిర్యాదులు వస్తున్నాయి. వీరందరికీ పత్రికను మరల పోస్ట్ చేస్తున్నాము. పత్రిక ప్రతినెల 12వ తేదీన పోస్ట్ అవుతుంది. పోస్టల్ శాఖ నిర్లక్ష్యం వల్ల పోస్టు చేయబడిన పత్రికలు కొందరు చందాదారులకు సక్రమంగా చేరడం లేదు. కనుక 10 రోజుల అనంతరం కూడా పత్రిక అందకపోతే ఫోన్, ఎస్ఎంఎస్, ఇ-మెయిల్ ద్వారా కార్యాలయానికి సమాచారం పంపితే మరొక పత్రిక పోస్ట్ చేస్తున్నాము. పత్రిక కవర్‌లో పెట్టి పోస్ట్ చేయటం పట్ల పాఠకుల నుండి ప్రశంసలు విస్తృతంగా వచ్చాయి.

**ఆర్థిక పరిస్థితి :** గత మహాసభ అనంతరం పత్రిక చందా రేట్లు వార్షిక రు.100/-, అర్ధ దశాబ్ది రు.450/-, దశాబ్ది రు.850/-లు అమలులోకి వచ్చాయి. దశాబ్ది, అర్ధ దశాబ్ది చందాలు పెద్దగా చేరలేదు. వార్షిక చందాలు కూడా మనం ఆశించిన రీతిలో రాలేదు. ప్రకటనలు (యాడ్స్) నామమాత్రంగానే వచ్చాయి. అందువల్ల ఆర్థిక పరిస్థితి అంత సంతృప్తికరంగాలేదు.

2011 మే నుండి 2013 మార్చి వరకు గడచిన 23 నెలల కాలంలో పత్రిక నిర్వహణ ఖర్చు రు.39,50,587. సగటున నెలకు రు.1,71,765లు అయినది. మొత్తం ఆదాయం రు. (దశాబ్ది, అర్ధదశాబ్ది, విరాళాలు, యాడ్స్ కూడా కలిపి) రు.31,11,290లు. సగటున నెలకు 1,35,273లు. సగటున నెలకు రు.36,492లు లోటు ఉంటున్నది. చందా రేట్లు పెంచినప్పటికీ పత్రిక పేజీలు 32 నుండి 40కి పెంచడం, కవర్‌లో పెట్టి పోస్ట్ చేయడం, సిబ్బంది వేతనాలు, న్యూస్ ప్రింట్, పోస్టల్ హ్యాండ్లింగ్ చార్జీలలో పెరుగుదల కారణంగా పత్రికపై ఆర్థిక భారం పెరిగింది. పత్రిక ఆర్థిక పరిస్థితిని మెరుగుపరచుకోవడానికి యాడ్స్, విరాళాల సేకరణ, వార్షిక చందాల చేర్పింపుపై కేంద్రీకరించాల్సిన అవసరం అనివార్యంగా ఉన్నదని గమనించగలరు.

**ప్రకటనలు(యాడ్స్) :** గత 23 నెలల కాలంలో పత్రికకు వచ్చిన యాడ్స్ నామమాత్రంగా వున్నాయి. రాష్ట్ర కేంద్రం ద్వారా రు.85213, జిల్లాల నుండి హైదరాబాద్ రు.16,500/-, వరంగల్ రు.15,000/-, మెదక్ రు.14,000/-, కడప రు.15,000/-, నిజామాబాద్ రు.8,000/-, తూర్పుగోదావరి రు.14,000/-, మహబూబ్‌నగర్ రు.5,000/-, గుంటూరు రు.2,500/- మొత్తం రు.1,75,231లు ప్రకటనల రూపంలో ఆదాయం వచ్చింది.

**విరాళాలు :** ఇటీవలి కాలంలో శుభకార్యాలను ఆర్భాటంగా నిర్వహించటం, అతిథులకు తిరుగు కానుకలిచ్చి పంపించటం ఆనవాయితీగా మారింది. యుటియఫ్ కార్యకర్తలు, సభ్యులు, శ్రేయోభిలాషుల కుటుంబాలలో జరిగే ఉద్యోగ విరమణ, పదోన్నతి,

వివాహం, గృహ ప్రవేశం, పుట్టినరోజు, వర్ధంతి వంటి సందర్భాలలో హాజరయ్యే నాయకులు అప్పీల్ చేస్తే ఐక్య ఉపాధ్యాయకు కూడా ఉదారంగా విరాళాలిస్తున్నారు. రు.1,000/-పైన విరాళమిచ్చిన వారి ఫోటో పత్రిక 3వ కవర్ పేజీపై ప్రచురించి శుభాకాంక్షలు కూడా తెలియజేస్తున్నాము. విరాళాల సేకరణపై కొన్ని జిల్లాలు మాత్రమే శ్రద్ధ వహిస్తున్నాయి. గత 23 నెలల కాలంలో వివిధ జిల్లాల నుండి వచ్చిన విరాళాల వివరాలు ఖమ్మం రు.42,060, తూర్పుగోదావరి రు.38,680, పశ్చిమగోదావరి రు.20,894, వరంగల్ రు.18,464, నల్లగొండ రు.12,236, హైదరాబాద్ రు.12,116, ప్రకాశం రు.11,980, మహబూబ్‌నగర్ రు.9,132, కృష్ణా రు.4,332, అనంతపురం రు.4,000, గుంటూరు రు.3,000, చిత్తూరు 2,600, కడప రు.2,500, విజయనగరం రు.1,000, ఆదిలాబాద్ రు.1,000 మొత్తం రు.1,83,994/-.

విరాళాలు యిచ్చిన దాతలకు, సేకరించి పంపిన నాయకులు, కార్యకర్తలందరికీ ధన్యవాదములు.

**కృతజ్ఞతలు :** పత్రికను నిరంతరాయంగా, ఉన్నంతలో ఆకర్షణీయంగానూ, విజ్ఞానదాయకంగానూ తీసుకురావడంలో తోడ్పడిన రచయిత(త్రు)లకు, కవులు, కవయిత్రులకు, అభిప్రాయాలు, సూచనలు తెలిపిన పాఠకులు, పెద్దలకు, యుటియఫ్ రాష్ట్ర కేంద్ర బాధ్యులకు, రాష్ట్ర కార్యాలయం మేనేజర్ ఎం.లక్ష్మారెడ్డి, రాష్ట్ర ఆడిట్ కమిటీ కన్వీనర్ మరియు సభ్యులకు, కవర్ పేజీ డిజైన్ చేయడంలో సహకరించిన చిత్రకారులు కె. ఆనందాచారి, జి.భిక్షపతి (ఖమ్మం), బసవేశ్వరరావు, మధు (ప్రజాశక్తి), ప్రజాశక్తి ఫోటోగ్రాఫర్స్ హరి, రమణ, ప్రతినెలా డిటిపి, కంపోజింగ్, పేజిమేకింగ్ చేసిన బి. శిరీష్‌బాబు, మేనేజర్ జి.సత్యనారాయణ, ఆపరేటర్ టి.విషువర్ధని ఇతర కార్యాలయ సిబ్బంది కె.కిరణ్‌కుమార్, ఆర్.ఆంజనేయులు, సురేష్‌లకి, అనువాదకులు జి.నరసింహాచారి, పి.వి.కృష్ణారావు, జి.గోపాలకృష్ణ, వై.జి.కె.మూర్తి గార్లకు, వెబ్‌సైట్‌ను తాజాపరుస్తూ నిర్వహిస్తున్న జాకీర్‌అలీకి, సమాచార శాఖ యాడ్స్ సేకరణకు సహకరించిన మాజీ ఎమ్మెల్సీ మరియు పిడిఎఫ్ సి.రామయ్య, సర్క్యులేషన్ పెంపుదలకు, పత్రిక అభివృద్ధికి నిరంతరం కృషి చేస్తున్న రాష్ట్ర, జిల్లా, మండల స్థాయి నాయకులు, కార్యకర్తలకు మరియు పత్రిక నిర్వహణలో ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ సహకరిస్తున్న ప్రతి ఒక్కరికీ పేరుపేరునా ధన్యవాదాలు తెలుపుకుంటున్నాము.

**కామ్రేడ్స్ !**

పత్రిక మన ఆర్గనైజర్ అన్న విషయం మరచిపోవద్దు. నిర్మాణం లేనిచోటకూడా మన వాయిస్‌ను విన్పించి సంఘ ఔన్నత్యాన్ని చాటి చెప్పి పాఠకులను ప్రభావితం చేయగల్గుతుంది ఐక్య ఉపాధ్యాయ. కనుక పత్రికను ఎంత ఎక్కువగా ప్రమోట్ చేస్తే మన సంఘం అంతగా అభివృద్ధి చెందుతుంది. అందుకే పత్రిక చందాలు చేర్పింపుపై కేంద్రీకరించడాన్ని ఒక ప్రధాన కర్తవ్యంగా కార్యకర్తలు గుర్తించాలి. పత్రిక నిర్వహణ లోపాలను ఎత్తిచూపి, మెరుగుదలకు, నాణ్యత పెంపొందించుటకు, ఆర్థిక పరిపుష్టిని సాధించుటకు అవసరమైన సూచనలు ఇవ్వాలని కోరుతున్నాము.

ఉద్యమాభివందనములతో......

**సంపాదకవర్గం పక్షాన**

**(సిహెచ్. రవి)**

ప్రధానసంపాదకులు

## నూతన రాష్ట్ర కమిటీ

**ఆఫీస్ బేరర్లు :**

గౌరవాధ్యక్షులు ఎన్.నారాయణ, అధ్యక్షులు ఎ.నర్సిరెడ్డి, సహాధ్యక్షులు పి.బాబురెడ్డి, కె.విజయగౌరి, ప్రధానకార్యదర్శి ఐ.వెంకటేశ్వరరావు, కోశాధికారి పి.మాణిక్‌రెడ్డి, కార్యదర్శులు : ఎన్.కిష్టయ్య, సిహెచ్.రవి, కె.ఎస్.ఎస్. ప్రసాద్, ఎన్.తాండవ కృష్ణ, బి.నరసింహారావు, ఎన్.సోమచంద్రారెడ్డి, ఎం.వెంకటేశ్వరరెడ్డి, ఎస్.కె.సాబ్జీ, టి.లక్ష్మారెడ్డి, ఎన్.నరసింహుడు, కె.ఎ.ఉమామహేశ్వర రావు, సిహెచ్.రాములు, సిహెచ్. దుర్గా భవాని

**ఆడిట్ కమిటీ :**

కన్వీనర్: సిహెచ్.వి.రాజన్‌బాబ్, సభ్యులు : బి.రమణమూర్తి, ఎ.శ్రీనివాస్, బి.మాణిక్యంశెట్టి, కె.కృష్ణమూర్తి.

**రాష్ట్ర కార్యవర్గం :**

ఎం.ఏ.కె.దత్, సిహెచ్.సుభాష్‌చంద్రబోస్, ఎం.సంయుక్త, ఎం.లక్ష్మారెడ్డి, డి.మస్తాన్‌రావు, ఎన్.రమణయ్యశాస్త్రి (రాష్ట్ర కేంద్రం), సిహెచ్.రవీంద్ర, జి. గిరిధర్, ఎస్.కిషోర్‌కుమార్, ఆర్.దమయంతి (శ్రీకాకుళం), కె.శేషగిరి, డి.రాము, ఎస్.మురళీమోహనరావు (విజయనగరం), వై.ఎ.ఆర్.కె.ప్రసాద్, కె.జాజులు, ఎస్.ఎస్. నాగమణి (విశాఖపట్నం), కె.సత్తిరాజు, జి.ప్రభాకరవర్మ, ఎన్.అరుణ కుమారి, ఎం.విజయగౌరి, డి.వి.రాఘవులు, టి.కామేశ్వరరావు, టి.వి.జి.జి. ఆర్.ఆర్.చక్రవర్తి (తూర్పుగోదావరి), ఎస్.శ్రీకాంత్, బి.ఎస్.ప్రకాశరావు, సిహెచ్.జగన్మోహనరావు, ఎస్.జయప్రభ, ఎం.ఎస్.ఆర్.కె.ప్రసాద్, వి.కనక దుర్గ, పి.జె.కెన్నడి (పశ్చిమ గోదావరి), బి.నాగేశ్వరరావు, కె.సంజీవరెడ్డి, డి. నవభారతి, జి.రమేష్, జి.వి.తాతారావు(కృష్ణ), జి.ప్రభుదాసు, ఎం.హనుమంత రావు, పి. మంజుల, జి.విజయసారధి, యు.రాజశేఖర్, పి.వి.కోటేశ్వరరావు, టి.ఎస్.ఎల్.ఎన్.మల్లేశ్వరరావు (గుంటూరు), కె.శ్రీనివాసరావు, పి.రమణారెడ్డి, డి.రామిరెడ్డి, డి.వీరాంజనేయులు, ఎం.ప్రేమమ్మ (ప్రకాశం), కె.పరంధామయ్య, సిహెచ్.శ్రీహరి, వి.రమాదేవి, వి.శ్రీదేవి, సి.చంద్రశేఖర్(నెల్లూరు), జి.శ్రీరామ మూర్తి, ఎస్.హెచ్.రహమాన్, పి.ప్రభావతి (చిత్తూరు), బి.లక్ష్మిరాజా, ఎస్. ఓబుల్‌రెడ్డి, ఎస్.వి.సుబ్బరాజు, కె.గాయత్రి (కడప), కె.సురేష్‌కుమార్, డి.రామ శేషయ్య (కర్నూలు), సి.కె.నాగేంద్రబాబు, ఎన్.విజయ భాస్కర్, కె.నాగేంద్ర, ఎస్.మహ్మద్‌జిలాన్, ఆర్.సుజాత్మ (అనంతపురం), జి.రాజశేఖర్, ఆర్.విక్రమ్ రెడ్డి, కె.నాగేశ్వర రావు(ఖమ్మం), కె.వెంకటేశ్వర్లు, జి.అశోక్ (కరీంనగర్), ఎ.వెంకట్, సి.లక్ష్మణరావు(అదిలాబాద్), ఎం.వెంకటప్ప, కె.జంగయ్య, డబ్బు హేమలత, ఎస్.రవిప్రసాద్‌గౌడ్ (మహబూబ్‌నగర్), ఎం.రాజశేఖర రెడ్డి, జి. ఉషాదేవి, పి.వెంకటయ్య (నల్లగొండ), ఎం.జనార్ధన్, ఎ.పోశెట్టి (నిజామాబాద్), బి.సాయిలు, వి.సత్యనారాయణ, వై.జ్ఞానమంజరి (మెదక్), ఎం.ఆంజనేయులు, ఆర్.నరసింహాచారి, డి.ఎల్.ప్రసన్నకుమారి(రంగారెడ్డి), ఎస్.వై.కొండలరావు, మేడె దేవదాసు, ఎ.రమాదేవి(హైదరాబాద్), వరంగల్ ముగ్గురు కో-అప్షన్.



# ఐక్యఉపాధ్యాయ సర్క్యులేషన్



| క్రం. సం. | జిల్లా | 2011 ఏప్రిల్ | | | | | 2012 ఏప్రిల్ | | | | | 2013 ఏప్రిల్ 20 నాటికి | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వార్షిక | 5 సం॥ | దశాబ్ది | జీవిత | మొత్తం | వార్షిక | 5 సం॥ | దశాబ్ది | జీవిత | మొత్తం | వార్షిక | 5 సం॥ | దశాబ్ది | జీవిత | మొత్తం | | |
| 1 | శ్రీకాకుళం | 209 | | 22 | 2 | 233 | 291 | | 25 | 2 | 318 | 203 | 3 | 25 | 2 | 233 | 12675 | 2% |
| 2 | విజయనగరం | 113 | | 48 | 0 | 161 | 169 | 1 | 56 | 0 | 226 | 158 | 5 | 56 | 0 | 219 | 10505 | 2% |
| 3 | విశాఖపట్నం | 83 | | 34 | 7 | 124 | 140 | 2 | 37 | 4 | 183 | 78 | 6 | 36 | 4 | 124 | 12777 | 1% |
| 4 | తూర్పుగోదావరి | 1,247 | | 1,075 | 166 | 2488 | 1548 | 17 | 1233 | 159 | 2957 | 1076 | 31 | 1253 | 159 | 2519 | 17773 | 14% |
| 5 | పశ్చిమగోదావరి | 548 | | 1,149 | 63 | 1760 | 971 | 58 | 1350 | 45 | 2424 | 1773 | 112 | 1383 | 45 | 3313 | 14554 | 23% |
| 6 | కృష్ణ | 448 | | 459 | 46 | 953 | 540 | 5 | 487 | 22 | 1054 | 496 | 30 | 502 | 22 | 1050 | 14731 | 7% |
| 7 | గుంటూరు | 433 | | 530 | 22 | 985 | 483 | 13 | 530 | 23 | 1049 | 282 | 25 | 567 | 23 | 897 | 15902 | 6% |
| 8 | ప్రకాశం | 879 | | 329 | 41 | 1249 | 1531 | 9 | 339 | 25 | 1904 | 1854 | 22 | 346 | 25 | 2247 | 14456 | 16% |
| 9 | నెల్లూరు | 2875 | | 162 | 23 | 3060 | 3115 | 6 | 188 | 12 | 3321 | 2633 | 67 | 217 | 12 | 2929 | 12975 | 23% |
| 10 | చిత్తూరు | 410 | | 151 | 12 | 573 | 314 | 3 | 54 | 11 | 382 | 178 | 8 | 54 | 11 | 251 | 17520 | 1% |
| 11 | కడప | 52 | | 42 | 3 | 97 | 248 | 6 | 50 | 1 | 305 | 218 | 8 | 50 | 1 | 277 | 12457 | 2% |
| 12 | కర్నూలు | 332 | | 69 | 4 | 405 | 376 | 5 | 74 | 0 | 455 | 436 | 8 | 74 | 0 | 518 | 13426 | 4% |
| 13 | అనంతపురం | 216 | | 83 | 3 | 302 | 264 | 11 | 96 | 3 | 374 | 115 | 20 | 100 | 3 | 238 | 15401 | 2% |
| 14 | ఖమ్మం | 518 | | 1,023 | 49 | 1590 | 462 | 19 | 1062 | 36 | 1579 | 582 | 27 | 1171 | 36 | 1816 | 12189 | 15% |
| 15 | వరంగల్ | 307 | | 234 | 11 | 552 | 297 | 12 | 248 | 10 | 567 | 359 | 24 | 255 | 10 | 648 | 14893 | 4% |
| 16 | కరీంనగర్ | 303 | | 38 | 4 | 345 | 79 | 2 | 37 | 3 | 121 | 55 | 4 | 39 | 3 | 101 | 13905 | 1% |
| 17 | ఆదిలాబాద్ | 129 | | 171 | 18 | 318 | 50 | 3 | 173 | 17 | 243 | 58 | 4 | 164 | 17 | 243 | 11393 | 2% |
| 18 | మహబూబ్‌నగర్ | 355 | | 287 | 24 | 666 | 220 | 6 | 304 | 15 | 545 | 219 | 12 | 317 | 15 | 563 | 15049 | 4% |
| 19 | నల్గొండ | 698 | | 293 | 9 | 1000 | 570 | 13 | 362 | 5 | 950 | 655 | 21 | 353 | 5 | 1034 | 14160 | 7% |
| 20 | నిజామాబాద్ | 26 | | 57 | 8 | 91 | 7 | 1 | 58 | 6 | 72 | 2 | 4 | 57 | 6 | 69 | 9849 | 1% |
| 21 | మెదక్ | 164 | | 19 | 4 | 187 | 256 | | 27 | 1 | 284 | 174 | | 28 | 1 | 203 | 11653 | 2% |
| 22 | రంగారెడ్డి | 290 | | 163 | 1 | 454 | 77 | 4 | 119 | 1 | 201 | 139 | 7 | 121 | 1 | 268 | 9863 | 3% |
| 23 | హైదరాబాద్ | 219 | | 242 | 21 | 482 | 246 | 9 | 264 | 15 | 534 | 518 | 17 | 250 | 15 | 800 | 6854 | 12% |
| 24 | ఇతరములు | | | | | | | | | | 0 | 13 | | 1 | | 14 | | |
| | కాంప్లిమెంటరీ | | | | | 350 | | | | | 350 | | | | | 350 | | |
| | [illegible] | 10854 | | [illegible] | [illegible] | 8425 | [illegible] | [illegible] | [illegible] | [illegible] | 20398 | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | 304960 | |

# రాష్ట్ర విద్యా కమీషన్‌ను నియమించాలి

## యుటియఫ్ 13వ రాష్ట్ర మహాసభల సందర్భంగా విద్యా సదస్సులో ప్రతిపాదించిన చర్చాపత్రం

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ అధ్యయనం, అధ్యాపనం సామాజిక స్పృహతో పని చేస్తున్నది. హక్కులు బాధ్యతలు రెండు కళ్ళనే నినాదంతో ఉపాధ్యాయుల సమస్యలతో పాటు విద్యారంగ సమస్యలపైనా స్పందిస్తున్నది. విద్యా విధానాలు మారినపుడు విద్యా హక్కు చట్టం, కరిక్యులం శిక్షణ, మూల్యాకనం, సిలబస్ వంటి విషయాలను ఎప్పటికప్పుడు చర్చిస్తూ తగు సూచనలను ప్రభుత్వానికి అందించడం జరిగింది. ప్రత్యామ్నాయ విధానాలను ప్రతిపాదించడం జరిగింది. 2009 ఫిబ్రవరిలో జరిగిన రాష్ట్ర మహాసభలో విద్యా కమీషన్ వేయాలని సూచించాము. రాష్ట్ర ప్రభుత్వం దీన్ని పట్టించుకోలేదు.

ఆంధ్రప్రదేశ్ పాఠశాల విద్య- అభివృద్ధి- ఆటంకాలు- పరిష్కారాల కోసం వెంటనే రాష్ట్ర విద్యా కమీషన్ నియమించాలని ఈ 13వ రాష్ట్ర మహాసభ ప్రభుత్వాన్ని కోరుతున్నది. ఆంధ్రప్రదేశ్ విద్యారంగ పరిస్థితి బాగాలేదని అందరూ అంటున్నారు. ఈ పరిస్థితికి కారణలేమిటో అధ్యయనం చేసి పరిష్కార మార్గాలు ఆలోచించాలి.

స్వాతంత్రానికి పూర్వం, తర్వాత విద్య మీద చాలా కమీషన్లు వేయడం జరిగింది. ఇవన్నీ ప్రభుత్వాలకు అనేక మంచి సూచనలు చేశాయి. వాటిని అమలు చేయవలసిన ప్రభుత్వాలు వీటిని పట్టించుకోలేదు.

సమాజం అభివృద్ధి చెందే క్రమంలో పిల్లల చదువు పట్ల తల్లిదండ్రులకు శ్రద్ధ పెరిగింది. కుటుంబ బడ్జెట్‌లో విద్య ప్రధాన ఎజెండాలోకి వచ్చింది. తమ పిల్లలకు మంచి చదువు కావాలనే ఆకాంక్ష పెరిగింది. మరి ప్రభుత్వ బడి ఎలా ఉంది? ఒక గ్రామానికో, పట్టణానికో ప్రభుత్వ బడి అంటూ ఒకటి ఉన్నా 1980 దశకం వరకు సుమారు 20వేల పాఠశాలలు ఏకోపాధ్యయ పాఠశాలలు లేదా ఇద్దరు ఉపాధ్యాయల పాఠశాలే. నాడు ప్రభుత్వ పాఠశాలల్లో పిల్లల సంఖ్య ఎక్కువగా ఉంటే ఉపాధ్యాయులు చాలా తక్కువగా ఉండేవారు. తమ పిల్లలకు మంచి చదువు కావాలని కోరుకునే వారి ఆశలకు అనుగుణంగా ఆ బడి లేదు. ముఖ్యంగా ఉపాధ్యాయుల కొరత, బహుళ తరగతుల బోధన, విద్యేతర పనులు, పని విధానంలో లోపాలు, మౌలిక సౌకర్యాలు లేకపోవడం, నిధుల కొరత, తదితర కారణాల వలన విద్యా వాతావరణం కానరాక కొందరు క్రమంగా పట్టణ ప్రాంత ప్రైవేటు పాఠశాలల వైపు పరుగులు తీసారు. ఇదే అదనుగా ప్రైవేటు విద్యా వ్యాపారులు, కార్పొరేట్ శక్తులు రకరకాల పేర్లతో విద్యావ్యాపారంలో పెద్ద ఎత్తున ప్రవేశించారు. ఈ ప్రైవేటు బడులు క్రమక్రమంగా పెద్ద పట్టణాల నుండి సందు సందుకు పల్లె పల్లెకూ విస్తరించాయి. ప్రభుత్వ పాఠశాలలను మెరుగుపరచలేక, ప్రైవేట్, కార్పొరేట్ విద్యను నియంత్రించలేక రాను రాను ప్రభుత్వమే ప్రైవేటు విద్యారంగాన్ని ప్రోత్సహిస్తూ వచ్చింది.

1990 నుండి దేశంలోను, రాష్ట్రంలోను సంస్కరణల పాలన ప్రారంభమైంది. ఈ విధానాలు ప్రభుత్వ విద్యా రంగాన్ని మరింతగా దివాళా తీయించాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తమ బడ్జెట్‌లో అప్పటికే విద్యకు కేటాయిస్తున్న నిధులకు కోతపెట్టి ప్రపంచబ్యాంకు సహాయాన్ని ఆహ్వానించింది. ఆచరణలో ఇది మరింతగా ప్రభుత్వ విద్యారంగాన్ని దెబ్బతీసింది.

**ప్రభుత్వ పాఠశాలల్లో పిల్లలెందుకు తగ్గిపోయారు?:** గ్రామీణ ప్రాంతంలో కూడా జనాభా పెరుగుదల తగ్గింది. పేద ప్రజలు పనులు లేక వలసలు పోతున్నారు. చదుకొన్నవారు ఉద్యోగాల పేరుతో గ్రామాలలో ఉండటం లేదు. పట్టణీకరణపై మోజుతో కొన్ని కుటుంబాలు గ్రామాలు వదిలి పోతున్నాయి. దీనితో గ్రామీణ జనాభాలో బడి ఈడు పిల్లలు తగ్గారు. ఉపాధ్యాయులు తక్కువగా ఉండడం కొన్ని సందర్భాలలో లేకపోవడం, విద్యేతర పనులు, బడిలో మౌలిక వసతులు లేకపోవడం, ఇంగ్లీషు మీడియంపై మోజు, దూరమైనా భారమైనా తమ పిల్లలకు గంటలు తరబడి చదువు నేర్పుతున్నారనే భావనతో ప్రైవేటు పాఠశాలలకు పంపటంతో ప్రభుత్వ బడి రాను రాను బలహీనపడింది. పట్టణ ప్రాంత ప్రభుత్వ పాఠశాలల పరిస్థితి ఇందుకు భిన్నంగా లేదు. మారుతున్న సమాజంలో ప్రజల ఆకాంక్షలకు అనుగుణంగా ప్రభుత్వ పాఠశాలలను అభివృద్ధి చేసి ఉంటే ఇంతగా బలహీన పడి ఉండేవి కావు.

**పాఠశాలలు:** రాష్ట్ర ప్రభుత్వ శాఖల్లో పాఠశాల విద్య పెద్ద శాఖగా ఉంది. 2011-12లో ప్రభుత్వ పాఠశాలలు 7,716, మండల పరిషత్, జిల్లా పరిషత్ పాఠశాలలు 66,393, మున్సిపల్ 2,115, ఎయిడెడ్ 3,335, మొత్తం 79,559 కాగా ప్రైవేటు అన్ ఎయిడెడ్ 22,763 పాఠశాలలున్నాయి. మొత్తం 1,02,322. సంఖ్యపరంగా చూస్తే దేశంలో అన్ని రాష్ట్రాలకంటే ఎక్కువ పాఠశాలలున్నాయి.

**టీచర్లు:** ప్రభుత్వ పాఠశాలల్లో 30,588 మండల పరిషత్, జిల్లా పరిషత్‌లో 2,50,079 మున్సిపల్ 6,233, ఎయిడెడ్ 13,620 మొత్తం 3,00,520 పని చేస్తున్నారు. ప్రైవేట్ అన్ ఎయిడెడ్ పాఠశాలల్లో 1,87,833 మంది పనిచేస్తున్నారు. ఎలిమెంటరీలో 50 శాతం, ఉన్నత పాఠశాలల్లో 50 శాతం ఉపాధ్యాయులు పనిచేస్తున్నారు.

**విద్యార్థులు:** 2011-12లో ప్రభుత్వ పాఠశాల్లో 9,67,139, మండల పరిషత్/ జిల్లా పరిషత్ పాఠశాలల్లో 60,84,261 మున్సిపల్ పాఠశాలల్లో 3,10,299 ఎయిడెడ్ పాఠశాల్లో 5,56,894 మొత్తం 79,18,593 మంది చదువుతున్నారు.

ప్రైవేట్ అన్ ఎయిడెడ్‌లో 54,10,872 మంది చదువువుతున్నారు. మొత్తం 1,33,29,465లో ప్రభుత్వ పాఠశాలల్లో 59.40 శాతం విద్యార్థులు, ప్రైవేట్ పాఠశాలల్లో 40.59 % విద్యార్థులు చదువుతున్నారు.

**కస్తూరిబా గాంధీ పాఠశాలలు:** ఎస్.సి, ఎస్.టి, మైనారిటీ కమ్యూనిటీలకు చెందిన బాలబాలికలకు వసతి సౌకర్యాలతో కూడిన పాఠశాలల ఏర్పాటు కోసం 2004-05 కేంద్రం ప్రభుత్వం ఈ పథకాన్ని ప్రారంభించింది. రాష్ట్రంలో 743 విద్యాలయాలు ఉండగా వీటిలో 80,972 మంది బాలికలు ఉన్నారు. ఈ పాఠశాలలకు రెగ్యులర్ ఉపాధ్యాయులు లేరు. కాంట్రాక్టు పద్ధతిలో ఉపాధ్యాయులు, సిబ్బంది పని చేస్తున్నారు.

**మైనారిటీ పాఠశాలలు :** నూరు శాతం కేంద్ర ప్రాయోజిత పథకంగా కేంద్రం గుర్తించిన తొమ్మిది బ్లాకులలో (ముషీరాబాద్, జకీరాబాద్, భోదక్, కర్నూలు, ఆత్మకూరు, నంద్యాల, కదిరి, కడప, రాయచోటి) అమలు చేస్తున్నారు.

**మదరసా విద్య :** నూరు శాతం కేంద్ర ప్రభుత్వ సహకారంతో సాంప్రదాయక విద్య పాఠ్యప్రణాళిక సైన్సు, గణితం, ఇంగ్లీష్, సాంఘీకశాస్త్రం వంటి ఆధునిక అంశాలు ప్రవేశ పెట్టారు.

**కంప్యూటర్ విద్య :** 2008-09 నుండి 500 పాఠశాలల్లో 2010-11 నుండి మరొక 1300 ఉన్నత పాఠశాలల్లో ఐదేళ్ళ పాటు అమలు చేస్తున్నారు. కేంద్ర ప్రాయోజిత పథకంగా 75:25 శాతం చొప్పున ఖర్చులు భరిస్తున్నారు. 6 నుండి 10 తరగతి వరకు కంప్యూటర్ పరిజ్ఞానం కల్పించే ఉద్దేశంతో ఈ పథకం ప్రవేశపెట్టి ఇది ఏడు ఏజన్సీలకు అప్పగించారు.

**మధ్యాహ్నభోజనం పథకం :** పిల్లలకు పౌష్టికాహారం పెంచడానికి, పాఠశాలలు క్రమం తప్పకుండా హాజరు కావడానికి ఈ పథకాన్ని జనవరి 2003 నుండి 1-5 వతరగతి విద్యార్థులకు అమలు ప్రారంభించారు. 2007లో 6,7,8 తరగతలకు, 2008లో 9,10 తరగతులకు విస్తరించారు. కేంద్ర ప్రాయోజిత పథకంగా 1 నుండి 8 తరగతులకు అయ్యే ఖర్చులో 75% కేంద్ర ప్రభుత్వం 25% రాష్ట్ర ప్రభుత్వం భరిస్తాయి. 9,10 తరగతులకు అయ్యే ఖర్చు మొత్తాన్ని రాష్ట్ర ప్రభుత్వమే భరిస్తుంది. 2011-12 సం॥లో ఈ పథకాన్ని 78.04 లక్షల పిల్లలకు అమలు చేసారు.

**విద్యకు బడ్జెట్ :** బడ్జెట్ ప్రసంగాల్లో విద్యకు ప్రాధాన్యత యిస్తున్నట్లు చెబుతున్నారు. కేటాయింపులు నాసిరకంగా ఉంటున్నాయి. జిడిపిలో 6 % కేంద్ర బడ్జెట్‌లో 10%, రాష్ట్రబడ్జెట్‌లో 30% అనేది ఏనాడు అమలు కాలేదు. సరికదా గతం కంటే బడ్జెట్ కేటాయింపులు తగ్గిపోతున్నాయి. కేటాయింపులు అంకెల్లో పెరిగి నట్లు కనపడినా శాతంగా చూస్తే తగ్గుతుంది. గత మూడు సంవత్సరాల కాలంలో వరుసగా 12.88%, 12.60%, 12.30% చొప్పున క్రమంగా కేటాయింపులు తగ్గించుకొంటూ వచ్చింది. రాజీవ్ విద్యామిషన్ కేటాయింపుల్లో సగానికి సగం కోత విధించారు. రాష్ట్ర బడ్జెట్‌లో 12 శాతం లోపు మాత్రమే బడ్జెట్ కేటాయింపులుంటున్నాయి. కేటాయించిన బడ్జెట్‌లో 20% కోత, ఖర్చు చేయని పరిస్థితి ఉంది.

**పర్యవేక్షణాధికారాలు :** మండల విద్యా శాఖాధికారి పోస్టులు 950 ఖాళీలున్నాయి. డివైఇఓ పోస్టులు 120కి 100కి పైగా ఖాళీలున్నాయి. పాఠశాలల తనిఖీగాని అకడమిక్ గైడెన్సు గాని ఉండడం లేదు. పర్యవేక్షణాధికారులపని రిపోర్టులకే పరిమితమైపోతుంది. పరిపాలనా సామర్థ్యం అకాడమిక్ సహకారం లేకుండా పోయింది.

**సర్వ శిక్షా అభియాన్ :** 1990 తర్వాత కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు విద్యారంగానికి విదేశీ నిధులపై ఆధారపడటం పెరిగింది. 2001 నుండి రాష్ట్రంలో సర్వశిక్షా అభియాన్ ప్రారంభమైంది. 18 వేల కోట్లు ఈ 12 ఏండ్లలో ఖర్చు చేసినట్లు చెబుతున్నారు. ఈ ప్రాజెక్టు వలన మంత్రులు, అధికారులు, రాష్ట్ర, జిల్లా ఆఫీసులు, అధికారులు, యంత్రాంగం పెరిగింది. నూతనంగా తరగతి గదులు, భవన నిర్మాణాలు జరిగాయి. కొన్ని గ్రాంట్లు యిస్తున్నారు. శిక్షణాతరగతులు పెడుతున్నారు. రిపోర్టులు ఎక్కువైనాయి. బోధనా పద్ధతులు మార్పు పేరుతో పుస్తకాలు మారుస్తున్నారు. బోధించడానికి ఉపాధ్యాయుడు లేకుండా చేశారు. ఈ పన్నెండు ఏండ్ల కాలంలో ప్రభుత్వ పాఠశాలలు బాగా బలహీనపడి ప్రవేటు పాఠశాలలు బాగా బలపడటం జరిగిందని లెక్కలు చెబుతున్నాయి.

**ఆర్ఎంఎస్ఎ :** రాష్ట్ర ప్రభుత్వం ఐదేళ్ళ క్రితం 6500 పాఠశాలలకు సక్సెస్ పేరుతో అన్ని సౌకర్యాలతో ఏ లోటు లేకుండా సెకండరీ విద్యను అభివృద్ధి చేస్తున్నట్లు ప్రకటించింది. దీని కోసం ఎస్‌జిటి పోస్టులకు కోత పెట్టి స్కూల్ అసిస్టెంట్స్ పోస్టులు అప్‌గ్రేడ్ చేసింది. హైస్కూళ్ళలో సబ్జెక్టు టీచర్ పోస్టులు పెరగడంతో ఫలితాలపై దీని ప్రభావం కనిపించింది. ప్రస్తుతం పాఠశాలల గురించి ప్రభుత్వం పట్టించుకోవడం లేదు. ఇంగ్లీషుమీడియం బోధనకు ఉపాధ్యాయులు లేక, తరగతి గదులు లేక తగిన ఫలితాలు ఇవ్వలేదు.

**మోడల్ స్కూల్ :** ఒక్కొక్క పాఠశాలకు 3 కోట్ల పెట్టుబడితో మొదటి దశలో 355 పాఠశాలలకు పెట్టే ప్రయత్నాలు చేసింది. ప్రభుత్వ పాఠశాలలనే మోడల్ స్కూల్స్‌గా మార్చాలని యుటిఎఫ్ చేసిన సూచనను ప్రభుత్వం పట్టించుకోలేదు. 9,10 తరగతులకు 11,12 తరగతులు చేర్చడంతో ప్రభుత్వ ఉన్నత పాఠశాలలు, జూనియర్ కాలేజీలు బలహీనపడతాయి.

**ప్రభుత్వం రకరకాల పాఠశాలలను పెట్టి రెగ్యులర్ సిబ్బందిని నియమకాలను చేయకుండా కాంట్రాక్టు పద్ధతుల్లో పని చేయించుకొంటుంది. క్రమంగా పబ్లిక్, ప్రైవేట్ భాగస్వామ్యన్ని అమలు చేయటం ద్వారా ప్రభుత్వ విద్యారంగాన్ని ప్రభుత్వమే బలహీనపరుస్తుంది.**

**విద్యహక్కు చట్టం :** స్వాతంత్ర్యానంతరం 62 సం॥ తర్వాతైనా విద్యా హక్కు చట్టం ద్వారా విద్యకు రాజ్యాంగ స్థాయి లభించడం ప్రాథమిక హక్కు కావడం అందరం సంతోషించాము. చట్టం తనంత తాను సత్ఫలితాలు యివ్వదు. చట్టాన్ని అమలు చేసే పటిష్టమైన యంత్రాంగం, నిధులు కేటాయింపు ఉండాలి. యిప్పటికి మూడు సంవత్సరాలు గడిచినా చట్టం ఎలా అమలుల్లోకి తీసుకురావాలనే చర్చే నడుస్తుంది. చట్టం అమలుకు ఖర్చు ఎవరు ఎంత భరించాలనే వివాదం నడిచింది. ప్రభుత్వ పాఠశాలల్లో ఏవిధంగా అమలు చేయాలి. ప్రైవేటు పాఠశాలలు బాధ్యత ఏమిటనేది యింత వరకు తేలని విషయం. విద్యార్థి పరంగా చూస్తే 14 సం॥వరకు ఉచిత విద్యను అందించవలసిన బాధ్యత ప్రభుత్వానిదే. ప్రైవేటు పాఠశాలలు కూడా విద్యా హక్కు చట్టం నిర్దేశం మేరకు ఉచిత విద్య నందించాలి. ఈ విద్యా హక్కు చట్టం అమలులోకి వచ్చేనాటికి 40 శాతం పిల్లలు ప్రైవేటు పాఠశాలల్లో చేరిపోయారు.

చట్టం అమలులోకి వచ్చిన ఈ మూడేళ్ళ కాలంలో చట్టంలో పేర్కొన్న మౌళిక వసతులు కల్పించడంలో పురోగతి లేదు. ఉచిత దుస్తులు అందరికి సకాలంలో అందటం లేదు. నోటు పుస్తకాల ఊసేలేదు. పాదరక్షలు గురించి పట్టించుకోలేదు. దూర ప్రాంత విద్యార్థులకు రవాణా సౌకర్యం సమకూర్చలేదు. చట్టం ప్రకారం వుండాల్సిన ఉపాధ్యాయులను నియమించలేదు. ప్రైవేటు పాఠశాలల్లో కూడ శిక్షణ పొందిన ఉపాధ్యాయులే ఉండాలనేది అమలు కాలేదు. రాష్ట్ర స్థాయి బాలల హక్కుల కమీషన్ నియామకం చేయలేదు. ప్రైవేటు పాఠశాలల ఫీజులపై నియంత్రణ లేదు. బడిలో లేని పిల్లలను చేర్పించుటకు కార్యక్రమం చేపట్టలేదు. యుటిఎఫ్, పిడిఎఫ్ ఎంఎల్‌సిలు చేసిన సూచనలు పట్టించుకోలేదు. నాన్ టీచింగ్ సిబ్బంది నియమకాలు చేయలేదు. 2013 ఏప్రిల్ 2న మంత్రులు, అధికారులు, సంఘాలు, ఎంఎల్‌సిలు, విద్యావేత్తలు, స్వచ్ఛంద సంస్థలతో ఏర్పాటు చేసిన సమావేశంలో ప్రభుత్వం నుండి చట్టం అమలు కోసం ఏ విధమైన ప్రతిపాదనలు చేయలేకపోయింది.

**ప్రభుత్వం ఏమి చేస్తుంది? :** ప్రస్తుతం ప్రభుత్వ, ప్రభుత్వ సహాయంతో నడిచే పాఠశాలల్లో పిల్లలు లేరు కాబట్టి ఆ పాఠశాలలను మూసి వేస్తామని చెప్పి 1284 పాఠశాలలు మూసి వేస్తుంది. విద్యార్థుల సంఖ్యను బట్టి ఉపాధ్యాయులను రేషనలైజేషన్ చేస్తుంది. ప్రభుత్వం

వైపు నుండి ప్రభుత్వ పాఠశాలల్లో పిల్లలు ఎందుకు తగ్గారనే ఆలోచన కంటే ఎలా మూసి వేయాలనే ఆలోచనల రావడం దారుణం. విద్యా హక్కు చట్టాన్ని ఇలాగే అమలు చేయాలనుకుంటే ఈ చట్టం లక్ష్యం నెరవేరదు.

కావున ప్రభుత్వం రాష్ట్రంలో పాఠశాల విద్య అభివృద్ధికి ఆటంకాలు ఏమిటి? పరిష్కారాలు ఏమిటో ఆలోచించాలి. విద్యా హక్కు చట్టాన్ని చిత్త శుద్ధితో అమలు చేయాలి. ప్రస్తుత పాఠశాలల విద్య పరిస్థితిపై కమీషన్ వేయాలి.

**యుటిఎఫ్ ప్రతిపాదిస్తున్న అంశాలు:**

1. పాఠశాల విద్యకు తగినన్ని పాఠశాలలు, తరగతి గదులు నిర్మించాలి. తరగతికి ఒక ఉపాధ్యాయుడు ఉండాలి.
2. ప్రతి ఆవాస ప్రాంతంలో ప్రభుత్వబడి ఉండాలి. పట్టణ ప్రాంతంలో, మురికి వాడలలో ప్రభుత్వ పాఠశాల పెట్టాలి. యిప్పటికే అక్కడ ప్రైవేటు పాఠశాలలు ఉన్నాయనే పేరుతో ప్రభుత్వం తన బాధ్యతను తప్పించుకోరాదు.
3. ప్రతి ప్రాథమిక పాఠశాలకు ప్రీ ప్రైమరీ తరగతులను అనుసంధానం చేయాలి.
4. అనేక రకాల మేనేజిమెంట్లు, పాఠశాలలు గాకుండా ఒకే పాలనా విధానంలోకి తీసుకురావాలి.
5. అన్ని స్థాయిలలో గల పర్యవేక్షణాధికారుల పోస్టులు భర్తీ చేయాలి. నేటి అవసరాలకు అనుగుణంగా పర్యవేక్షణాధికారుల పోస్టులు మంజూరు చేయాలి.
6. ప్రతి సంవత్సరం క్రమం తప్పకుండా డిఎస్సిలు నిర్వహించి ఖాళీ పోస్టులు భర్తీ చేయాలి. దీర్ఘకాలిక సెలవుల్లో ఉన్నవారి పోస్టుల్లో ప్రత్యామ్నాయ ఏర్పాటు చేయాలి. డిఎస్సిలలో 10% ఖాళీలను అధనంగా లెక్కించి ప్యానల్ తయారు చేయాలి. తదుపరి డిఎస్సి వేసే వరకు ఏర్పడే ఖాళీలలో వీరిని భర్తీ చేయాలి.
7. మీడియం వారీగా ఉపాధ్యాయ పోస్టులు భర్తీ చేయాలి.
8. ప్రభుత్వ పథకాలన్నీ ఎయిడెడ్ పాఠశాలలకు వర్తింపచేయాలి. ఉచిత దుస్తులు పంపిణీ, ఖాళీ పోస్టుల భర్తీ, సబ్జెక్టు టీచర్ పోస్టులు, ఎస్ఎస్ఎ, ఆర్.ఎం.ఎస్.ఎ నిధులు మంజూరు చేయాలి.
9. ఉన్నత పాఠశాలల్లో డ్రాయింగు, క్రాఫ్టు, మ్యూజిక్ పోస్టులు భర్తీ చేయాలి.
10. మధ్యాహ్న భోజన పథకానికి నిధులు పెంచి పౌష్టికాహారాన్ని అందించాలి. ఉదయం, సాయంత్రం అల్పాహారం అందించాలి.
11. గిరిజన విద్య, మైనారిటీల విద్యపై ప్రత్యేక శ్రద్ధ పెట్టాలి.
12. ఉన్నత పాఠశాలకు అవసరమైన నాన్ టీచింగ్ సిబ్బందిని సమకూర్చాలి. ప్రాథమిక పాఠశాలల్లో కూడా రికార్డు పని, రిపోర్టుల కోసం అకడమిక్ పనులకు ఆటంకం కలుగుతుంది. ప్రాథమిక పాఠశాలల్లో నాన్ టీచింగ్ సిబ్బందిని నియమించాలి.
13. టీచర్ల వృత్త్యంతర శిక్షణకు అన్నిహంగులతో రాష్ట్ర స్థాయి అకాడమీని ఏర్పాటు చేయాలి.
14. కంప్యూటర్ విద్యను అభివృద్ధి చేయాలి.
15. ఉపాధ్యాయులలో పని సంస్కృతిని మరింతగా పెంచేందుకు శ్రద్ధ పెట్టాలి.

# మహబూబ్‌నగర్ జిల్లా మహాసభ

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ (యుటియఫ్) మహబూబ్‌నగర్ జిల్లా 13వ మహాసభ ఎప్రిల్ 21న షాద్‌నగర్‌లోని ఈడెన్ ప్లాజా (కాॱॱజి.నర్సింహ, ఎ.పోచయ్యల ప్రాంగణం) ఫంక్షన్ హాల్ నందు జరిగింది. యుటియఫ్ పతాకాన్ని జిల్లా అధ్యక్షులు ఎన్.కిష్టయ్య, ఆవిష్కరించారు. అనంతరం కిష్టయ్య అధ్యక్షతన నిర్వహించిన విద్యాసదస్సుకు ముఖ్యవక్తలుగా రాష్ట్ర అధ్యక్షులు ఎన్.నారాయణ, రాష్ట్రకోశాధికారి పి.మాణిక్‌రెడ్డి హాజరైనారు.

ఎన్.నారాయణ మట్లాడుతూ విద్యాహక్కు చట్టం వచ్చి 3సంॱॱలు గడిచింది. ఈ చట్టం ప్రకారం ప్రతిపాఠశాలలకు అన్ని సౌకర్యాలు కల్పించాలి, పాఠశాలలను బాగా పనిచేయించాలి. కాని దీనికి విరుద్ధంగా ప్రతి సంॱॱ మన రాష్ట్రంలో వెయ్యికి పైగా పాఠశాలలు మూతపడుతున్నాయి. ఈసంॱॱ1282 పాఠశాలలు కనుమరుగు కానున్నాయి. 6 దశాబ్దాల క్రితం కొఠారి కమీషన్ సూచించిన విధంగా నేటికీ రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు విద్యారంగానికి బడ్జెట్‌లో కేటాయింపులు చేయలేకపోతున్నాయి. స్కూళ్ళ పర్యవేక్షకులు లేకపోవడంతో ప్రాథమిక, సెకండరీ పాఠశాలలు కునారిల్లుతున్నాయి. 900లకు పైగా ఎంఇఓలు, 100కు పైగ డిఇఓల పోస్టులు ఖాళీగా ఉన్నాయి వాటిని భర్తీ చేయాలి. అర్హత గల స్కూల్ అసిస్టెంట్స్‌కు జెఎల్, డైట్ లెక్చరర్స్‌గా పదోన్నతులు ఇవ్వాలని అన్నారు.

రాష్ట్రకోశాధికారి పి.మాణిక్‌రెడ్డి మాట్లాడుతూ ప్రభుత్వ పాఠశాలలను కాపాడుకోవాల్సిన బాధ్యత ఉపాధ్యాయులందరిపై ఉన్నది. సామాజిక స్పృహ కలిగిన మన సంఘసభ్యులు ఇతర ఉపాధ్యాయులకంటే ఒక అడుగు ముందుగా అందరికీ ఆదర్శంగా ఉండాలన్నారు. స్కూళ్ళు మూతపడే గ్రామాలను సందర్శించి కారణాలను తెలుసుకొని గ్రామస్తులను చైతన్యపరిచి ఈ సంॱॱ మూతపడే స్కూళ్ళను మళ్ళీ తెరిపించేందుకు మనం కృషి చేయాలన్నారు. తదుపరి ప్రధాన కార్యదర్శి ఎం.వెంకటప్ప కార్యదర్శి నివేదికను ప్రవేశపెట్టారు. ప్రతినిధులందరూ చర్చించి నివేదికను ఏకగ్రీవంగా ఆమోదించారు. ఈ సందర్భంగా పలు తీర్మానాలను ఆమోదించారు. అనంతరం నూతన జిల్లా కమిటీని ఏక గ్రీవంగా ఎన్నుకున్నారు. ఈ కార్యక్రమానికి ఎన్నికల అధికారిగా పి.మాణిక్‌రెడ్డి, పరిశీలకులుగా ఎన్.నారాయణ వ్యవహరించారు. షాద్‌నగర్ కార్యకర్తలు కె.వెంకటయ్య, క్రిష్టయ్య, ఎస్.గిరిధర్ నర్సింహ, సత్యన్న, గంగిరెడ్డి, శివారెడ్డి, ఆంజనేయులు, ప్రేమ్‌కుమార్, బాలయ్య రంగరాజన్‌కుమార్ తదితరులు మహాసభల ఏర్పాట్లు చేశారు.

**నూతన కమిటీ :**

గౌరవాధ్యక్షులు ఎస్.రవిప్రసాద్‌గౌడ్, అధ్యక్షులు కె.జంగయ్య, సహాధ్యక్షులు డబ్ల్యు హేమలత, బి.సీత్యానాయక్, ప్రధానకార్యదర్శి ఎం.వెంకటప్ప, కోశాధికారి ఎన్.వెంకటేశ్, కార్యదర్శులు ఎం.వేణుగోపాల్, రఘుపాల్, ఉమాదేవి, కె.వెంకటయ్య, చందునాయక్, నాగేంద్రం, కె.శివరాములు, కె.తిప్పన్న, డి.కృష్ణయ్య, ఆడిట్ కమిటీ : కన్వీనర్ ఎం.గోపాల్

# గత మహాసభల పతాకజాతాలు




1వ మహాసభ రాజమండ్రి (తూ॥గో॥ జిల్లా)




2వ మహాసభ ఖమ్మం




3వ మహాసభ భీమవరం (ప॥గో॥ జిల్లా)



4 &10వ మహాసభలు విజయవాడ (కృష్ణా జిల్లా)




5వ మహాసభ నెల్లూరు




6వ మహాసభ గుంటూరు



7వ మహాసభ ఒంగోలు, ప్రకాశం జిల్లా



8వ మహాసభ కాకినాడ, తూ॥గో॥ జిల్లా




9వ మహాసభ హైదరాబాద్



తిరుపతిలో ఎస్‌టిఎఫ్ఐ పతాకాన్ని ఆవిష్కరిస్తున్న సి.హెచ్. సుభాష్‌చంద్రబోస్




11వ మహాసభ నల్గొండ



12వ మహాసభ కర్నూలు




తిరుపతిలో యుటిఎఫ్ పతాకాన్ని ఆవిష్కరిస్తున్న డి.రామిరెడ్డి, మాజీ ఎమ్మెల్సీ

# ప్రతినిధుల సభ


ఎన్.నారాయణ, అధ్యక్షోపన్యాసం


ఎమ్‌వీఎస్ శర్మ, ప్రారంభోపన్యాసం


ఐవి రావు, ప్రధాన కార్యదర్శి నివేదిక


పి.మాణిక్‌రెడ్డి, ఆర్థిక నివేదిక


చావ రవి, పత్రిక నివేదిక


ధనలక్ష్మి, సిఐటియు సందేశం


కౌశిక్, స్వేచ్ఛ ప్రతినిధి సందేశం


దుర్గాభవాని మహిళాసదస్సుకు ఆహ్వానం


ఎమ్.సంయుక్త, మహిళాసదస్సుకు అధ్యక్షత


కె.రాజేంద్రన్ సందేశం


వెంగమ్మ, డైరెక్టర్, స్విమ్స్ సందేశం


సిల్వా కుమారి, ఎస్‌టిఎఫ్‌ఐ తమిళనాడు సందేశం


కె.విజయగౌరి తీర్మానం


డి.నిర్మల తీర్మానం


డి.ఎల్.ప్రసన్నకుమారి


డి.శ్రీరామ్మూర్తి, చిత్తూరు జిల్లా అధ్యక్షులు

తీర్మానాలు ప్రతిపాదన


ఎన్.సోమచంద్రారెడ్డి, చిత్తూరు జిల్లా, ప్ర॥కా॥


ఎన్.తాండవకృష్ణ


ఎ.నర్సిరెడ్డి


పి.బాబురెడ్డి


వి.బాలసుబ్రహ్మణ్యం, ఎమ్మెల్సీ


ఎమ్.వెంకటేశ్వర్ రెడ్డి


ఎన్.కిష్టయ్య


కె.ఎస్.ఎస్.ప్రసాద్


ఎస్.సాల్జీ


టి.లక్ష్మారెడ్డి


బి.నాగేశ్వర్‌రావు, ఎమ్మెల్సీ


బి. నరసింహారావు, అర్హతల నివేదిక


ఎమ్.ఎ.కె.దత్తు ఎన్నికల అధికారి

# చర్చలలో పాల్గొన్న వివిధ జిల్లాల ప్రతినిధులు


జి.గిరిధర్, శ్రీకాకుళం


సిహెచ్. రవీంద్ర, శ్రీకాకుళం


కె. అశోక్, మెదక్


జ్ఞాన మంజరి, మెదక్


డి.రాము, విజయనగరం


జి.వెంకట్రావు, విజయనగరం


జి.లక్ష్మీరాజా, కడప


కె.వెంకటేశ్వర్లు, కరీంనగర్


పి.చంద్రశేఖర్, నెల్లూరు


శ్రీదేవి, నెల్లూరు


సి.లక్ష్మణరావు, ఆదిలాబాద్


ఎస్.శ్రీకాంత్


బి.యస్.ప్రకాశ్‌రావు, ప॥గో॥ జిల్లా


కనకదుర్గ, ప॥గో॥ జిల్లా


కె.కె.జాజులు, విశాఖపట్నం


జి.కె.ఆర్.స్వామి, విశాఖపట్నం


జి. తాతారావు, కృష్ణా


జి.రమేష్, కృష్ణా


డి.నవభారతి, కృష్ణా


సి.హెచ్.రాములు, నల్గొండ


ఎం. ఆంజనేయులు, రంగారెడ్డి


ఇ. గాలయ్య, రంగారెడ్డి


ఎ.రమాదేవి, హైదరాబాద్


ఎన్.విజయభాస్కర్, అనంతపురం


కె.సోమశేఖర్, వరంగల్


సుమిత్ర, వరంగల్


ఎ.పోశెట్టి, నిజామాబాద్


ఎన్.అరుణకుమారి, తూ.గో॥


కె.సత్తిరాజు, తూ॥గో॥


సరోజిని దేవి, తూ॥గో॥


వై.మనోహర్, కర్నూలు


ఈశ్వరరావు, గుంటూరు


ఎమ్.హనుమంతరావు, గుంటూరు


పి.టి.విలియం, ప్రకాశం


ఓ.వీరారెడ్డి, ప్రకాశం


ఎమ్.ప్రేమమ్మ, ప్రకాశం


ఎన్.వీరబాబు, ఖమ్మం


ఎన్.వెంకటేష్, మహబూబ్‌నగర్


ఎం. వెంకటప్ప, మహబూబ్‌నగర్


ఎస్.హెచ్. రహమాన్, చిత్తూరు

# యుటిఎఫ్ 13వ రాష్ట్ర మహాసభలో ఎన్నికైన నూతన ఆఫీస్ బేరర్లు


ఎన్.నారాయణ,
గౌరవ అధ్యక్షులు


ఎ.నర్సిరెడ్డి,
అధ్యక్షులు


పి.బాబురెడ్డి,
సహాధ్యక్షులు


కె.విజయగౌరి,
సహాధ్యక్షులు


ఐ.వెంకటేశ్వరరావు
ప్రధాన కార్యదర్శి


పి. మాణిక్ రెడ్డి
కోశాధికారి


పి.కిష్టయ్య,
కార్యదర్శి


చావ రవి,
కార్యదర్శి


కె.ఎస్.ఎస్. ప్రసాద్,
కార్యదర్శి


ఎన్.తాండవ కృష్ణ,
కార్యదర్శి


బి.నరసింహరావు,
కార్యదర్శి


ఎన్.సోమచంద్రారెడ్డి,
కార్యదర్శి


ఎమ్.వెంకటేశ్వరరెడ్డి,
కార్యదర్శి


ఎస్. సాబ్జీ,
కార్యదర్శి


టి.లక్ష్మారెడ్డి,
కార్యదర్శి


ఎన్.నరసింహుడు,
కార్యదర్శి


కె.ఎ.ఉమామహేశ్వర్‌రావు,
కార్యదర్శి


సి.హెచ్. రాములు,
కార్యదర్శి


సి.హెచ్.దుర్గాభవాని,
కార్యదర్శి

## ఆడిట్ కమిటీ


సి.హెచ్.వి.రాజన్‌బాబ్,
కన్వీనర్


ఎ. శ్రీనివాస్
సభ్యులు


బి.వి.రమణమూర్తి
సభ్యులు


బి.మాణిక్యం శెట్టి
సభ్యులు


కె.కృష్ణమూర్తి
సభ్యులు

# ప్రశ్నోత్తరాలు



నిర్వహణ : సిహెచ్. రవి, ప్రధాన సంపాదకులు
mail : ikyopadhyaya@gmail.com

ప్రశ్న : **నేను ప్రస్తుతం ఎస్‌జిటి / ఎస్‌ఏగా పనిచేస్తున్నాను. నాకు మోడల్ స్కూల్ ప్రిన్సిపల్ / పిజిటి / టిజిటి నియామకం వచ్చింది. కొత్త పోస్టులో చేరితే సర్వీస్‌కు, పెన్షన్‌కు రక్షణ ఉంటుందా? చేరాలా వద్దా?**

**- పలువురు ఉపాధ్యాయులు**

జవాబు : మోడల్ స్కూల్స్ ఒక ప్రత్యేక సొసైటీ ఆధ్వర్యంలో నూతనంగా ప్రారంభించబడుతున్నాయి. ఆ పాఠశాలల్లో ఉపాధ్యాయుల నియామక నిబంధనలలో ఇన్-సర్వీస్ ఉపాధ్యాయుల సర్వీసుకు రక్షణగానీ పెన్షన్ పథకం ప్రస్తావనగానీ లేదు. మోడల్ స్కూల్స్‌కు ఎంపికైన ఇన్-సర్వీస్ ఉపాధ్యాయుల సర్వీసు, వేతనం, పెన్షన్‌లకు రక్షణ కల్పించాలని యుటియఫ్ పక్షాన ప్రభుత్వానికి ప్రాతినిధ్యం చేశారు. ప్రభుత్వంవైపు నుండి ఇంకా ఏ విధమైన నిర్ణయం వెలువడలేదు.

అయితే మోడల్ స్కూల్స్‌కు ఎంపికైన ఉపాధ్యాయులు ప్రస్తుతం పనిచేస్తున్న పోస్టులో సర్వీస్ రెగ్యులరేజేషన్, ప్రొబేషన్ డిక్లరేషన్ పూర్తయివుంటే నియామకపు అధికారి నుండి విడుదల పొంది కొత్త పోస్టులో చేరవచ్చు. అలా చేరిన వారికి ఎఫ్ఆర్ 14 ప్రకారం పాత పోస్టులో లీన్ కొనసాగుతుంది. కనుక 3 సం॥లలోపు పునరాలోచించుకొని వెనుకకు రావాలనుకుంటే రావచ్చు. పాత పోస్ట్‌లో సర్వీసు, సీనియార్టీ, ఇంక్రిమెంట్లు యధాతథంగా కొనసాగుతాయి.

ప్రశ్న : **ఉన్నత పాఠశాలల్లో పని చేయుచున్న బోధనేతర సిబ్బంది పని వేళలు ఏ విధంగా ఉంటాయి? ఉ॥ 10 గం॥ల నుండి సా॥ 4.40 గం॥ని॥ వరకా లేక యితర ప్రభుత్వ కార్యాలయాల మాదిరిగా ఉ॥ 10.30 గం॥ని॥ నుండి సా॥ 5 గం॥ వరకా?**

**(ii) ఉన్నత పాఠశాలలో జూనియర్ అసిస్టెంట్, రికార్డు అసిస్టెంటు ఉన్నప్పుడు పాఠశాలకు సంబంధించిన పనులకు ఓ.డి.పై ఎవరిని పంపించాలి? నెలలో ఎన్ని రోజులు పంపించవచ్చు?**

**- బి.రాజారెడ్డి**, దగదర్తి, నెల్లూరు జిల్లా

**- పి.రమణారెడ్డి**, గిద్దలూరు, ప్రకాశం జిల్లా

జవాబు : (i) ఉన్నత పాఠశాలల్లో పనిచేసే బోధనేతర సిబ్బంది కూడా వెకేషన్ డిపార్ట్‌మెంట్ క్రిందికి వస్తారు. పాఠశాల పనివేళలు, సెలవులే వారికి కూడా వర్తిస్తాయి.

(ii) బోధనేతర సిబ్బందిని పాఠశాల అవసరార్థం ఆన్‌డ్యూటీపై పంపించటంలో ఎవరిని పంపాలి, ఎన్ని రోజులు పంపాలి అనే విచక్షణ ప్రధానోపాధ్యాయునిదే. అయితే ఏ పని నిమిత్తం పంపుతున్నారో మూవ్‌మెంట్ రిజిష్టర్‌లో నమోదు చేయాలి. అటెండెన్స్ రిజిష్టర్‌లో ఓ.డి. వేయాలి.

ప్రశ్న : **(i) పెన్షనరు మరణానంతరం కుటుంబ పెన్షన్ ఏ ప్రాతిపదికన చెల్లిస్తారు.**

**(ii) కమ్యూటే చేసిన పెన్షన్ మొత్తాన్ని తిరిగి బేసిక్ పెన్షన్‌లో ఎప్పుడు కలుపుతారు?**

**- ఎస్.వి.కామేశ్వరరావు**, వేములవలస, విశాఖపట్నం

జవాబు : (i) పెన్షనరు మరణించినప్పుడు పెన్షన్ ప్రతిపాదనలలో పేర్కొన్న జీవిత భాగస్వామికి కుటుంబ పెన్షన్ చెల్లిస్తారు. పెన్షనరు జీవించివుంటే 65 సం॥ల వయస్సు వచ్చేవరకు పెన్షనరు పొందుతున్న పూర్తి పెన్షన్, ఆ తర్వాత చివరినెల వేతనంలో 30 శాతం కుటుంబ పెన్షన్‌గా చెల్లించబడుతుంది.

(ii) కమ్యూట్ చేసిన పెన్షన్ 15 సం॥ల తర్వాత బేసిక్ పెన్షన్‌లో కలుపుతారు. ఈలోగా పెన్షనరు మరణిస్తే, మరణించిన మరుసటిరోజు నుండి పూర్తి పెన్షన్ చెల్లిస్తారు.

ప్రశ్న : **స్వంత ఇల్లు లేని పెన్షనరు చెల్లించే ఇంటి అద్దెకు సెక్షన్ 80జిజి ప్రకారం ఆదాయపు పన్నులో రిబేటు లభిస్తుందా?**

**- వి.ఎస్.అప్పారావు**, ఏలూరు, పశ్చిమగోదావరి జిల్లా

జవాబు : లభించదు. ఆదాయపు పన్ను చెల్లించే వారికెవరికీ ఇంటి అద్దె మినహాయింపు లేదు. ఉద్యోగులకు ప్రభుత్వం యిస్తున్న ఇంటి అద్దె లేదా వేతనంలో 10% కంటే అదనంగా చెల్లిస్తున్న ఇంటి అద్దె మొత్తములలో ఏది తక్కువ అయితే దానికి మాత్రమే మినహాయింపు వుంటుంది. పెన్షనర్లకు ప్రభుత్వం హెచ్ఆర్ఏ చెల్లించడం లేదు కనుక ఆదాయపు పన్నులో ఏ విధమైన రిబేటు లభించదు.

ప్రశ్న : **నేను గ్రేడ్-I అర్హతలతో 01.08.1979 నుండి ఎయిడెడ్ హైస్కూల్‌లో గ్రేడ్-II తెలుగు పండిట్‌గా పనిచేస్తున్నాను. జిఓ 330 ప్రకారం అప్‌గ్రేడ్ చేయబడి 10.08.1983 నుండి గ్రేడ్-1 స్కేలు తీసుకుంటున్నాను. 10.08.2007 నాటికి 24 సం॥ల స్కేలు కూడా పొందాను. మా పాఠశాలలో గ్రేడ్-1 టిపి పోస్ట్ లేదు కనుక నాకు రెగ్యులర్ పదోన్నతి అవకాశం లేదు కావున 10.08.2013 నుండి మరల 6 సం॥ల స్కేలు తీసుకోవచ్చా?**

**- సి.వి.లక్ష్మీనారాయణ**, గంపలగూడెం, కృష్ణాజిల్లా

జవాబు : వీలుకాదు. ఒకే క్యాడర్‌లో ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీమ్‌లోని అన్ని దశల ప్రయోజనం పొందిన వారికి ఆ క్యాడర్‌లో లేదా తదుపరి క్యాడర్‌లో ఏఏఎస్ ప్రయోజనం వర్తించదని ఆర్థిక శాఖ లేఖ సంఖ్య 14531/140/పిసి-11/2008-2, తేది.18.04.2009 ద్వారా వివరణ యిచ్చి వున్నది. మీ విషయంలో ప్రభుత్వం యాక్ట్ 1/2005 ద్వారా జిఓ 330ని రద్దు చేసింది. ఆ మేరకు మీరు గ్రేడ్-2 పండిట్ పోస్టులో వేతనాన్ని పున:స్థిరీకరించుకోవలసి వుంటుంది.

ప్రశ్న : **నేను 2000 డిఎస్‌సి ద్వారా అన్‌ట్రైన్డ్ ఎస్‌జిటిగా నియామకమై 2005 మే లో డిఇడి పూర్తి చేశాను. 2006 మే నుండి వార్షిక ఇంక్రిమెంట్లు పొందుచున్నాను. అప్రెంటిస్ కాలానికి 2 నోషనల్ ఇంక్రిమెంట్లు యిచ్చారు. నాకు 12 సం॥ స్కేలుకు అన్‌ట్రైన్డ్ సర్వీసును లెక్కిస్తారా? అన్‌ట్రైన్డ్ సర్వీసు పెన్షన్‌కు పరిగణిస్తారా?**

**- బి.జగన్నాథనాయక్**, తెనాలి, గుంటూరు జిల్లా

జవాబు : సాధారణంగా ఇంక్రిమెంటల్ సర్వీసును మాత్రమే ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కేళ్ళ మంజూరుకు లెక్కిస్తారు. అయితే జిఓ నం.119 విద్య; తేది.21.04.1998 & జిఓ నం.92 విద్య, తేది.08.08.2000ల ద్వారా స్పెషల్ టీచర్ల సర్వీసును మరియు జిఓ నం. 38 విద్య; తేది.26.05.2007ల ద్వారా అప్రెంటిస్ సర్వీసును ఇంక్రిమెంట్లతో నిమిత్తం లేకుండా ఏఏఎస్‌కు సర్వీసుగా పరిగణించారు. కనుక మీకు 12 సం॥ల సర్వీసు పూర్తయిన మరుసటి రోజు నుండి SPP-IA మంజూరు చేయాలి. అన్‌ట్రైన్డ్ సర్వీసును కూడా పెన్షన్ లెక్కింపుకు అర్హత గల సర్వీసుగానే పరిగణిస్తారు.

ప్రశ్న : **నేను 2002 జనవరిలో ఎస్‌జిటిగా చేరాను. ఆర్‌పిఎస్-2010 ఫిక్సేషన్ సందర్భంగా 2002 అక్టోబర్‌లో చేరిన ఉపాధ్యాయునితో ప్రీపోన్‌మెంట్ తీసుకున్నాను. మాతోపాటే జనవరిలో నియామకమైన ఉపాధ్యాయులు కొందరు ఇ.ఓ.ఎల్. కారణంగా జులై / ఆగస్టులో ఇంక్రిమెంటు పొందుతున్నారు. కొందరు వారితో ప్రీపోన్‌మెంట్ తీసుకున్నారు. నేను కూడా మరల జులై / ఆగస్టుకు ప్రీపోన్‌మెంట్ తీసుకోవచ్చా?**

**- జి.భానుప్రకాష్**, వేమవరం, ప్రకాశం జిల్లా

జవాబు : తీసుకోవచ్చు.

ప్రశ్న : (i) నేను 17.10.2002న ఎస్‌జిటిగా చేరి 5 రోజులు పనిచేసి 6 నెలల జీత నష్టం సెలవుపై ఎమ్మెస్సీ (జువాలజీ) చదివాను. ఆ కారణంగా 6 నెలలు ఆలస్యంగా రెగ్యులర్ స్కేలు పొందాను. ఇంక్రిమెంటు నెల అక్టోబర్ నుండి ఏప్రిల్‌కు మారింది. ఉన్నత విద్య కోసం వినియోగించుకున్న ఇ.ఓ.ఎల్.కాలం ఇంక్రిమెంటుకు లెక్కించబడుతుందన్న నిబంధన నాకు వర్తిస్తుందా?

- కె.శివన్నారాయణ, సంతమాగులూరు, ప్రకాశం జిల్లా

(ii) అప్రెంటిస్ కాలంలో వైద్య కారణాలపై ఇ.ఓ.ఎల్.పెట్టడం వలన ఇంక్రిమెంటు తేదీ నవంబర్ నుండి మే కి మారింది. వైద్య కారణాలపై వినియోగించుకున్న ఇ.ఓ.ఎల్. ఇంక్రిమెంట్‌కు లెక్కించబడుతుందనే నిబంధన ప్రకారం నా ఇంక్రిమెంటు తేదీ నవంబరుకు మార్చుకోవచ్చా?

- టి.వినోద్‌కుమార్, వేపాడ, విజయనగరం జిల్లా

జవాబు : ఎఫ్ఆర్-26(బి) ప్రకారం అనారోగ్యం, ఉన్నత విద్య కొరకు వినియోగించుకున్న ఇ.ఓ.ఎల్.కాలము ఇంక్రిమెంటు మంజూరుకు సర్వీసుగా లెక్కించబడుతుంది. అయితే అప్రెంటిస్ కాలంలో ఇంక్రిమెంట్లు లేవు కనుక ఆ కాలంలో వినియోగించుకున్న ఇ.ఓ.ఎల్.ను తరువాత మంజూరైన నోషనల్ ఇంక్రిమెంట్లకు సర్వీసుగా పరిగణించే అంశంపై స్పష్టమైన ఉత్తర్వులు లేవు.

మీ సెలవు మంజూరు ఉత్తర్వులు, వైద్య ధృవపత్రం, ఎస్ఆర్‌లను జత చేసి, మీ దరఖాస్తును డిఇఓ ద్వారా సి & డిఎస్ఇకి పంపించి ఒక ప్రయత్నం చేయండి.

ప్రశ్న : నేను 2002 ఏప్రిల్‌లో ఎస్‌జిటిగా ప్రకాశం జిల్లాలో నియామకమై 2010 ఫిబ్రవరిలో కృష్ణా జిల్లాకు అంతర్జిల్లా బదిలీపై వచ్చాను. కృష్ణాజిల్లాలో 2002 అక్టోబర్‌లో నియామకమైన వారు నాకంటే ఎక్కువ వేతనం పొందుచున్నారు. వారితో నేను ప్రీపోన్‌మెంట్ పెట్టుకోవచ్చా?

- షేక్ ముంతాజ్‌బేగం, విజయవాడ, కృష్ణాజిల్లా

జవాబు : అవకాశం లేదు. మీరు 2010 ఫిబ్రవరిలో కృష్ణా జిల్లాకు బదిలీపై వచ్చినందున మీ సర్వీసు ఈ జిల్లాలో చేరిన తేదీ నుండి మాత్రమే లెక్కిస్తారు కనుక 2002 అక్టోబర్‌లో నియామకమైన ఉపాధ్యాయులు మీకంటే సీనియర్లుగా పరిగణించబడతారు. కాకపోతే 01.07.2008 నాటికి మీరు ప్రకాశం జిల్లాలోనే ఉన్నారు కనుక ఆ జిల్లాలో 2002 అక్టోబర్‌లో నియామకమైన ఉపాధ్యాయులతో ప్రీపోన్‌మెంట్ తీసుకోవచ్చు.

ప్రశ్న : 2002 జనవరి 19న ఎస్‌జిటిగా నియామకమైన నేను జూనియర్‌తో ప్రీపోన్‌మెంట్ కారణంగా ఇంక్రిమెంటు తేదీ అక్టోబర్‌కు మారింది. 2014 జనవరి నాటికి నా సర్వీసు 12 సం॥లు పూర్తి అవుతుంది. నాకు 12 సం॥ల స్కేలు 2014 జనవరి నుండి మంజూరు చేస్తారా లేక అక్టోబర్ 2014 వరకు ఆగాలా? అక్టోబర్ 2013 నాటికి నా వేతనం 14050గా వుంటుంది. 12 సం॥ల అనంతరం నా వేతనం ఎంత అవుతుంది? తదుపరి ఇంక్రిమెంటు తేదీ ఏది అవుతుంది.

- ఎ.రవికుమార్, గజపతినగరం, విజయనగరం జిల్లా

జవాబు : మీకు 12 సం॥ల సర్వీసు పూర్తి అయిన మరుసటి రోజు (2014 జనవరి) నుండి 12 సం॥ల స్కేలు SPP-IA మంజూరు చేయబడుతుంది. SPP-IA స్కేలు 14860-39540లో ఎఫ్ఆర్ 22 a(i) ప్రకారం కనీస వేతనం రు.14860 వద్ద స్థిరీకరణ జరుగుతుంది. మీకు ఎఫ్ఆర్ 31(2) ప్రకారం తదుపరి ఇంక్రిమెంటు తేదీకి వేతన పునఃస్థిరీకరణ ప్రయోజనం వర్తించదు కనుక 1 సం॥ తర్వాతనే అనగా జనవరి 2015లో వార్షిక ఇంక్రిమెంటు మంజూరౌతుంది.

ప్రశ్న : ఒక ఉపాధ్యాయురాలు 1998 ఆగస్టులో నిజామాబాద్ జిల్లాలో నియామకమై 2009 జనవరిలో ఎస్ఏ (ఇంగ్లీష్) ప్రమోషన్ పొందిన అనంతరం 2009 నవంబర్‌లో అంతర్జిల్లా బదిలీపై రంగారెడ్డి జిల్లాకు వచ్చారు. నిజామాబాద్, రంగారెడ్డి జిల్లాలలో ఎస్‌జిటిగా నియామకమైన జూనియర్లు 2012లో ఎస్ఏ (ఇంగ్లీష్) ప్రమోషన్ పొంది ఆమెకంటే ఎక్కువ వేతనం పొందుచున్నారు. ఆ ఉపాధ్యాయురాలు గతంలో పనిచేసిన నిజామాబాద్ లేదా ప్రస్తుతం పనిచేస్తున్న రంగారెడ్డి జిల్లా ఉపాధ్యాయులతో స్టెప్ తీసుకునే అవకాశం ఉందా?

- కె.భాస్కర్, గూడూర్, రంగారెడ్డి జిల్లా

జవాబు : లేదు. నిజామాబాద్ జిల్లాలో తనకంటే జూనియర్లు ఎస్ఏగా ప్రమోషన్‌పొందే నాటికి ఆమె ఆ జిల్లాలో లేరు. మరియు ఎస్‌జిటి క్యాడర్లో తన నియామకపు యూనిట్ రంగారెడ్డి జిల్లా కాదు కనుక నిబంధనల ప్రకారం నిజామాబాద్ లేదా రంగారెడ్డి జిల్లాల ఉపాధ్యాయులతో స్టెప్‌అప్‌కు అవకాశం లేదు.

ప్రశ్న : నేను 14.08.1998న ఎస్‌జిటిగా నియామకమై 8సం॥ల స్కేలు పొందిన తర్వాత 01.02.2009నాడు ఎస్ఏ (ఇంగ్లీష్)గా ప్రమోషన్ తీసుకున్నాను. నేను ఎస్‌జిటిగా అప్రెంటిస్ కాలంలో 181 రోజులు ఇ.ఓ.ఎల్. వినియోగించుకున్నాను. నాకంటే జూనియర్ అయిన నా మిత్రుడు 8/12 సం॥ల స్కేళ్ళు పొందిన తర్వాత ఎస్ఏ (ఇంగ్లీష్) ప్రమోషన్ పొందాడు. ప్రస్తుతం నాకంటే ఒక ఇంక్రిమెంటు అదనంగా తీసుకుంటున్నాడు. నేను అతనితో స్టెప్‌అప్ తీసుకోవచ్చా?

- పి.శ్రీనివాస్, తాండూర్, రంగారెడ్డి జిల్లా

జవాబు : మీ ఇరువురి వేతనాల మధ్య ఏర్పడిన వ్యత్యాసం ఇ.ఓ.ఎల్. కారణంగా వచ్చినదైతే స్టెప్‌అప్ వీలుపడదు. ఇ.ఓ.ఎల్.తో సంబంధం లేకుండా కేవలం 8/12 సం॥ల స్కేళ్ళు పొందడం వల్లనే కలిగినయెడల స్టెప్‌అప్ తీసుకోవచ్చును.

ప్రశ్న : నేను 2002 జనవరిలో ఎస్‌జిటిగా నియామకమై మరల 2006 డిఎస్‌సి ద్వారా ఎస్ఏ (మాథ్స్)గా ఎంపికై 2007 నవంబర్‌లో చేరాను. నేను ఎస్‌జిటి సర్వీసు నుండి రిలీవ్ అయ్యే నాటికి 72 రోజులు హెచ్‌పిఎల్‌లు, 37 ఇ.ఓ.ఎల్.లు నిల్వ వున్నాయి. 2008లో అనారోగ్యం కారణంగా 44 రోజులు సెలవు వినియోగించుకున్నాను. మా ప్రధానోపాధ్యాయులు నిల్వయున్న సెలవులను పరిగణనలోకి తీసుకోకుండా 44 రోజులు ఇ.ఓ.ఎల్. మంజూరు చేసి అప్రెంటిస్ కాలాన్ని పొడిగించారు. ఇంక్రిమెంటు తేదీ కూడా జనవరికి మారిపోయింది. నా ఇంక్రిమెంటును నవంబర్‌కు మార్చుకునే వీలుందా?

- డి.శ్రీనివాసరావు, కొవ్వూరు, పశ్చిమగోదావరి జిల్లా

జవాబు : నిబంధనల ప్రకారం ఒకసారి మంజూరు చేసిన సెలవును ఎట్టి పరిస్థితులలోనూ మార్పు చేయకూడదు. మీరు 2008లో వినియోగించుకున్న సెలవును ఇ.ఓ.ఎల్.గా మంజూరు చేశారు. కనుక ఇప్పుడు దానిని మార్పు చేయడం వీలుపడదు. అప్రెంటిస్ కాలంలో అనారోగ్య కారణాలపై వినియోగించుకున్న ఇ.ఓ.ఎల్.ను ఇంక్రిమెంట్లకు సర్వీసుగా పరిగణించేందుకు ఉత్తర్వులు లేవు. అయినా సి& డిఎస్ఇకి ప్రతిపాదనలు పంపి ఒక ప్రయత్నం చేయండి.

# వాళ్లేనా విద్యా శత్రువులు?



నాగటి-నారాయణ
యుటీయఫ్ రాష్ట్ర గౌ॥అధ్యక్షులు

పాఠశాలల్లో పనిచేసే తాత్కాలిక ఉపాధ్యాయులు విద్యారంగానికి శత్రువులు అని సుప్రీంకోర్టు గత మే 20న తీవ్రమైన వ్యాఖ్య చేసింది. అవసరమైనంతమంది రెగ్యులర్ టీచర్లను నియమించకుండ మన రాష్ట్రంలో వలెనే గుజరాత్, ఉత్తర ప్రదేశ్, బీహార్, ఒడిశా, రాజస్థాన్ తదితర చాలా రాష్ట్రాల్లో తాత్కాలిక ఉపాధ్యాయులతో పనిచేయించటం జరుగుతోంది. మన రాష్ట్రంలో విద్యావలంటీర్, గుజరాత్‌లో శిక్షా సహాయక్, ఉత్తర ప్రదేశ్‌లో శిక్షా సహయోగ్, రాజస్థాన్‌లో శిక్షా కర్మి, బీహార్‌లో శిక్షా మిత్ర యిలా రాష్ట్రానికో ముద్దు పేరు పెట్టారు. ఇలాంటి వారు దేశ వ్యాప్తంగా దాదాపు 15 లక్షలమంది పనిచేస్తున్నట్లు జాతీయ విద్యా ప్రణాళిక, పరిపాలన విశ్వ విద్యాలయం ప్రకటించిన నివేదిక ద్వారా తెలుస్తోంది. ప్రైవేటు స్కూళ్లలో (8.2%)కంటే ప్రభుత్వ పాఠశాలల్లో (14.4%)నే కాంట్రాక్ట్ టీచర్లు ఎక్కువ వున్నట్లు వివరించబడింది. ఈ తరహా ఉపాధ్యాయుల నియామకాలు రాష్ట్రానికో విధంగా జరుగుతున్నాయి. మన రాష్ట్రంలో విద్యావలంటీర్ల నియామకాలు మండలం యూనిట్‌గా జరిగాయి. ఎస్సీ, ఎస్టీ, బీసీ రిజర్వేషన్‌లు పాటించబడినవి. గుజరాత్ రాష్ట్రంలో శిక్షా సహాయక్‌ల నియామకంలో రిజర్వేషన్‌లు పాటించాలని ఆ రాష్ట్ర హైకోర్టు యిచ్చిన ఆదేశాలను అమలు చేయటానికి యిష్టం లేని మోడీ ప్రభుత్వం సుప్రీంకోర్టులో అప్పీల్ చేసింది. సదరు అప్పీల్ స్వీకరణ దశలోనే న్యాయమూర్తులు బి.ఎస్.చౌహాన్ మరియు దీపక్ మిశ్రా చాలా తీవ్రంగా స్పందించారు. విద్యాహక్కు చట్టం అమల్లోకి వచ్చినాక కూడా సరైన విద్యార్హతలు లేని వారిని తాత్కాలిక ఉపాధ్యాయులుగా నియమించి విద్యార్థుల జీవితాలకు, దేశ భవిష్యత్‌కు విఘాతం కల్గిస్తారా అని ప్రశ్నించారు. రెగ్యులర్ టీచర్‌కి యిచ్చే జీతంలో నాలుగోవంతు కూడా చెల్లించకుండా పైగా వారిని శిక్షా సహాయక్‌లని అంటారా? అలాంటి వారిని విద్యా శత్రువులుగా పరిగణించాలని, ఏ రాష్ట్రంలోనూ అటువంటి నియామకాలను అంగీకరించ కూడదని అన్నారు.

విద్యాహక్కు చట్టం అమలు విషయంలో పాలకుల నిర్లక్ష్యాన్ని నిలదీసిన సుప్రీంకోర్టు న్యాయమూర్తుల వ్యాఖ్యలు ఎంతో ప్రశంసించదగినవే. అయితే విద్యారంగానికి అసలు శత్రువులను బోనెక్కించాల్సిన విషయాన్ని అందరూ ఆలోచించాలి. ప్రతి విషయాన్నీ తనకు అనుకూలంగా మలుచుకొనే నైపుణ్యం గల పాలకులపై సుప్రీం చీవాట్లు పనిచేస్తాయని ఆశించలేము. మీదు మిక్కిలి విద్యారంగానికి మరింత నష్టం చేసే ప్రమాదమూ లేకపోలేదు. విద్యావలంటీర్ల నియామకాల విషయంలో మన రాష్ట్ర ప్రభుత్వం గత రెండేళ్ళ నుండి దోబూచులాడుతూనే వుంది. ఈ సంవత్సరం విద్యావలంటీర్‌ల నియామకాలు లేవని ఆర్వీఎం వారు యిప్పటికే ప్రకటించారు. ఉపాధ్యాయులు లేనందున కనీసం విద్యావలంటీర్‌లను అయినా యివ్వండి అనే డిమాండ్ నుండి ప్రభుత్వం తప్పించుకోవటానికి సుప్రీం వ్యాఖ్యల్ని అడ్డం పెట్టుకొనే అవకాశం వుంది..

సుప్రీంకోర్టు వ్యాఖ్యల మేరకు తాత్కాలిక ఉపాధ్యాయుల నియామకాలు చేయకపోతే మన రాష్ట్రంలో ప్రభుత్వరంగంలోని చాలా పాఠశాలల్లో సగంమంది ఉపాధ్యాయులే పనిచేస్తారు. మండల పరిషత్, జిల్లా పరిషత్, ప్రభుత్వ, మున్సిపల్ పాఠశాలల్లో గత ఐదేళ్లలో సగటున సంవత్సరానికి 60వేలమంది విద్యావలంటీర్‌లు పనిచేశారు. గిరిజన సంక్షేమ ఆశ్రమ పాఠశాలలు మరియు ఏపీఆర్ఎస్, సాంఘిక, గిరిజన గురుకులాలు, కేజీబీవీ తదితర పాఠశాలల్లో సిఆర్‌టి, గెస్ట్, కాంట్రాక్ట్ తదితర పేర్లతో 40వేలమంది పనిచేస్తున్నారు. ఎయిడెడ్ స్కూళ్లలో మేనేజిమెంట్లు నియమించుకొంటున్న అన్‌ఎయిడెడ్ టీచర్లు 10వేలు దాకా వున్నారు. వీరందరినీ కలిపిచూస్తే లక్షమందిపైగా వున్నారు. వీరందరి నియామకాలు చేయకపోతే అంతమంది రెగ్యులర్ టీచర్‌లను నియమించాలి. కానీ డిఎస్‌సి-2013 ద్వారా 20వేలమంది ఉపాధ్యాయులను నియమించే ప్రక్రియను వచ్చే నవంబర్ నెలలో చేపడతామని విద్యాశాఖ మంత్రిగారు ప్రకటించారు. అంటే యీ విద్యా సంవత్సరంలో క్రొత్త టీచర్ల నియామకాలు లేనట్లే. రెగ్యులర్ టీచర్లను నియమించకుండా, తాత్కాలిక ఉపాధ్యాయుల సర్వీస్‌లను వినియోగించకపోతే ప్రభుత్వరంగ పాఠశాలల్లో విద్యార్థులకు అరకొర చదువే దక్కుతుంది. అందువలన అసంతృప్తి చెందే తల్లిదండ్రులు ఫీజుల భారం భరించి అయినా తమ పిల్లల్ని ప్రైవేట్ స్కూళ్లలో చేర్పిస్తారు. దీనితో ప్రభుత్వ పాఠశాలలు మరింత దివాళా తీసే దుస్థితి దాపురిస్తోంది. కనుక రెగ్యులర్ టీచర్లను నియమించకుండా తాత్కాలిక ఉపాధ్యాయులతో పనిచేయిస్తూ విద్యార్థులకు అన్యాయం చేస్తున్న ప్రభుత్వాలే అసలైన విద్యా శత్రువులు అవుతారు. వారిని శిక్షించేందుకు న్యాయస్థానాలు పూనుకొంటే విద్యారంగానికి ఎంతో మేలు జరుగుతుంది.

ఆ మాటకొస్తే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని అన్ని విధాలా విద్యా శత్రువుగానే పరిగణించాల్సి వుంటుంది. విద్యాహక్కు చట్టంలోని ఏ నిబంధననూ సరిగా అమలు చేయటం లేదు. జనభా లెక్కల ప్రకారం బడిలో లేని పిల్లలు 20లక్షలమంది వుంటే కేవలం 1.60లక్షమంది వున్నట్లు ప్రాథమిక విద్యాశాఖ మంత్రి గత ఏప్రిల్ 2న ప్రకటించారు. బడిఈడుగల బాలబాలికలు అందరినీ బడిలో చేర్చాలనే అసలు లక్ష్యాన్నే నిర్లక్ష్యం చేస్తున్నారు. వయసుకి తగిన తరగతిలో చేరేదానికి అవసరమైన ప్రత్యేక శిక్షణ యివ్వాలనే ఆదేశాన్ని అమలు చేయటం లేదు. ప్రత్యేక అవసరాలు గల బాలలకు ప్రత్యేక ఉపాధ్యాయులను నియమించే ఊసే లేదు. పాఠ్య పుస్తకాలు, బట్టలు కూడా సకాలంలో యివ్వటం లేదు. చట్టంలో పేర్కొన్న ప్రమాణాల ప్రకారం పాఠశాలలకు భవనాలు, టాయ్‌లెట్స్, త్రాగునీరు, వంటగది తదితర కనీస సదుపాయాలు సగం స్కూళ్లకు సమకూర్చలేదు. చట్టంలోని నిబంధనలను పాటించని ప్రైవేట్ స్కూళ్లను ఏమీ చేయటం లేదు. క్షేత్రస్థాయిలో చట్టాన్ని అమలు చేయాల్సిన విద్యాధికారులు 930 మండలాల్లో లేరు. రాష్ట్రమంతటా చట్టం అమలును పర్యవేక్షించాల్సిన రాష్ట్ర బాలల హక్కుల సంరక్షణ కమీషన్ నియామకం చేయనేలేదు. చట్టం అమల్లోకి వచ్చి మూడు సంవత్సరాలు గడిచిపోయినా అసలు విషయాలను అమలు చేయని రాష్ట్ర ప్రభుత్వం నిజమైన విద్యా శత్రువు అవుతుంది. ఈ విషయాన్ని న్యాయ మూర్తులు పరిగణనలోకి తీసుకొంటే రాష్ట్ర విద్యారంగానికి ఎంతో మేలు జరుగుతుంది. ●

# శశాంక విజయం



**ఎయిడెడ్ స్కూల్ నుండి ఐఏఎస్‌కు**

**ఒక సాధారణ ఎయిడెడ్ పాఠశాలలో చదివిన విద్యార్థి ఐఏఎస్‌లో ర్యాంకు సాధించటం విశేషం. కొండూరు శశాంక హైదరాబాద్‌లోని స్వామి వివేకానంద సెంటినరీ ఎయిడెడ్ హైస్కూల్‌లో పాఠశాల విద్యను, లిటిల్ ఫ్లవర్ జూనియర్ కాలేజీలో ఇంటర్ చదివారు. బి.కాం (ఆనర్స్) పూర్తి చేసి చార్టెడ్ అకౌంటెన్సీలో 49వ ర్యాంకు సాధించారు.**

పర్సునిండా శాలరీ ప్యాకేజీతో మల్టీనేషనల్ కంపెనీలో చార్టెడ్ అకౌంటెంట్ జాబ్ ఆపై చార్టెడ్ అకౌంటెంట్‌గా సొంతంగా ప్రాక్టీసు పెట్టుకోగల ఆకర్షణీయమైన కెరీర్. చదివిన ప్రొఫెషనల్ కోర్సు నైపుణ్యంతో ఆకాశమే హద్దుగా ఉద్యోగావకాశాలు... వీటన్నింటిని తృణప్రాయంగా తోసిరాజని ఇటు సమాజం, అటు ప్రజలయికు ప్రత్యక్షంగా సేవ చేయడం సంతృప్తినివ్వడం అది **ఐఏఎస్** సర్వీసుతోనే సాధ్యమవుతుందనే అపారమైన నమ్మకం. దీనికి తోడు తల్లిదండ్రులు వెంకటయ్య, సంయుక్తల సేవా నిరతి ప్రేరణ కాగా, పెదనాన్న కొండూరు పురుషోత్తం, మావయ్య మోతుకూరి నరహరిలతో ఎప్పుడూ కుటుంబ సమావేశాలు, చర్చలలో **ఐఏఎస్** గురించే ఆలోచనలు... చార్టెడ్ అకౌంటెంట్‌గా ఉద్యోగ రీత్యా అనేక ప్రాంతాలు తిరుగుతూ, అక్కడి ప్రజానీకానికి అవసరమైన మెరుగైన సౌకర్యాల కల్పనపై ఆలోచనల్లో పటిష్టమైన ప్రణాళికలు. సరిగ్గా ఈ నేపథ్యంతో ఎలాగైనా **ఐఏఎస్** సాధించాలనే బలమైన లక్ష్యంతో శశాంక చార్టెడ్ అకౌంటెంట్ ఉద్యోగానికి రాజీనామా చేసి సివిల్స్ సమరాంగణంలోకి అడుగిడినారు. తొలి ప్రయత్నంలో 90మార్కుల వ్యత్యాసంతో ఇంటర్వ్యూ 'మిస్' అయినా నిరాశ చెందకుండా మలి ప్రయత్నంలోనే జాతీయ స్థాయిలో 16వ ర్యాంకర్‌గా నిలిచి మన రాష్ట్ర సివిల్స్ టాపర్‌గా తన చిరకాల స్వప్నం **ఐఏఎస్** సర్వీసును సొంతం చేసుకున్నారు. ఒక వేళ **ఐఏఎస్** రాకపోతే ఒక స్వచ్ఛంద సేవా సంస్థను నెలకొల్పయినా సేవా కార్యక్రమాలు చేయాలనే బలమైన లక్ష్యంతో ఉన్న **శంశాక** ముందు ఆ సివిల్సే మోకరిల్లింది.

## డిగ్రీ తర్వాతే సివిల్స్ బీజం

చాలామంది బ్యాచిలర్ డిగ్రీ కోర్సులో ఉండగానే ఐఏఎస్ కెరీర్‌కు పునాదులు వేసుకుంటారు. అప్పుడే ప్రిపరేషన్‌కు శ్రీకారం చూడతారు. అందుకు భిన్నంగా శశాంక బికాం (ఆనర్స్) కోర్సులో చేరగానే, తొలి ఏడాది నుంచి చార్టెడ్ అకౌంటెన్సీ కోర్సుపై ప్రణాళిక వేసుకొని చదవటం ప్రారంభించారు. ఆయన ప్రణాళిక ప్రకారం అటు బికాం (ఆనర్స్) కోర్సు మంచి మార్కులతో ఉత్తీర్ణుడయ్యారు. ఆపై చార్టెడ్ అకౌంటెన్సీ కోర్సును పూర్తి చేశారు. ఆల్ ఇండియాలో 49 ర్యాంకర్‌గా సిఏలో టాప్ ఫిఫ్టీలో ఉన్న శశాంకకు బహుళ జాతి కంపెనీలో చార్టెడ్ అకౌంటెంట్‌గా బెస్ట్ శాలరీ ప్యాకేజీలతో ఉద్యోగం లభించింది.

2008లో అటు బికాం (ఆనర్స్) ఇటు సిఏ ఆర్టికల్‌షిప్ పూర్తి చేసిన శశాంక 2008 నుంచి 2010 రెండేళ్ళ కాలం ఎంఎన్‌సి కంపెనీ ఎర్న్‌స్ట్ అండ్ యంగ్ ప్రైవేట్ లిమిటెడ్‌లో చార్టెడ్ అకౌంటెంట్‌గా విధులు నిర్వర్తించారు. అయితే ఆయనకు అది సంతృప్తినివ్వలేదు. తను ఉండాల్సింది ఇక్కడ కాదని ఆయన మనసు పదేపదే చెప్పింది. ఎప్పటి నుంచో తన మనస్సు ఆరాటపడుతున్న ఐఏఎస్ సర్వీసును సొంతం చేసుకోవాలనుకున్నారు. 2010 నవంబర్‌లో చార్టెడ్ అకౌంటెంట్ ఉద్యోగానికి రాజీనామా చేసి 2011 జనవరి నుంచి సివిల్స్ శిక్షణకు ఢిల్లీ వెళ్ళారు. అక్కడినుంచే తొలి అటెమ్ట్ యిచ్చారు. మలి ప్రయత్నంగా హైదరాబాద్ నుంచి సివిల్స్ రాసి ఐఏఎస్ సర్వీసును సాధించారు. ఉద్యోగం లేకుండా ఫ్రెష్ గ్రాడ్యుయేట్‌గా ఎటువంటి వత్తిళ్ళు లేని వాతావరణంలో సివిల్స్ పరీక్షలు రాయడం సాధారణ ప్రయత్నమైతే చేస్తున్న ఉద్యోగాన్ని వదిలేసి, అన్ని వైపుల నుంచి వచ్చే వత్తిళ్ళ మధ్య విజయం సాధించటం శశాంక సాధించిన అరుదైన విజయం.

## సివిల్స్ ఎగ్జామ్ ఒక సాధనం

ఐఏఎస్ కావాలన్నది లక్ష్యం. అందుకు అవసరమైన ఉపకరణం (టూల్స్) సివిల్స్ ఎగ్జామ్ అందులో ప్రావీణ్యం ప్రదర్శించడమే లక్ష్యంగా, నిబద్ధతతో సివిల్స్ ప్రిపరేషన్ చేశానని ఆయన చెప్పారు. ఏడాదిపాటు న్యూఢిల్లీలో సివిల్స్ శిక్షణ తీసుకోవటం, ఆపై ప్రిపరేషన్ చేస్తూ అక్కడినుంచే సివిల్స్ అటెమ్ట్ చేయటం ఆ తరువాత రెండో అటెమ్ట్ హైదరాబాద్ నుంచీ సొంతంగా చదువుకుంటూ తొలిసారి పొరపాట్లను అధిగమిస్తూ ఇష్టంతో సాగించిన ప్రిపరేషన్ ప్రయత్నమే **ఐఏఎస్** సాధించి పెట్టిందని చెప్పారు. 'లీజర్'గా చదవలేదు, ప్రెజర్‌తో చదివాను. అయితే ఆ ప్రెజర్‌లో వందశాతం ప్లెజర్ (ఇష్టం) ఉంది. కాబట్టే చదువుతున్న క్రమంలో గానీ, పరీక్షలకు హాజరవుతున్న వాతావరణం లోనూ నాకు **ఐఏఎస్** రాదనే ప్రతికూల భావన ఏ రోజు కలగలేదని' అన్నారు.

అనుకున్నది సాధించానన్న ఆనందంలోను, ఆశిస్తున్నవి చేయ బోతున్నాన్న ఆసక్తితోను ఉన్న **శశాంక** లక్షలాది యువత జీవన స్వప్నం **ఐఏఎస్** సెలక్షన్ తనకు ఎలా సాధ్యమైందో వివరించారు. అరుదైన ఆప్షనల్స్ సెలక్షన్స్ నుంచి ప్రిపరేషన్ లోటుపాట్ల వరకు సుదీర్ఘంగా వివరించారు.

ప్రశ్న : **సక్సెస్ రేటులో ముందు వరుసలో ఉన్న పాపులర్ ఆప్షనల్స్‌ను ఎంచుకోకుండా చాలా కష్టంగా ఉండే కామర్స్, ఎకనామిక్స్ ఆప్షనల్స్ ఎంపిక చేసుకోవడం 'రిస్క్' అన్పించ లేదా?**

**జవాబు :** నేను ఇంటర్, డిగ్రీ, సిఏ కోర్సు వరకు కామర్స్ సబ్జెక్ట్‌ను ప్రత్యేకంగా చదివాను. ఇది నా సబ్జెక్ట్ కనుకనే కోచింగ్ అవసరం లేకుండా కామర్స్‌లో ప్రభావ వంతంగా సమాధానాలు రాయగలననే నమ్మకంతో ఒక ఆప్షనల్‌గా కామర్స్‌ను ఎంచు కున్నాను. ఇక ఎకనామిక్స్ సబ్జెక్టులో



ఇంటర్, డిగ్రీల్లో కాస్త పరిచయమే ఉంటుంది. అయినప్పటికీ ఎకనామిక్స్ బాగా తెలిసి ఉంటే. బెస్ట్ అడ్మినిస్ట్రేటర్‌గా రాణించ వచ్చుననే అభిప్రాయం కలిగింది. ఇక పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్ వంటి సబ్జెక్టులంటారా **ఐఏఎస్ శిక్షణలో** తెలుసుకొనే అవకాశం ఎలాగూ ఉంటుంది కదా. అదే ఎకనామిక్స్ సాధికారంగా తెలియాలంటే సివిల్స్ ఆప్షనల్స్ ఎంచుకోవడమే ఏకైక మార్గంగా భావించి దీనిని తీసుకున్నాను.

ప్రశ్న : **సివిల్స్ పరీక్షలకు రోజూ ఎన్ని గంటలు చదివారు. ఏమైనా సబ్జెక్టులకు ఎక్కడయినా శిక్షణ తీసుకున్నారా? మీరు ఎటువంటి పంథాతో సివిల్స్‌కు ప్రిపరేషన్ సాగించారు?**

జవాబు : కొన్నిసార్లు గంటసేపు మాత్రమే చదివిన రోజులున్నాయి. కొన్ని రోజులు పది, పన్నెండు గంటలు చదివి ప్రిపరేషన్ పూర్తి చేసిన సందర్భాలున్నాయి. మొత్తం మీద ఫోకస్డ్‌గా ఎక్కువ గంటలు సద్వినియోగం అయ్యేలా చదివాను. సరైన మెటీరియల్‌ను, సరిపోయేంత లోతుగా అధ్యయనం జరిగేలా నా ప్రిపరేషన్ ఉండేది. ఉదా॥ ప్రధానమంత్రి ఏదైనా అంశంపై మాట్లాడినప్పుడు దానిని వున్నది ఉన్నట్టుగా ప్రెస్ ఇన్ఫర్మేషన్ బ్యూరో ఏ రోజుకారోజు సమాచారం అందిస్తుంటుంది. 99శాతం ప్రభుత్వ కార్యక్రమాలు పిఐబి సమాచారం నేరుగా చదివే ప్రయత్నం చేసా. దీనివల్ల వివిధ అంశాలపై ఒక అభిప్రాయానికీ వచ్చే వీలుంటుంది.

ప్రస్తావించిన చోట దానిని మన అభిప్రాయంగా ధృఢంగా చెప్పే అవకాశం ఉంటుంది. ఇక జనరల్ స్టడీస్‌కై న్యూఢిల్లీలోని శ్రీరాం ఇన్‌స్టిట్యూట్‌లో శిక్షణ పొందాను. శ్రీరాం సూచనలు నాకు బాగా ఉపయోగపడ్డాయి. ఇక ఎకనామిక్స్‌కి న్యూఢిల్లీలో కళింగ స్టడీ సర్కిల్‌లో కోచింగ్ తీసుకున్నాను. కామర్స్ సొంతంగానే చదివాను.

ప్రశ్న : **తొలి ప్రయత్నంలో మీరు తెలియక చేసిన పొరపాటు ఏమిటి? మలి ప్రయత్నంలో మీరు చెప్పుకోదగిన స్థాయిలో ప్రిపరేషన్‌లో చేసుకున్న మార్పులు ఏమిటి? ఇంతకీ ఒక కొత్త అభ్యర్థి తొలి ప్రయత్నంలోనే శిఖర సమానమైన సివిల్స్ సాధించటం వీలవుతుందా?**

జవాబు : తొలి అటెమ్ట్‌లో ఒకే సమాచారం కోసం అనేక మేగజైన్లు, పుస్తకాలు చదవటం వల్ల కాలం వృధా అయ్యింది. జనరల్ స్టడీస్ పేపర్‌ను బాగా రాయలేకపోవటం, ఎంతో సమాచారం వున్నా నిర్దిష్టమైన 3 గంటల్లో అడిగిన మేరకు జవాబులు రాయలేకపోయాను. మాక్ టెస్టులు చాలా తక్కువగా రాయటం. టైం మేనేజ్‌మెంట్ పట్టు లేకపోవటం వంటి పలు కారణాల వల్ల తొలి ప్రయత్నంలో ఎదురుగాలి తాకింది. వాటన్నింటిని పునరావృతం గాకుండా, వాటిపై పై చేయి సాధించేలా పటిష్టమైన వ్యూహంతో ప్రిపరేషన్ చేసిన ఫలితమే కోరుకున్న ఐఏఎస్‌ను సాధించి పెట్టింది. అటెమ్ట్‌లు నిర్దిష్టంగా ఇన్నిసార్లు చేస్తేనే సివిల్స్‌లో విజయం సాధించగలమనేది శాస్త్రీయం కాదు. అభ్యర్థి క్షేత్ర స్థాయిలో చేసిన కసరత్తు, ప్రిపరేషన్ స్థాయిని బట్టి తొలి ప్రయత్నంలోనే ఐఏఎస్ సాధించవచ్చు.

ప్రశ్న : **మీరు సివిల్స్ పరీక్షలపై ఎటువంటి పుస్తకాలు, మేగజైన్లు చదివేవారు? సివిల్స్ పరీక్ష సిలబస్ విస్తృతి ఎక్కువ ప్రశ్నా పత్రాలు కఠినంగా ఉంటాయి. మరి మీరు ఏ విధంగా ప్రిపరేషన్ ప్లాన్ చేసుకున్నారు?**

జవాబు : సివిల్స్ ప్రశ్నలు సిట్యుయేషన్‌పై ఒపీనియన్ బేస్డ్‌గా వస్తున్నాయి. ఆయా సమస్యలపై పాలనాధ్యక్షుడిగా ఏం చేయగలవు, ఎటువంటి పంథాలో వాటికి పరిరక్షణ కల్పిస్తావు? ఇంకా ఏ విధంగా వాటిని మెరుగుపర్చాలి. ఎలాంటి చర్యలు తీసుకుంటావు? అనే రీతిలో ఉంటున్నాయి. ప్రశ్న అడుగుతున్న అంశంపై అభ్యర్థికి సంపూర్ణమైన అవగాహన ఉండాలి. అలాగే వ్యక్తిగత అభిప్రాయంపై ఖచ్చితమైన సమాలోచనతో మన జవాబులు ప్రదర్శించేలా మన ప్రిపరేషన్ స్థాయి ఉండాలి. స్కూల్ రోజుల నుంచి హిందూ పేపర్ చదివే అలవాటు వుంది. ఇది తెలియకుండానే అక్కరకు వచ్చింది. ప్రెస్ ఇన్ఫర్మేషన్ బ్యూరో రోజు వారీ బులెటిన్స్ వందశాతం సద్వినియోగం చేసుకున్నాను. ఇండియన్ ఎక్స్‌ప్రెస్ (న్యూఢిల్లీ), ఫ్రంట్‌లైన్, యోజన, ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ పత్రికలు ఫాలో అయ్యాను. రాజీవ్‌సిగ్రి, అమర్త్యసేన్ వంటి ప్రముఖులు రాసిన పుస్తకాలు చదవటం సివిల్స్‌కు ఉపయోగపడింది.

ప్రశ్న : **మీ ఇంటర్వ్యూ ఎలా జరిగింది? ఎంత వ్యవధి కొనసాగిందీ ఇంటర్వ్యూ ముగియగానే మీకు సర్వీస్ గ్యారంటీగా వస్తుందనే అభిప్రాయం కల్గిందా?**

జవాబు : 25 నుంచి 30 నిమిషాల వ్యవధిలో నా సివిల్స్ ఇంటర్వ్యూ పూర్తయ్యింది. డేవిడ్ సర్ నేతృత్వంలో నా ఇంటర్వ్యూ ఫోకస్డ్‌గా చార్టెడ్ అకౌంటెన్సీ దాని సంబంధిత సబ్జెక్టు అంశాలపై ప్రశ్నలడిగారు. ఇంకా రాష్ట్రంలో జరుగుతున్న అభివృద్ధి అంశాలు, పలు రకాల క్లిష్ట సమస్యలపై ఇంటర్వ్యూ ప్రశ్నలు కొనసాగాయి. కంట్రోలర్ అడిట్ జనరల్‌కు చార్టెడ్ అకౌంటెన్సీ గల వ్యత్యాసం ఏమిటి? పేమెంట్ ఆఫ్ బోనస్ యాక్ట్ అంటే ఏమిటి? చార్టెడ్ అకౌంటెంట్‌గా సురక్షితమైన కెరీర్ వదులుకుని ఐఏఎస్ వైపు ఎందుకు మొగ్గు చూపుతున్నారు? ఆంధ్రప్రదేశ్‌లో మూడు రకాల ప్రధాన సమస్యలు ఉన్నాయి? అవి ఏమిటి? వాటిని నీవు ఎలా పరిష్కారం కనుగొనగలవు. ఆంధ్రప్రదేశ్‌లో టూరిజం అభివృద్ధి జరుగుతున్న తీరు సరియైనదేనా? ఇంకేమైనా మార్పులు చేర్పులు చేయాల్సి వుందా? ఇలా పలు రకాల ప్రశ్నలు అడిగారు. మొత్తమ్మీద ఇంటర్వ్యూ సంతృప్తికరంగా చేశాను. సెలక్షన్ వస్తుందనుకున్నాను.

**(నమస్తే తెలంగాణ సౌజన్యంతో)**



# భారతావనికి బాలలే భారమా?



కె. విజయగౌరి
యుటిఎఫ్ రాష్ట్ర సహాధ్యక్షులు

అమ్మా! అందరం మనుషులమేకదా, ఆకలి అందరికీ వుంటుంది కదమ్మా అన్నం అందరికీ ఎందుకు ఉండదమ్మా? అని ఆ పిల్లాడు వాళ్లమ్మని అడుగుతుంటే ఏం చెప్పాలో ఆ తల్లికి అర్థం కాలేదు. పిల్లాడి ప్రశ్న చర్చనీయాంశమైనదే.

1. **బాలలు - ఆహారం :** భారత సమాజంలో వ్యవస్థాగతంగా నెలకొన్న అసమానతలు అనేక రూపాలలో బాలలపై ప్రభావం చూపుతాయి. దేశంలో పేదరికం తగ్గిపోయిందని అన్ని సందర్భాలలో ఉపన్యాసాలు ఇస్తున్నారు. కాని గణాంకాలు పరిశీలిస్తే దేశ జనాభాలో 75% మంది పేదలుగా ఉన్నట్లు, 42 కోట్లమంది దారిద్ర్య రేఖకు దిగువన నివసిస్తున్నట్లు జనగణన తాజా అంకెలు చెప్తున్నాయి. నేడు మార్కెట్ ధరల భారాలు పేదలకు శరాఘాతంగా మారాయి. మధ్య తరగతి ప్రజానీకం కూడా నేటి పరిస్థితులు భారంగా ఉన్నాయని ఆందోళనలు చేస్తున్నారు. గ్రామీణ ప్రాంతాలలో రోజుకి 26 రూపాయలు ఖర్చు చేయగల్గిన వారు దారిద్ర్యరేఖకు ఎగువన ఉన్నారని ప్రకటించడం బాధ్యతారాహిత్యం. ఆహారభద్రతా బిల్లు ప్రకారం గ్రామాలలో 90%, పట్టణాల్లో 50% కుటుంబాలకు సబ్సిడీ యివ్వాల్సి ఉన్నప్పటికీ అమలుకు నోచుకోవడం లేదు. దేశంలో ఆహార సమస్య, పేదరికం తగ్గి పోవటం నిజమైతే యూనిసెఫ్ తాజా సర్వేలపై ఆందోళన వ్యక్తం చేయాల్సిన అవసరం లేదు. రక్తహీనతతో ప్రతి 100మందికి 79మంది బాలలు, పౌష్టికాహార లోపంతో 47% మంది బాలలు, శారీరకంగా ఎదగని పిల్లల్లో 90% బాలలు, ఏజెన్సీలలో 60% బాలలు రక్తహీనతతో, గత 20 ఏండ్లలో తగినంత బరువులేకుండా 48% మంది బాలలు, పుట్టినప్పుడు తగినంత బరువు లేకుండా 30% శిశువులు, ప్రతి యేటా అంధత్వంతో కోటి మంది బాలలు యిబ్బందులు పడుతున్నారని, ప్రపంచ ఆరోగ్య సంస్థ గణాంకాలు తెలుపుతున్న వాస్తవం. ఈ రిపోర్టులు తీవ్ర ఆందోళన కలిగించేవిగా ఉన్నాయి. బాలలకు మంచి తిండి లేక పోవడం ఎంత బాధాకరమో, మంచినీరు కూడా త్రాగటానికి లేకపోవడం వలన ప్రతిరోజు ఐదేళ్లలోపు చిన్నారులు 1000కిపైగా చనిపోతు ఒడడం మంచి సూచిక కాదని ఈ పరిస్థితిని అధిగమించేందుకు ప్రత్యేక చర్యలు చేపట్టాలని యునిసెఫ్ ప్రపంచ దేశాలకు విజ్ఞప్తి చేసింది. 40% చిన్నారులు జలకాలుష్యంతో చనిపోతున్నారు. భారత్ ఇందులో మొదటి స్థానంలో ఉంది.

స్టేటస్ ఆఫ్ ది వరల్డ్స్ మదర్-2013 సర్వే నివేదికలో ప్రపంచ వ్యాప్తంగా మృతి చెందుతున్న శిశువుల్లో 29%మంది భారత దేశంలోనే ఉన్నారని తెలిపింది. అంటే 3,09,300మంది పుట్టిన 24 గంటల్లోనే చనిపోతున్నారు. దీనికి కారణం భారత దేశంలో ఆర్థిక వృద్ధి రేటు ఫలితాలు సమానంగా పంపిణీ కాలేదని కూడా సర్వే చెప్తుంది. మన దేశంలో బాలల కోసమే అత్యంత విస్తృత ప్రయోజనాలు గల ఐసిడిఎస్‌ను పెట్టామని, నిధులకు కొరత లేదని పాలకులు చెబుతుంటే, గణాంకాలు ఏం చెబుతున్నాయి? ఆస్పత్రులలో నిధులు, వైద్యులు కొరత, పేదలకు సబ్సిడీలకు కోత, శూన్యమైన ఆహార భద్రత వెరసి 2012 వరకు చూసుకుంటే కార్పొరేట్ సంస్థలు, శాసన సభ్యుల ఆస్తుల విలువ మాత్రం 169% పెరిగింది. ఇదీ బాలల ఆహార, ఆరోగ్య భారతం.

2. **బాలలు - విద్య :** 1వ తరగతి నుండి 5వ తరగతి పూర్తి చేయకుండానే 8 కోట్లమంది బాలలు డ్రాపవుట్లుగా ఉన్నారు. 80 లక్షలమందికి బడి అంటే తెలియదు. ఈ బలహీనతలకు కారణం కేవలం టీచర్లు, పాఠశాల, దండనలు అనుకుంటే పొరపాటే. అమర్త్యసేన్ వంటి ఆర్థిక శాస్త్రవేత్త, ఇతర ఆర్థిక నిపుణులు, వృద్ధిరేట్లు డొల్లతనాన్ని వివరిస్తున్నా పాలకులు విస్మరిస్తున్నారనేది వాస్తవం. ఆహార సమస్య, ఇంటి, ఆదాయ సామాజిక సమస్యలు భారత దేశంలో సామాజిక వర్గాలను పట్టి పీడిస్తుంటే ఆకలి గురించి ఆలోచిస్తాడా? విద్య గురించి ఆలోచిస్తాడా? వారి కుటుంబాల వెనుకబాటుతనం బాలలకు శాపంగా మారింది. ఆ కుటుంబాల ఆర్థిక స్థితి గతులను మెరుగుపరచ లేని పాలకులు ప్రభుత్వ విద్యా వ్యవస్థనే నిందించే స్థితికి వచ్చారు. వారి బిడ్డలను బడికి పంపే యోగ్యత ఉందా? లేదా అని ఏనాడైనా విస్తృత చర్చ జరిపిందా? అనేది పరిశీలించాలి. ఇతర దేశాలైన వెనుజులా, చైనా, క్యూబా, ఫిన్లాండ్, నార్వే, డెన్మార్కు వంటి దేశాలలో బాలల హక్కులు సంపూర్ణంగా అమలు జరుగుతున్నప్పుడు భారత దేశంలో ఎందుకు సాధ్యం కాదు? భారత దేశంలో ఈ పరిస్థితిని జాతీయ అత్యవసర పరిస్థితిగా బాలల నిధి వర్ణించింది. పరిస్థితి మెరుగుదలపై దృష్టి పెట్టాలని ప్రభుత్వానికి, పౌర సమాజానికి విజ్ఞప్తి చేసింది. 13% విద్యార్థులు ప్రాథమికోన్నత స్థాయికి చేరుకోవడం లేదు.



పేద కుటుంబాలకు చేదోడు వాదోడు ఈ బాలలే అనటంలో

అతిశయోక్తి లేదు. కుటుంబాలు వలసలు పోతే, ఆలనాపాలనా లేని వారుగా ఉంటున్నారు. ఒక నియోజక వర్గంలో సగటున 4,300పైబడి కుటుంబాలు వలసల్లో ఉన్నాయి. వారితోపాటు పిల్లలు కూడా వెళ్తున్నారు. దీనితో కుటుంబ వ్యవస్థ చిన్నా భిన్నమైంది. బాలల విద్యకు వలసలు కూడా విఘాతాలుగా మారాయి. బ్రిడ్జి పాఠశాలలు వాస్తవంగా పిల్లలకు అందుబాటులో లేవు.

యాచకులుగా, బాల కార్మికులుగా, వలస బాధితులుగా, నేర గాళ్లుగా బాలలు కన్పిస్తుంటే విద్యాహక్కు చట్టం, బాలల నిధి ఏమైనట్లు అన్పిస్తుంది. చట్టం చేసినంత మాత్రాన అన్నీ సక్రమంగా జరుగుతాయి అనుకోవడం పొరపాటే. చట్టం అమలుకు కావలసిన భౌతిక పరిస్థితులు, చైతన్య స్థాయి పెంచకుండా మీ కోసమే ఈ చట్టాలు చేశాము కదా, అని ఒక మాట అంటే సరిపోదు అనేది గమనించాలి. 2011 నుండి వివిధ నేరాలలో అరెస్టయిన వారిలో 29,444మంది 10వ తరగతి స్థాయి విద్య కూడా లేదు. వీరిలో 6,122మంది చదువుకు దూరంగా ఉన్న వారు. 12,803మంది ప్రాథమిక విద్య పూర్తి చేశారు. ఈ నేరకొమార లెక్కలు చూసి భారతావని సిగ్గుపడాలి? ఎందుకు ఈ పరిస్థితులు దాపురిస్తున్నాయి? అనే చర్చ చేయడం చాలా అవసరం. అంటే మన బాలలు నేరగాళ్లుగా, సంఘ విద్రోహ శక్తులుగా, తీవ్రవాదులుగా మారడానికి దారితీసే పరిణామాల ను గమనించినట్లయితే శిశుజననం నుండి ప్రాథమిక విద్య పూర్తి చేసేంతవరకు పాలకులు సామాజిక బాధ్యతను నెరవేర్చకపోవడమే. 1990 తరువాత వచ్చిన సంస్కరణలు విద్య పూర్తిగా కొనుగోలు వస్తువుగా మార్చినాక నాణ్యమైన, విలువలతో కూడిన విద్య గణనీయంగా దూరం అయింది. దీని ఫలితంగా బాలల్లో కూడా లింగ, కుల, మత, సామాజిక అసమానతలు చోటు చేసుకున్నాయి. ఇవే పౌర సమాజంలో అభివృద్ధికి ఆటంకంగా కూడా వున్నాయి. బాలల విద్యకు ఆటంకంగా ఉండే అసమానతలను తొలగించకుండా సార్వత్రిక అక్షరాస్యత సాధ్యం కాదని పాలకులు గమనించాలి.

3. **నేటి బాలలే రేపటి పౌరులు :** అత్యంత విలువైన మాట. ప్రపంచంలో చాలా పవిత్రంగా భావించే మాట. తల్లి గర్భంలో ఉండగానే ఆ బిడ్డలను మా దేశాలకు అత్యంత శక్తివంతులు వస్తారు, వారిని భూమి మీద పడకముందునుండే అన్ని విధాలుగా ఆరోగ్య వంతులుగా పెంచుతామనే ముందస్తు ప్రణాళికలతో, పథకాలతో సామాజిక బాధ్యతగా స్వీకరించే దేశాలకు సాధ్యమవుతున్నది. మన దేశానికి ఎందుకు సాధ్యం కాదు? శిశు సంక్షేమ విధానాలు, పటిష్ట ప్రాథమిక విద్యా విధానాలు ఉత్తర యూరప్ దేశాలకు మంచి చోదక శక్తిగా ఉన్నాయి. ఫిన్లాండ్ వంటి దేశాల్లో పిల్లల సంక్షేమంలో ప్రపంచ దేశాలకే ఆదర్శంగా ఉన్నారు. అందుకే మాతా శిశు సంరక్షణలో ఫిన్లాండ్ మొదటి స్థానంలో ఉంది.

క్యూబా వంటి దేశంలో విద్య, ఆరోగ్య సంస్థలను పరిశీలించి నట్లయితే అధిక సబ్సిడీ రేట్లకు ఆహారం అందిస్తుంది. ఆకలితో బాధపడే పరిస్థితి ఉండదు. ప్రతి ఒక్కరికి విద్య, ఆరోగ్యం అందుబాటులో ఉ ంటాయి. ప్రతి వెయ్యిందికి 6 నుండి 7గురు వైద్యులు ఉంటారు. ప్రీ ప్రైమరీ నుండి విశ్వ విద్యాలయ స్థాయి వరకు ప్రభుత్వమే ఉచిత విద్యనందిస్తుంది. అత్యంత తక్కువ అసమానతలు ఉన్న సమాజంలో క్యూబా ఒకటి.

చాలా దేశాలలో భూసంస్కరణలు అమలుచేసి, వ్యవసాయ సంస్కరణలు, పారిశ్రామిక విప్లవాలు వంటివి బాలలు, విద్య, ఆరోగ్యం వంటి మంచి మార్పులకు దారితీశాయి. కానీ మన దేశంలో పెట్టుబడులు, డబ్బు,సంపాదనపై కేంద్రీకరణ వంటి వాటిపై యథేచ్ఛగా అనేక పథకాలలో కుంభకోణాలు, ముడుపుల కోసం, ఆస్తులను కాపాడుకోవటం కోసం పాలకులు యిచ్చిన ప్రాధాన్యత బాలల కోసం, వారి చదువుకోసం, వారి హక్కుల కోసం ఏ మాత్రం ఆసక్తి కనబరచకపోవడం గర్హనీయం. ఇదే కొనసాగితే నేటి బాలలే రేపటి పౌరులు అనటంలో అర్థం ఏముంది? పౌర సమాజంలో రేపటి పౌరుల పాత్రను సక్రమమైన మార్గంలో, అభివృద్ధికి చోదకశక్తులుగా తయారు చేయడంలో రాజ్యాంగం చెప్పినమాటకు కార్యాచరణ లేని నాడు బాలలు ఎప్పటికీ అసమానతలతోనే ఉంటారు. పౌరుల శక్తి సామర్థ్యాలను ఉ త్పత్తి క్రమంలో సమర్థవంతంగా వినియోగించుకోన్నన్నాళ్లు అన్నీ స్థాయిలలో అసమానతలు కొనసాగుతూనే ఉంటాయి. ఇది భారత సమాజానికి అంతమంచి పరిణామం కాదని గమనించాలి. "తిండి కలిగితే కండకలదోయ్ - కండ కలవాడేను మనిషోయ్" అన్న మన తెలుగు మహాకవి గురజాడ మాట - పాట అనేక ప్రపంచ దేశాలు అంగీకరిస్తున్నాయి, అనుసరిస్తున్నాయి. కాని మన కవి మాటే మనకు ఆచరణ దూరమైంది. అదే అమలు చేస్తే బాలల్లో అన్నార్తులు, అనాథలు, యాచకులు, నేరగాళ్లు, సంఘ విద్రోహ శక్తులు ఈ సమాజంలో ఉ ండరు. అటువంటి సమాజం కోసం, బాలలకు ఏదీ భారం కాకుండా, భారతావని ముద్దుబిడ్డలుగా ఉండేదాని కోసం పాలకులు ఇకనైనా ఆలోచించడం మంచిది. వినాశకర సంస్కరణలను విడనాడటం మరీ మంచిదని గమనించాలి. దీనికోసం విద్యా వ్యవస్థలోనే మంచి సంస్కరణలకు శ్రీకారం చుట్టాల్సిన అవసరం ఉంది. ప్రతి శిశువుకు మంచి భవితను కోరుకునే హక్కు వుంది. ◐

## విద్యావికాస ఉద్యమం - క్యాంపెయిన్స్ జయప్రదం చేయండి

**- చిత్తూరు జిల్లా కార్యవర్గం పిలుపు**

2013 మే 26న చిత్తూరు జిల్లా కార్యవర్గ సమావేశం తిరుపతి ప్రాంతీయ కార్యాలయంలో జిల్లా అధ్యక్షుడు జి.శ్రీరామమూర్తి అధ్యక్షతన జరిగింది. జిల్లా ప్రధానకార్యదర్శి ఎన్.సోమచంద్రారెడ్డి, రాష్ట్ర కార్యవర్గ సమావేశం యిచ్చిన కర్తవ్యాలను ప్రవేశ పెట్టారు.

రాష్ట్ర ప్రధానకార్యదర్శి ఐ.వెంకటేశ్వరరావు మాట్లాడుతూ రాష్ట్ర మహాసభలు యిచ్చిన స్ఫూర్తితో నాయకులు, కార్యకర్తలు చిత్తూరు జిల్లాలో ఉద్యమాన్ని మరింత ముందుకు తీసుకెళ్ళాలని కోరారు. ప్రభుత్వ పాఠశాలల పరిరక్షణ కోసం మన వంతు కృషి చేస్తూ తల్లిదండ్రులు, స్కూల్ మేనేజిమెంట్ కమిటీలు, ప్రజా సంఘాలను కలుపుకొని ప్రభుత్వంపై వత్తిడి తీసుకురావాలని విజ్ఞప్తి చేశారు. రాష్ట్ర గౌరవాధ్యక్షులు ఎన్.నారాయణ 10వ వేతన సంఘానికి యుటియఫ్ ప్రతిపాదించిన అంశాలను వివరించారు. 2013 డిఎస్‌సి వెంటనే ప్రకటించి జూన్ నెలాఖరులోగా భర్తీ చేయాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. 10వ తరగతి పరీక్షల్లో మంచి ఫలితాలు సాధించిన చిత్తూరు జిల్లా ఉపాధ్యాయ సిబ్బందికి, విద్యార్థులకు అభినందనలు తెలియజేశారు.

# ప్రభుత్వ పాఠశాలల పట్ల ప్రజల్లో విముఖత పెరుగుతుందా!....

# ఎందుకు?



బి.సాయిలు
సంగారెడ్డి, మెదక్ జిల్లా

నూతన ఆర్థిక సంస్కరణలు అమలయ్యినప్పటి నుండి అన్ని మౌలిక రంగాలతోపాటు విద్యారంగంలో కూడా చాలా మార్పులు చోటు చేసుకున్నాయి. దేశంలో ప్రధానంగా రాష్ట్రంలో విద్యారంగం పూర్తిగా రెండుగా చీలిపోయింది. ఒకటి లేని వారిది, రెండవది ఉన్న వారిదిగా. ప్రైవేటు, కార్పొరేట్ సంస్థలు విద్యను లాభసాటి వ్యాపారంగా చేసుకొని రాష్ట్ర విద్యాశాఖలోని అధికారులు- మంత్రులను ప్రసన్నం చేసుకొని అనుమతులు తీసుకొని, కార్పొరేట్ మీడియా సహాయంతో ప్రచారార్భాటం చేసి, ఎక్కువమంది పిల్లల్ని తమ సంస్థలలో చేర్పించుకొనే ప్రయత్నాలను ముమ్మరం చేస్తున్నారు. ఈ కొన్ని సంవత్సరాలుగా కార్పొరేట్ గుత్త పెట్టుబడిదారులు సైతం విద్యారంగాన్నే మంచి మార్కెట్‌గా ఎంచు కోవడం మనం గమనిస్తున్నాం.

అదే విధంగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రభుత్వ విద్యను బలోపేతం చేయడానికని రకరకాల విద్యాభివృద్ధి పథకాలను తీసుకువచ్చి కోట్లాది రూపాయలు ఖర్చు చేయడం జరిగింది. 1993లో వరుసగా నల్లబల్ల పథకం, ఎపెప్, డిపెప్, క్లిప్, క్లాప్, ఎల్ఇపి, ఎస్ఎస్ఏ ద్వారా సిసిఇ వరకు అమలవుతూ వస్తున్నాయి. మరి ఇన్ని రకాల అభివృద్ధి పథకాల అమలుకై, వందల కోట్ల రూపాయలు ఖర్చు కూడా చేసింది ప్రభుత్వ విద్యను బలోపేతం చేయడానికేనని ప్రభుత్వం పదే పదే చెబుతుంది. అయితే తప్పనిసరిగా ప్రభుత్వ బడులలో సౌకర్యాలు మెరుగుపడాలి. విద్యార్థులు పెరగాలి, బోధన విధానంలో ఫలప్రదమైన మార్పులు రావాలి. కాని ఈ మూడు జరగలేదు. కారణం ఏమిటో ఆలోచించాల్సిన అవసరం వుంది. మరో వైపు ఈ చర్యల వల్ల ప్రభుత్వ బడులలో పిల్లల సంఖ్య తగ్గుతూ వస్తున్నది. సౌకర్యాలు కొంతవరకు మెరుగు పడినా, ఇంకా చాలా వరకు అధ్వాన్నంగానే ఉన్నాయి. ఇక బోధన విధానంలో మార్పు చోటు చేసుకుంది. ఉపాధ్యాయుల బోధన సమయం తగ్గి, బోధనేతర పని భారం పెరుగుతూ వస్తున్నది. దీని పర్యవసానంగా పేపరుపైన ఫలితాలు మెరుగ్గా ప్రకటించబడుతున్నా విద్యార్థుల స్థాయి పెరిగినట్టుగాలేదు. ఈ మధ్య కాలంలో ఓ సంస్థ వెల్లడించిన సర్వే ఫలితాలు ఈ పరిస్థితికి అద్దంపడుతున్నాయి. 6,7 తరగతులు చదువుతున్న పిల్లలు 3వ తరగతి లెక్కలు చేయడం, తెలుగు చదవడం సరిగ్గా రావడం లేదని వెల్లడించడం జరిగింది. ఇది ఆలోచించవలసిన రేకెత్తించే అంశం.

ఇక ప్రతి కుటుంబం బడ్జెట్ ప్రణాళికలో విద్య ప్రధానాంశంగా మారింది. ప్రతి తల్లిదండ్రీ ఏది మంచి బడి, ఎలాంటి చదువు తమ పిల్లలకు మంచిది అనే ఆలోచన చేయడం జరుగుతుంది. మరోవైపు తల్లిండ్రులలో ప్రభుత్వ బడులు మంచివికావు. ప్రైవేటు బడులే మంచివి అనే భావన చొప్పించబడింది. దానికి చాలా కారణాలున్నాయి. ప్రధానంగా ప్రభుత్వ - ప్రైవేటు బడులలో ఒకే రకమైన విద్యా ప్రణాళిక పాఠ్య పుస్తకాలు, మూల్యాంకన పద్ధతులు అమలు చేయకపోవడం. ప్రైవేటు విద్యా సంస్థలను వాటి ఇష్టానికి వదిలేసి ప్రభుత్వ పాఠశాలల్లో సంస్కరణలు అమలు చేయడం జరుగుతుంది. వాటిలో మనం కొన్ని ముఖ్యమైన అంశాలను గమనించాలి. మంచి వుస్తకాలు ఆకర్షణీయంగా రూపొందించి నప్పటికి పాత విధానమే కొనసాగింది. కాని శాస్త్రీయ దృక్పథం కొరవడింది. మారిన క్రొత్త పుస్తకాలలో సిలబస్ పెరిగింది, మూల్యాంకన పద్ధతిలో సిసిఇతో గ్రేడింగ్ ఇవ్వడం వల్ల ఉపాధ్యాయులకు పని భారం పెరిగింది. విద్యార్థుల సామర్థ్యాలను ఖచ్చితంగా అంచనా వేయలేక అసంబద్ధంగా కొనసాగుతున్నది. వీటి పర్యవసానంగా చాలామంది పిల్లలు మన బడికి దూరం అవుతున్నారు.

ఉదయం పిల్లల్ని పాఠశాలకు పంపి పనికి వెళ్ళిన తల్లిదండ్రులు తిరిగి సాయం కాలానికి ఇంటికి చేరుకున్న తరువాత వారి పిల్లలు బయట తిరగడం ఆడుకోవడం చూస్తున్నారు. అదే సమయంలో ప్రక్కింటి పిల్లలు ప్రైవేటు బడిలో చదువుతూ పాఠశాల ముగిసిన తరువాత బయట తిరగకుండా ఇంట్లో బుద్ధిగా కూర్చొని హోంవర్క్ చేసుకుంటుండడం చూసి, ప్రైవేటు బడిలో బాగా చెప్పడం వల్ల ఆ పిల్లలు ఇంటివద్ద కూడా బాగా చదువుతున్నారు. మా పిల్లలు మాత్రం బయట తిరుగుతున్నారనుకొని ప్రభుత్వ బడిపట్ల విముఖత ఏర్పర్చుకుంటున్నారు. ఇది ప్రధానంగా ప్రైమరీ పాఠశాలల్లోని విషయం. ప్రభుత్వ బడులలోని నిబంధనల ప్రకారం పిల్లలకు ఇంటిపని యివ్వాల్సిన అవసరం లేదు. వారికి ఆట పాటలతో చదువు తమంతట తాము నేర్చుకునేలా టీచర్ వారిని ప్రోత్సహించాలి కాని సాంప్రదాయక మైన వల్లెవేయడాలు, ఎక్కాలు చదివించడాలు చేయరాదు. దండించడం, భయానికి గురిచేయడం తప్పు, పైగా నేరం. ఇవన్నీ మనో విజ్ఞానవేత్తలు, విద్యారంగ నిపుణులు చెబుతున్నవి. ఇవి మంచివి, వాస్తవాలు అయినప్పటికి చాలామంది తల్లిదండ్రులకు పట్టని విషయాలు (అర్థంకానివి). ఈ విధానాల వల్ల ప్రజలకు, తల్లిదండ్రులకు ప్రభుత్వ బడులపట్ల ఆనాసక్తి పెరుగుతుంది. దానికి తోడు ఉపాధ్యాయులు ఏం బోధించకుండా కాలక్షేపం చేసి వేలకు వేలు జీతాలు తీసుకుంటున్నా రనే ఆగ్రహం కూడా పెరుగుతున్నది. అదే సమయంలో మారుతున్న కాలానికి అనుగుణంగా మార్పులేకుండా, మార్కులే ప్రధానంగా, సంప్రదాయ బోధనా పద్ధతులు అమలు పరుస్తున్న ప్రైవేటు బడులపైన మోజు పెరుగుతుంది. దీనికి కారణం ప్రభుత్వం తీసుకు వస్తున్న మూల్యాంకనంలోని మార్పులు ప్రభుత్వ, ప్రైవేటు బడులకు ఒకే రకంగా లేకపోవడం.

ఈ మూల్యాంకనంలో వచ్చిన సిసిఇ విధానం రెండు బడులలో సమానంగా అమలైనట్లైతే ప్రభుత్వ బడులపై ప్రజల్లో అయిష్టత ఇంత ఎక్కువగా ఉండి, ఉండకపోయేది. ఇది ఒక కారణం. ఈ అయిష్టతకు మరికొన్ని కారణాలున్నాయి.

అవి : 1) ప్రీప్రైమరీ బడి ప్రాథమిక పాఠశాలకు అనుసంధానమై లేకపోవడం. (2) ఇంగ్లీషు మీడియం లేకపోవడం (3) ఒకరిద్దరే టీచర్లుండి 5 తరగతులు బోధించాల్సి రావడం (4) తరగతులకు

సరిపడా తరగతి గదులు లేకపోవడం, మౌలిక వసతులు లేకపోవడం (5) బోధనేతర పని భారం వల్ల, కొందరు టీచర్ల ఆలసత్వం వల్ల ఎక్కువ సమయం బోధనకు కేటాయించకపోవడం.

ఇలాంటి కారణాలవల్ల ప్రభుత్వ బడులపైన ప్రజలకు, తల్లిదండ్రుల కు అయిష్టత పెరుగుతుంది. దానితోపాటు మారుతున్న విలువలకు అనుగుణంగా ఉచిత విద్యకన్నా డబ్బులు ఎంత ఎక్కువ వెచ్చిస్తే అంత మంచి చదువు వస్తుందని నమ్మే వినియోగదారీతత్వం. సరళీకృత ఆర్థిక విధానాల వల్ల ప్రజల మదిలో చొప్పించబడడం వీటన్నింటిని ప్రభుత్వమే ఒక పథకం ప్రకారం అమలుపరిచే ప్రయత్నంలో ఉందనడంలో ఎలాంటి సందేహం లేదు. వీటికి తోడు బడులలో బోధనేతర సిబ్బంది లేక పిల్లలతో గదులు శుభ్రం చేయించడం, బెల్లు కొట్టించడం మొదలైనవి తల్లిదండ్రులకు నచ్చడం లేదు. గ్రామాలలోని ప్రజలకు, తల్లిదండ్రులకు పాఠశాల మనది అనే భావన రాకపోవడం, ఎస్ఎంసి సభ్యులు బడులను మెరుగుపరచాలనే బాధ్యత తీసుకోకుండా, బడిని అసలే పట్టించుకోకపోవడం జరుగుతుంది. ఎందువల్లనంటే వారు నిత్యం తమతమ పనులలో తీరిక లేకుండా తమ సమస్యల్లో సతమతమవుతూ ఉండడం. గ్రామాల్లోని ఉన్నత వర్గం వారు తమ పిల్లల్ని ప్రైవేటు కాన్వెంట్‌లకు పంపుతున్నారు గనక గ్రామంలో వున్న సర్కారు బడి మనది కాదు అనే ధోరణిలో ఉన్నారు.

ఇక ప్రభుత్వం ప్రహసనంగా తీసుకొని తెచ్చిన విద్యాహక్కు చట్టం ప్రకారం అన్ని పాఠశాలల్లో మౌలిక వసతులు కల్పించాల్సి వుండగా ఏప్రిల్ 2010 నుండి ఏప్రిల్ 2013 వరకు 3 సం॥లు గడిచిపోయినా ఇంకా పూర్తి స్థాయిలో కల్పించబడలేదు. చట్టం ప్రకారం విద్యార్థులకు ఉచిత పాఠ్య పుస్తకాలు, దుస్తులతో పాటు ఉచిత నోటు పుస్తకాలు, పెన్నులు, బ్యాగు, జత చెప్పులు, హాస్టల్ విద్యార్థులకు దోమ తెరలు, దుప్పట్లు ఇవ్వాల్సి వుంది. కాని ఈ 3 సం॥లలో అవి అందలేదు. మరియు గతంలో మూతబడిన పాఠశాలల్లో చదివిన పిల్లలకు ప్రక్కనున్న పాఠశాలలకు పంపుటకు రవాణా చార్జీలు చెల్లిస్తామన్న ప్రభుత్వం ఇప్పటి వరకు ఎక్కడకూడా చెల్లించిన పరిస్థితిలేదు. చట్టం అమలు చేస్తున్నామన్న పేరుతో జిఓ 55 ప్రకారం రేషనలైజేషన్ నిర్వహించి 10మందికన్నా తక్కువ పిల్లలున్నారన్న నెపంతో గత సంవత్సరం వరకు 6వేల పాఠశాలలు, ఈ సంవత్సరం ఇంకా 1284 పాఠశాలల్ని మూత వేయడానికి పూనుకుంది. నిజానికి ఇంటి ప్రక్కనే పాఠశాల వున్నా బడికిరాని పరిస్థితి దళిత, గిరిజన వాడల్లోని పిల్లలకుంది. దానికి కారణం వారి ఆర్థిక పరిస్థితులు, చిన్న తమ్ముడ్ని, చెల్లెల్ని పట్టుకోవాల్సిన బాధ్యత. అలాంటిది 10మందికన్నా తక్కువ వున్నారని ఆ బడిని మూసివేస్తే ఆ 9 లేదా 8 మంది పిల్లలకు ఉచిత విద్యను అందించాల్సిన బాధ్యత నుండి ప్రభుత్వం చట్టబద్ధంగా తప్పుకుంటుందన్న మాట.

ఆర్‌టిఇ చట్టం రూపొందించడంలో కూడా ఒక తప్పు జరిగింది. దాని ద్వారా ప్రభుత్వం 0-6 సం॥ల లోపు పిల్లల్ని చట్టం నుండి మినహాయించింది. నిజానికి రాజ్యాంగంలోని ఆర్టికల్ 14 ప్రకారం 0-14 సం॥లోపు పిల్లలందరికీ ఉచిత నిర్బంధ విద్యను ప్రభుత్వమే అందించాలని ఆదేశిక సూత్రాలు నిర్దేశించినా దాన్ని ప్రాథమిక హక్కుగా చట్టం రూపంలోనికి తీసుకొనివచ్చే క్రమంలో 0-6 సం॥ల పిల్లల్ని వదిలేసి 6-14 సం॥ల లోపు పిల్లలను మాత్రమే చట్ట పరిధిలోకి తీసుకురావడం జరిగింది. అయినా చట్టం అమలు సరిగ్గాకాక పోవడానికి కారణం ప్రభుత్వం తన యాజమాన్యంలోని బడులన్నింటికి మంగళం పాడాలనే యోచనవల్లనే అనేది స్పష్టం.

వరదలు కవితల పోటీల్లో తృతీయ బహుమతి పొందిన కవిత

## మనుగడ ప్రశ్నార్థకమైన వేళ



దర్పం, ధైర్యం కన్నీళ్ళే
ముంచెత్తడమంటే యిదేనేమో?!
చల్లగా ప్రేమతో పలకరించాల్సిన వరుణుడు
నిప్పుల వర్షంతో ఆగ్రహజ్వాలలు కురిపిస్తే?!
ఆప్యాయంగా అక్కున చేర్చుకోవాల్సిన నదీమ తల్లులు
ఉగ్రరూపిణులై వరద బీభత్సం సృష్టిస్తే?!
జలగోడుని ఎవరి దగ్గర ఏకరువు పెట్టగలం?!
ఎటు చూసినా నీళ్ళు కన్నీళ్ళే ప్రవహిస్తూ వుంటే
పచ్చని జీవితాలన్నీ కాగితపు పడవలై
కనిపించనంత దూరం కొట్టుకుపోయాయి
పల్లెలో వల్లకాడు ఒక భాగమై వుంటుందని
అందరికీ తెలిసిన నగ్నసత్యం
పల్లెలకు పల్లెలే వల్లకాడై, శవాల గుట్టలుగా దర్శనమివ్వడం
కొందరికే తెలిసిన జలసత్యం
చేతికొచ్చిన వరి, కాపుకొచ్చిన మామిడి
జలవిలయంలో ఆనవాళ్ళు లేకుండా అదృశ్యమయ్యాయి
ఆ దారుణ జలగండ దృశ్యం
రైతన్నల పాలిట పెనుశాపం
కన్నీటి సంద్రమైన హృదయ విలాపం
జలప్రళయానికి విద్యుత్ ప్రాజెక్టులు నీటమునిగి
వంతెనలు కొట్టుకుపోయి
ఎదకోతల తీరని నష్టంతో
మనుగడ ప్రశ్నార్థకమైన వేళ
మదిమదిలో మానవత్వం వెల్లివిరియాలి
పాలకులను, ప్రభుత్వాలనూ నిందిస్తూ
వృథాకాలయాపన చేయకుండా
అందరం కలసి ఐక్యంగా కదిలి
అన్నార్తులను, ఆపన్నులను ఆదుకుందాం
ఆప్యాయతానురాగాలతో అండగా నిలబడదాం
పచ్చదనాల పర్యావరణాన్ని పరిరక్షిద్దాం

ఇలా పలు అంశాల కారణంగా ప్రభుత్వ పాఠశాలలకు ఏర్పడిన దుస్థితికి ప్రభుత్వ విధానపరమైన తప్పిదమే కారణం. కాని ప్రభుత్వం మాత్రం తన తప్పిదాన్ని కప్పిపుచ్చుకోవడానికి ఈ నెపాన్ని ఉపాధ్యాయులపైన, అధికారులపైన, తల్లిదండ్రులపైన నెట్టివేసే ప్రయత్నం చేస్తున్నది. అందుకని ప్రభుత్వ ఆలోచనా విధానంలో మార్పురావాల్సిన అవసరం వుంది. అలాంటి మార్పు రావడానికి ఉపాధ్యాయులు గ్రామాల నుండి తల్లి దండ్రులను, ప్రజలను, ఎస్ఎంసి సభ్యులను, వివిధ అభివృద్ధి కాముక సంఘాలను కలుపుకొని ఒక విస్తృత సంయుక్త కార్యాచరణతో ప్రభుత్వ విద్యా రంగ పరిరక్షణకు నడుంబిగించాలి. ప్రభుత్వ విద్యా రంగాన్ని కాపాడు కోవాలి. మంచి విలువలుగల సమాజ నిర్మాణానికి బాటలు వేయాలి. ఆ దిశగా ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ (యుటియఫ్) ఈ13వ రాష్ట్ర మహాసభల్లో నిర్ణయం తీసుకొని, ఎస్ఎంసి సభ్యులు, వివిధ సంఘాల సభ్యులతో కలిసి ఉపాధ్యాయులు విద్యావికాస వేదికలను ఏర్పాటుచేసి ఈ రాబోయే మాసంలో రాష్ట్ర వ్యాప్తంగా విస్తృతస్థాయి ఉద్యమానికి సిద్ధమైంది. దీనికి ఉపాధ్యాయులందరూ ముందుకు రావాలి.

# రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్

## మహబూబ్‌నగర్‌లో

యుటియఫ్ మహబూబ్‌నగర్ జిల్లా శాఖ ఆధ్వర్యంలో మే 30న "పాఠశాల విద్య - సమస్యలు - ప్రభుత్వ పాఠశాలల పరిరక్షణ" అనే అంశంపై ఉపాధ్యాయ, విద్యార్థి, ప్రజాసంఘాలతో రౌండ్‌టేబుల్ సమావేశం నిర్వహించారు. ఈ సమావేశానికి ముఖ్య అతిథిగా ఆర్‌జెడి మస్తానయ్య హాజరై మాట్లాడుతూ ఉపాధ్యాయ సంఘాలు సరైన సమయంలో సరైన కార్యక్రమాన్ని తీసుకోవడం అభినందనీయం అన్నారు. యుటియఫ్ చొరవను ప్రత్యేకంగా ప్రశంసించారు. ప్రభుత్వ పాఠశాలల్లో మధ్యాహ్న భోజనం, పాఠ్య పుస్తకాలు, 2 జతల దుస్తులతోపాటు ఉచిత విద్య అందిస్తున్నాము. విశాలమైన ఆటస్థలాలు, బిల్డింగ్‌లు ఉన్నాయి. ఈ సంవత్సరం 10వ తరగతినందు ప్రైవేటుకు దీటుగా ఫలితాలు సాధించాము. మనం సరైన ప్రచారం నిర్వహిస్తే మన పాఠశాలల్లోకి పిల్లలు వస్తారని అన్నారు.

జిల్లా అధ్యక్షులు కె.జంగయ్య అధ్యక్షతన జరిగిన ఈ సమావేశంలో జిల్లా ప్రధానకార్యదర్శి ఎం.వెంకటప్ప చర్చా పత్రాన్ని ప్రవేశపెడుతూ రాష్ట్రంలో 12,42,740మంది, జిల్లాలో 14వేలమందికి పైగా బడిబయట ఉన్నారని, క్రమబద్ధీకరణ పేరుతో ఉపాధ్యాయ పోస్టులను రద్దు చేస్తూ ప్రతి సంవత్సరం వెయ్యికి పైగా పాఠశాలలు మూసివేస్తున్నారు. ఈ సంవత్సరం మన జిల్లాలో 122 పాఠశాలలు మూసివేస్తున్నారని అన్నారు. జిహెచ్ఎం సంఘం జిల్లా అధ్యక్షులు మురళీకృష్ణ, కె.వి.పి.ఎస్. జిల్లా అధ్యక్షులు కుర్మయ్య, ఆపస్ ప్రధానకార్యదర్శి హన్మంతరావు, టిపిఆర్‌టియు జిల్లా అధ్యక్షులు బాల్‌రెడ్డి తదితరులు మారి అభిప్రాయాలు తెలిపారు.

రాష్ట్ర కార్యదర్శి ఎన్.కిష్టయ్య మాట్లాడుతూ రానున్న ఎన్నికలలో ప్రతి రాజకీయ పార్టీ ఎజెండాలోకి ప్రభుత్వ విద్య పరిరక్షణ అనే అంశాన్ని చేర్చాలని అటువంటి పార్టీలకే ఉపాధ్యాయ, ప్రజల మద్దతు ఉండాలని అన్నారు. ఈ కార్యక్రమంలో ఎస్‌టిఎఫ్ నాయకులు ఇబ్రహీం, బిటిఏ నాయకులు చెన్నయ్య, టిడబ్ల్యుటిఎఫ్ నాయకురాలు అరుణమ్మ, రిటైర్డ్ ఎంప్లాయీస్ నాయకులు కె.రామదాసుతోపాటు ఎస్ఎఫ్ఐ నాయకులు ప్రభాకర్, యుటియఫ్ జిల్లా నాయకులు శర్మ, శంకరయ్య, ఖాదరయ్య, అజయ్, వేణుగోపాల్, కళ్యాణం, శ్రీనివాస్‌లు పాల్గొన్నారు.

## నల్లగొండలో

యుటియఫ్ నల్లగొండ జిల్లా శాఖ ఆధ్వర్యంలో మే 28న యుటియఫ్ జిల్లా కార్యాలయంనందు రౌండుటేబుల్ సమావేశము ఎం.రాజశేఖర్ రెడ్డి అధ్యక్షతన జరిగింది. యుటియఫ్ రాష్ట్ర అధ్యక్షులు ఎ.నర్సిరెడ్డి ముఖ్య అతిథిగా హాజరై మాట్లాడుతూ ప్రభుత్వ విద్యారంగ రక్షణకు ప్రతి ఒక్కరు కృషి చేయాలని, పాఠశాలలు ప్రారంభించే నాటికి పాఠ్య పుస్తకాలు, దుస్తులు, అభ్యసన సామాగ్రి అందించాలని, సక్సెస్ ఉన్నత పాఠశాలల్లో ఇంగ్లీషు మీడియం తరగతుల బోధనకు 7 సబ్జెక్ట్ పోస్టులు ప్రత్యేకంగా భర్తీ చేయాలని, పర్యవేక్షణాధికారుల పోస్టులు(ఎంఇఓ, డిప్యూటిఇఓ) వెంటనే భర్తీ చేయాలని, పాఠశాలల్లో నూతన వసతులు కల్పించాలని, 2013 డిఎస్‌సి ప్రకటించి ఖాళీలను వెంటనే భర్తీ చేయానలి డిమాండ్ చేశారు. విద్యను రాజకీయ ఎజెండాలో చేర్చాలని అన్ని రాజకీయ పక్షాలకు సూచించారు.

యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శి సిహెచ్.రాములు మాట్లాడుతూ విద్యా హక్కు చట్టాన్ని పటిష్టంగా అమలు చేయాలని, మధ్యాహ్న భోజనము నాణ్యంగా పెట్టాలంటే ఒక్కొక్క విద్యార్థికి 10 రూపాయలు యివ్వాలని, నాణ్యమైన బియ్యాన్ని అందించాలని, పాఠశాలల్లో స్వీపర్, అటెండర్, వాచ్‌మెన్ పోస్టులను భర్తీ చేయాలని అన్నారు.

సమావేశములో సిఐటియు జిల్లా అధ్యక్షులు టి.గోపి, డిటిఎఫ్ జిల్లా ప్రధానకార్యదర్శి ఎం.సోమయ్య, కె.వి.పి.ఎస్. నాయకులు ఎం. సర్వయ్య, ఎస్ఎఫ్ఐ జిల్లా ప్రధానకార్యదర్శి కె.రమేష్, జె.వి.వి. జిల్లా ప్రధానకార్యదర్శి వి.జగదీష్‌బాబు, యుటియఫ్ జిల్లా సహాధ్యక్షులు పి.లక్పతినాయక్, జి.ఉషాదేవి, జిల్లా కోశాధికారి వై.సైదులు, జిల్లా కార్యదర్శులు పి.వెంకటేశం, సిహెచ్.రామలింగయ్య, శ్రీనివాసాచారి, ఎం.యాదయ్య, పి.తిరుమలయ్య, సిహెచ్.సైదులు, పోలె వెంకటయ్య, రాజశేఖర్ పాల్గొన్నారు.

## రంగారెడ్డి జిల్లా వికారాబాద్‌లో

ప్రభుత్వ పాఠశాలల్లో మౌలిక వసతుల కల్పనకు ప్రభుత్వం బాధ్యత వహించాలని, విద్యా ప్రమాణాలకు ఉపాధ్యాయులు బాధ్యత వహిస్తారని యుటియఫ్ రంగారెడ్డి జిల్లా అధ్యక్షుడు పి.మాణిక్‌రెడ్డి అన్నారు. ఉపాధ్యాయ, విద్యార్థి, ప్రజాసంఘాల ఆధ్వర్యంలో వికారాబాద్ పట్టణంలోని రవీంద్ర మండపంలో "ప్రభుత్వ పాఠశాలల స్థితిగతులు బలోపేతం" అనే అంశంపై నిర్వహించిన రౌండ్‌టేబుల్ సమావేశంలో ఆయన మాట్లాడారు. ఉపాధ్యాయులు బాధ్యతాయుతంగా పని చేశారనడానికి పది ఫలితాలే నిదర్శనమేనన్నారు. ఎంవిఎఫ్ ఆర్గనైజర్ శ్రీనివాస్ మాట్లాడుతూ విద్యాహక్కు చట్టాన్ని ఆటక ఎక్కించాలని చూస్తున్న ప్రభుత్వ తీరు మారాలన్నారు. విద్యాహక్కు చట్టంపై విద్యార్థుల తల్లిదండ్రులకు అవగాహన కల్పించేందుకు చర్యలు తీసుకోవడం లేదన్నారు. సిఐటియు జిల్లా కార్యదర్శి మల్లేష్ మాట్లాడుతూ, మధ్యాహ్న భోజనం, దుస్తుల పంపిణీ సకాలంలో చేయాలని డిమాండ్ చేశారు. ఎస్ఎఫ్ఐ మహిళా విభాగం జిల్లా కన్వీనర్ గీత, ఎంవిఎఫ్ మండల ఇన్‌చార్జి వెంటకయ్య, కె.వి.పి.ఎస్. జిల్లా ప్రధానకార్యదర్శి వై.మహేందర్ తదితరులు పాల్గొన్నారు.

### యలమంచిలిలో టాలెంట్ టెస్ట్ బహుమతి ప్రధానం

ప||గో|| జిల్లా యలమంచిలి మండల శాఖ ఆధ్వర్యంలో 17వ ప్రతిభా పాటవ పరీక్షల బహుమతి ప్రదానోత్సవ సభ ఏప్రిల్ 8న జిల్లా ప్రజా పరిషత్ ఉన్నత పాఠశాల, గుంపర్రు నందు అత్యంత వైభవంగా జరిగింది. 5,10వ తరగతుల టాలెంట్ పరీక్షల్లో విజేతలుగా నిలిచిన విద్యార్థిని, విద్యార్థులకు నగదు, జ్ఞాపికలను అందజేశారు. ఈ కార్యక్రమానికి జిల్లా యుటియఫ్ ప్రధాన కార్యదర్శి, షేక్ సాబ్జీ అధ్యక్షత వహించారు. స్థానిక శాసనసభ్యులు బంగారు ఉషారాణి మాట్లాడుతూ మండల శాఖను అభినందించారు. రాష్ట్ర అధ్యక్షులు నాగటి నారాయణ హాజరై మాట్లాడుతూ గత 17సంవత్సరాలుగా నిర్విరామంగా ఈ టాలెంట్ పరీక్షలు నిర్వహించడాన్ని అభినందించారు. మండల ప్రధాన కార్యదర్శి మంచెం వెంకటేశ్వరరావు టాలెంట్ టెస్టు రిపోర్ట్‌ను ప్రవేశపెట్టారు. విజేతలైన విద్యార్థులకు, ఉపాధ్యాయులకు, ఆహ్వానితులకు ఊటుకూరి గంగాధరరావు, కుందుళం విజయసారధి, అంతర్వేది పద్మనాభకుమార్, కోటిపల్లి హాల్‌నందు బ్యాగులు, మెమోంటోలు బహుకరించారు. ఈ కార్యక్రమంలో రాష్ట్ర గౌరవాధ్యక్షులు చెరుకూరి సుభాష్ చంద్రబోస్, ఎస్‌టిఓ జి.గోపాలరావు, స్పెషలాఫీసర్ పి.మురళీకృష్ణ, ఎం.ఇ.ఓ. ఎమ్.రంగరాజు డి.సుధాకర్, బి.మాణిక్యాలరావు, ఎస్.కేఫీషా, పి.సత్యనారాయణ, కె.సాయికుమారి మొదలైన వారు పాల్గొన్నారు.

# మే డే ఉత్సవాలు

## భీమవరంలో

ప్రపంచ కార్మిక దినోత్సవం సందర్భంగా భీమవరం యుటియఫ్ ప్రాంతీయ కార్యాలయంలో మే డే ఘనంగా నిర్వహించారు. యుటియఫ్ సీనియర్ నాయకులు బి.డేవిడ్‌రాజు యుటియఫ్ పతాకాన్ని ఆవిష్కరించారు. యుటియఫ్ జిల్లా కార్యదర్శి బి.గోపీమూర్తి మాట్లాడుతూ అమెరికాలోని చికాగో నగరంలో 8గంటల పని కొరకు జరిగిన పోరాటాన్ని అణచి వేయడానికి పోలీసులు జరిపిన కాల్పులకు కార్మికుని రక్తంతో తడిసిన చొక్కా ఎర్రజెండాగా రూపుదాల్చిందని అన్నారు. భవిష్యత్‌లో ఐక్య ఉద్యమాలలో పెద్దఎత్తున పాల్గొనాలని ఉపాధ్యాయులకు పిలుపునిచ్చారు. యుటియఫ్ జిల్లా కార్యదర్శి ఎం.ఐ.విజయ్‌కుమార్, జిల్లా ఆడిట్ కమిటీ కన్వీనర్ పి.శ్రీనివాసరాజు, భీమవరం రూరల్ మండల ప్రధాన కార్యదర్శి సిహెచ్.పట్టాభిరామయ్య, పాలకోడేరు మండల అధ్యక్షులు పి.ఎన్.విజయరామరాజు, గౌ॥అధ్యక్షులు ఎన్.బి.రాజేంద్రప్రసాద్, కాళ్ళ మండల అధ్యక్ష ప్రధాన కార్యదర్శులు కె.సత్యనారాయణ, బి.వి.రమణ, ఉండి ప్రధాన కార్యదర్శి డేవిడ్‌రాజు ఆకివీడు మండల ప్రధాన కార్యదర్శి శ్రీ అప్పల నాయుడు తదితరులతోపాటు 50 మంది టీచర్లు పాల్గొన్నారు.

## మామిడికుదురులో



తూ॥గో॥జిల్లా మామిడికుదురులో 'మేడే ఉత్సవాన్ని తహశీల్దారు కార్యాలయము వద్ద యుటియఫ్, రెవెన్యూ, అంగన్‌వాడీ, ఆశ వర్కర్లు, బ్యాంకు సిబ్బంది ఆధ్వర్యంలో ఘనంగా నిర్వహించారు. మేడే పతాకాన్ని సీనియర్ ఉపాధ్యాయుడు నన్నీసా హుస్సేన్ ఆవిష్కరించారు. ఈ కార్యక్రమంలో మండల శాఖ అధ్యక్ష కార్యదర్శులు యెరుబండి నాగేశ్వరరావు, కె.సత్యనారాయణ, నయినాల బాబులు, అంగన్‌వాడీ ఆశ వర్కర్లు అధిక సంఖ్యలో, ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

## అనంతరపురంలో

అనంతపురంలో యుటియఫ్ జిల్లా కార్యాలయంలో మేడే ఘనంగా జరిపారు. ఈ సందర్భంగా యుటియఫ్ జిల్లా గౌ॥ ఎస్.మహమ్మద్ జిలాన్ యుటియఫ్ పతాకాన్ని ఎగురవేశారు. జిలాన్ మాట్లాడుతూ కార్మికులు ఎనిమిది గంటలు పనిదినం కోసం పోరాడి చనిపోయిన అమరవీరులకు నివాళులర్పించే రోజే మేడే అని అన్నారు. రాష్ట్ర కార్యవర్గ సభ్యులు సి.కె.నాగేంద్రబాబు, జిల్లా అధ్యక్షులు కె.నాగేంద్ర, ప్రధాన కార్యదర్శి ఎస్.విజయ భాస్కర్‌లు మాట్లాడుతూ పెట్టుబడిదారీ విధానపు తొలిదశలో పనిగంటలకు పరిమితులు లేవన్నారు. అనేక ఉద్యమాల ఫలితంగానే కార్మికులకు రోజుకు 8గం॥ల పనిదినం సాధించుకోవడం జరిగిందన్నారు.

ఉపాధ్యాయ సమస్యల సాధన కోసం ప్రతి ఉపాధ్యాయుడు సైనికుడిలా పని చేయాలని పిలుపునిచ్చారు. ఈ కార్యక్రమంలో జిల్లా కార్యదర్శి వి.కోటేశ్వరప్ప, ఆడిట్ కమిటి కన్వీనర్ వై.సాయినాథ్ బాబు, మండల నాయకులు అనంతపురం రామకృష్ణ, జనార్ధన్, కూడేరు గోవిందు, గార్లదిన్నె శేషప్ప, పామిడి సురేష్, పెద్దవడుగూరు ఆహోబిలేసు, కనగానపల్లి జిలాన్ ఖాన్, నార్పల తదితరులు పాల్గొన్నారు.

## ఖమ్మంలో

ఉపాధ్యాయుల, విద్యారంగ సమస్యల పరిష్కారానికి పోరాటాలే శరణ్యమనీ, చరిత్రలో కార్మికవర్గం పోరాటాల ద్వారానే మెరుగైన సౌకర్యాలు సాధించుకున్నారనీ, దానికి గుర్తుగానే 'మేడే' జరుపుకుంటున్నారని యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శులు బి.నరసింహారావు, సిహెచ్.దుర్గాభవాని తెలిపారు. యుటియఫ్ కార్యాలయంలో మేడే సందర్భంగా వారు మాట్లాడారు. తొలుత ఉద్యమ పతాకాన్ని దుర్గాభవాని ఆవిష్కరించారు. యుటియఫ్ జిల్లా అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు జి.రాజశేఖర్, ఆర్.విక్రమ్‌రెడ్డి సందేశాలు ఇచ్చారు. కార్యక్రమంలో యుటియఫ్ జిల్లా నాయకులు ఎన్.వీరబాబు, ఎ.రమాదేవి, ఎం.నరసింహారావు, ఎస్.కె.ఉద్దండు, షరీఫ్, ప్రజానాట్యమండలి నాయకులు దేవేంద్ర, శ్రామిక మహిళా జిల్లా కన్వీనర్ పి.ఝాన్సీ తదితరులు పాల్గొన్నారు.

## మచిలీపట్నంలో



ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ (యుటియఫ్) కృష్ణా జిల్లా శాఖ ఆధ్వర్యంలో "మేడే" సందర్భముగా మచిలీపట్నంలోని యుటియఫ్ కార్యాలయంలో గ్రాడ్యుయేట్ ఎంఎల్సీ బొడ్డు నాగేశ్వరరావు యుటియఫ్ పతాకాన్ని ఆవిష్కరించారు.

ఈ కార్యక్రమానికి యుటియఫ్ జిల్లా శాఖ ప్రధాన కార్యదర్శి కె.ఎ.ఉమామహేశ్వరరావు అధ్యక్షత వహించారు. యుటియఫ్ పతాక గేయాన్ని కె.విక్టర్‌కుమార్ ఆలపించారు. ఆ తదుపరి కార్యకర్తలను ఉద్దేశించి యుటియఫ్ సీనియర్ నాయకులు పి.వెంకటేశ్వరరావు మాట్లాడుతూ మేడే ప్రాముఖ్యతను గురించి వివరించినారు. ఎమ్మెల్సీ బొడ్డు

నాగేశ్వరరావు మాట్లాడుతూ 1884 నుండి అమెరికాలోని చికాగో కార్మికుల శ్రమను ప్రభుత్వం దోచుకుంటుంది. అనాడు జరిగిన పోరాటంలో అనేక మంది కార్మికులు అమరులైనారు. వారి రక్తంతో తడిసిన ఎర్రచొక్కానే మేడే జెండాగా ఆవిష్కరించడం జరిగిందని అన్నారు. ఈ కార్యక్రమంలో జిల్లా కార్యదర్శులు కె.లెనిన్‌బాబు, కె.ఎల్.వి.ఎన్.వి.ప్రసాద్, ఆడిట్ కమిటీ మెంబర్ పి.శ్రీనివాసమూర్తి తదితరులు పాల్గొన్నారు.

## నల్లగొండలో

మేడే సందర్భంగా యుటియఫ్ నల్లగొండ జిల్లా కార్యాలయంలో యుటియఫ్ సీనియర్ నాయకులు పి.విద్యాసాగర్‌రెడ్డి ఉద్యమ పతాకాన్ని ఆవిష్కరించారు. అనంతరం నిర్వహించిన సమావేశంలో యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శి సిహెచ్.రాములు మాట్లాడుతూ మేడే స్ఫూర్తితో కార్మికులంతా ఏకమై దోపిడీ వ్యవస్థ నిర్మూలనకు నడుంబిగించి సమసమాజ స్థాపనకోసం కృషి చేయాలని కోరారు. ఈ కార్యక్రమంలో యుటియఫ్ జిల్లా అధ్యక్షులు ఎం.రాజశేఖర్ రెడ్డి, కోశాధికారి ఎడ్ల సైదులు జిల్లా కార్యదర్శులు ఎం.మురళయ్య, పెరుమాళ్ళ వెంకటేశం, ఎన్.సరళ, సిహెచ్.రామలింగయ్య, జెవివి జిల్లా ప్రధాన కార్యదర్శి వి.జగదీష్‌బాబు, మండల బాధ్యులు సి.సుధాకర్, సిహెచ్.లక్ష్మీనారాయణ, నర్రా శేఖర్‌రెడ్డి, బిక్షమయ్య, ఐ.వెంకటేశ్వర్లు, ఆర్.నాగయ్య ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

## హైదరాబాద్‌లో



ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ (యుటియఫ్) రాష్ట్ర కార్యాలయంలో హైదరాబాద్ జిల్లా శాఖ ఆధ్వర్యంలో నిర్వహించిన మే డే కార్యక్రమంలో యుటియఫ్ రాష్ట్ర గౌరవాధ్యక్షులు ఎన్.నారాయణ ఉద్యమ పతాకాన్ని ఆవిష్కరించారు. అనంతరం జరిగిన సమావేశానికి జిల్లా అధ్యక్షులు ఎస్.వై.కొండలరావు అధ్యక్షత వహించగా నారాయణ మాట్లాడుతూ ఆనాడు అమెరికాలోని చికాగోలో ప్రారంభమైన పని గంటలు తగ్గింపు పోరాటంతో ప్రపంచంలోని అనేక దేశాల్లో ఉద్యమాలు జరిగాయి. అనేకమంది కార్మికుల రక్తంతో, త్యాగాలతో సాధించిన హక్కులను నేటి ప్రభుత్వాలు ఒక్కొక్కటిగా కాలరాస్తూ, ఉద్యోగ, కార్మికుల హక్కులను దెబ్బతీస్తున్నాయి. మేడే స్ఫూర్తితో మరింత పట్టుదలతో పోరాటాలు చేయాల్సిందిగా సూచించారు. రాష్ట్ర ప్రధానకార్యదర్శి ఐ.వెంకటేశ్వరరావు రాష్ట్ర అధ్యక్షులు ఎ.నర్సిరెడ్డి, కోశాధికారి పి.మాణిక్ రెడ్డి, కార్యదర్శి సిహెచ్.రవి, ఎస్‌టిఎఫ్‌ఐ రాష్ట్ర మహిళా కన్వీనర్ ఎం.సంయుక్త, సీనియర్ నాయకులు ఎన్.రమణయ్య శాస్త్రీలు ప్రసంగించారు. జిల్లా ప్రధాన కార్యదర్శి మేడే దేవదాస్ జిల్లా నాయకులు ఎన్.రమేష్, సుబ్రహ్మణ్యం, లక్ష్మణరావు, ఇబ్రహీం, శారద, రమాదేవి, నర్సింగ్‌రావు, రామకృష్ణ, శ్యాం, చారి వివిధ మండలాల నాయకులు పాల్గొన్నారు.

## పాఠశాలల మూసివేత
## అంబేద్కర్ ఆశయాలకు వ్యతిరేకం - ఎన్.నారాయణ

పిల్లలు తక్కువ ఉన్నారనే కారణంతో దళిత, గిరిజన గ్రామాల్లోని పాఠశాలలను మూసివేయటానికి రాష్ట్ర ప్రభుత్వం పూనుకోవడం విద్యాహక్కు స్ఫూర్తికి, అంబేద్కర్ ఆశయాలకు వ్యతిరేకమని యుటియఫ్ రాష్ట్ర అధ్యక్షులు నాగటి నారాయణ అన్నారు. స్థానిక యుటియఫ్ కార్యాలయంలో జి.రాజశేఖర్ అధ్యక్షతన జరిగిన యుటియఫ్ జిల్లా కార్యవర్గం, అంబేద్కర్ జయంతి సభల్లో నారాయణ ప్రసంగిస్తూ "ఉపాధ్యాయ సంఘాలతో చర్చించిన తర్వాతనే రేషనలైజేషన్‌ను అమలు చేయాలనీ, విద్యాహక్కు చట్టాన్ని పటిష్ఠంగా అమలు చేయాలని, రాష్ట్రంలో ఖాళీగా ఉన్న ఎంఇఓ, జూనియర్ లెక్చరర్స్, డైట్ లెక్చరర్స్ పోస్టుల భర్తీకి చర్యలు తీసుకోవాలని డిమాండ్ చేశారు. జిల్లా ప్రధాన కార్యదర్శి ఆర్.విక్రమ్‌రెడ్డి కార్యకలాపాల నివేదికను ప్రతిపాదించగా, సమావేశానికి హాజరైన వివిధ మండలాల బాధ్యులు చర్చించి ఆమోదించారు. ఖమ్మం జిల్లాలోని జిల్లా విద్యాశాఖాధికారి, జిల్లా పరిషత్, ఎపిజిఎల్ఐ, మెడికల్ బోర్డు, ఐటిడిఏ తదితర కార్యాలయాల్లో పెండింగ్‌లో ఉన్న ఉపాధ్యాయ సమస్యలను పరిష్కరించాలని యుటియఫ్ జిల్లా కార్యవర్గం తీర్మానించింది.

ఈ సమావేశానికి యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శి బి.నరసింహారావు పరిశీలకులుగా హాజరైనారు. జిల్లా నాయకులు జి.వి.నాగమల్లేశ్వరరావు ఏండా కిష్టయ్య, కస్తూరి, ఆంజనేయులు, రాజు, ఎ.వి. ఉద్దండు షరీఫ్, ఎం.నరసింహారావు, బ్రహ్మరెడ్డి, తదితరులు పాల్గొన్నారు.

## భద్రాచలంలో యుటియఫ్ ధర్నా

అక్రమ బదిలీలు, కన్వర్షన్లు, డిప్యూటేషన్లను రద్దు చేయాలని డిమాండ్ చేస్తూ జూన్ 3న భద్రాచలం ఐటిడిఏ కార్యాలయం ఎదుట యుటియఫ్ ఆధ్వర్యంలో ఉపాధ్యాయులు ధర్నా నిర్వహించారు. తొలుత సంఘం కార్యాలయం నుండి ఐటిడిఏ వరకు ప్రదర్శన నిర్వహించారు. అనంతరం జరిగిన ధర్నానుద్దేశించి యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శి బి.నర్సింహారావు మాట్లాడుతూ డిడి కార్యాలయం అవినీతికి నిలయంగా మారిందన్నారు. విద్యాహక్కు చట్టానికి తూట్లు పొడుస్తూ సిఆర్‌టిలకు కూడా డిప్యూటేషన్‌లు వేస్తున్నారని విమర్శించారు. సమస్యల పరిష్కారానికి చొరవ తీసుకోకపోతే రాష్ట్ర స్థాయిలో ఉద్యమిస్తామని హెచ్చరించారు. జిల్లా అధ్యక్షులు జి.రాజశేఖర్ మాట్లాడుతూ రాష్ట్రంలో ఏ మేనేజ్‌మెంట్‌లో లేని విధంగా ఐటిడిఏ డిడి కార్యాలయం నిబంధనలకు విరుద్ధంగా కన్వర్షన్లు యిచ్చిందని విమర్శించారు. అక్రమాలకు ప్రధాన భూమిక వహించిన డిడి, సూపరింటెండెంట్‌లను సస్పెండ్ చేయాలని ఉపాధ్యాయులు నినదించారు. ఈ ధర్నాలో జిల్లా ప్రధానకార్యదర్శి ఆర్.విక్రమ్‌రెడ్డి, జిల్లా సహాధ్యక్షులు బి.రాందాసు, జిల్లా కార్యదర్శులు జి.వి.నాగ మల్లేశ్వరరావు, ఆలీ,బి.రాజు, ఎ.వెంకటేశ్వర్లు, పి.కృష్ణయ్య, బి.బాలు తదితరులు పాల్గొన్నారు.

**విచారణాధికారిని నియమించిన పిఓ**

యుటియఫ్ ధర్నాకు స్పందించిన ఐటిడిఏ ప్రాజెక్టు అధికారి వీర పాండ్యన్ నాయకులను చర్చలకు ఆహ్వానించారు. డిమాండ్లపై సుదీర్ఘంగా చర్చించారు. అక్రమాలపై విచారణాధికారి మన్యం విద్యా శాఖాధికారి నాంపల్లి రాజేష్‌ను నియమించారు. పది రోజుల్లోగా సమగ్ర విచారణ చేసి నివేదిక అందజేయాలని ఆదేశించారు.

# స్పాట్ కేంద్రాలలో నిరసనలు

### అనంతపురంలో




అనంతపురం పదవ తరగతి స్పాట్ కేంద్రంలో ఏప్రిల్16 మధ్యాహ్నం భోజన విరామ సమయంలో నిరసన కార్యక్రమం జరిగింది ఈ నిరసన కార్యక్రమానికి యుటియఫ్ జిల్లా అధ్యక్షులు కె.నాగేంద్ర అధ్యక్షత వహించారు. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా ఎమ్మెల్సీ డా॥గేయానంద్ హాజరై మాట్లాడుతూ రాష్ట్ర వ్యాప్తంగా ఖాళీగా ఉన్న ఎం.ఇ.ఒ జూనియర్ లెక్చరర్, డైట్ లెక్చరర్ పోస్టులను భర్తీ గ్రేడ్-2 భాషా పండితులు, పి.ఇ.టి పోస్టులను అప్‌గ్రేడ్ చేయడంలో ప్రభుత్వ అలసత్వాన్ని విమర్శించారు. స్పెషల్ టీచర్లకు నోషనల్ ఇంక్రిమెంట్లు ఇవ్వాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. రాష్ట్ర కార్యదర్శి సి.కె.నాగేంద్రబాబు గౌరవాధ్యక్షులు ఎస్.మహమ్మద్ జిలాన్ తదితరులు మాట్లాడారు.

అనంతరం డిమాండ్లతో కూడిన వినతి పత్రాన్ని డిఇఒ శ్యామ్యూల్‌కు ఇచ్చారు. డిఇఓ శ్యామ్యూల్ స్పందిస్తూ వినతి పత్రాన్ని తన ఉన్నతాధికారుల దృష్టికి తీసుకెళ్తామని హామీ ఇచ్చారు.

ఈ కార్యక్రమానికి పి.ఇ.టి సంఘం అధ్యక్షులు నాగరాజు మద్దతు తెల్పారు. ఈ కార్యక్రమంలో జిల్లా కార్యదర్శి సుధాకర్, ఆడిట్ కమిటీ కన్వీనర్ సాయినాథ్‌బాబు, రాష్ట్ర కార్యవర్గ సభ్యులు భాస్కర్, యుటియఫ్ సీనియర్ నాయకులు ఎన్.ఈశ్వరయ్య, మండలాల నాయకులు జనార్థన్, సి.నాగేంద్ర, ఓబులేసు, జిలాన్, గోవిందు, లింగమయ్య, మారుతి, అనిల్, బి.ఎం.నారాయణ, రూతం వరలక్ష్మీ, శకుంతల, హరినాథ్, వీరన్న, వీరపాపన్న, మహేష్, సూర్యనారాయణ, విరూపాక్షి, శివారెడ్డి, నందీప రాయుడు తోపాటుగా 100మంది ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

### అనంత ఐక్య వేదిక ఆధ్వర్యంలో

అనంతపురం జిల్లా ఉపాధ్యాయ సంఘాల ఐక్యవేదిక ఆధ్వర్యంలో ఏప్రిల్ 12న ఎస్ఎస్‌సి స్పాట్ సెంటర్ ముట్టడి కార్యక్రమం జరిగింది. ఉదయం 9 గంటలకే అన్ని ఉపాధ్యాయ సంఘాల నాయకులతోపాటు యుటియఫ్ నాయకులు కార్యకర్తలు పెద్ద ఎత్తున పాల్గొన్నారు. ఎమ్మెల్సీ డా॥ ఎం.గేయానంద్ పాల్గొని మాట్లాడుతూ హైస్కూళ్ళలో పనిచేసిన విద్యావలంటీర్లకు వేతనాలు చెల్లించ కుండా నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్న తీరును దుయ్యబట్టారు. స్పాట్‌లో నినాదాలు, ఉపన్యాసాలతో హోరెత్తింది. ఒక్కరు కూడా లోనికి వెళ్ళలేక బయటే వుండి పోయారు. జిల్లా విద్యాశాఖాధికారి శ్యామ్యూల్ "ఐక్యవేదిక" ఆందోళనకు ప్రతిస్పందించి విద్యావలంటీర్ల వేతనాలు 10 రోజుల్లో చెల్లిస్తామని ఇన్విజిలేషన్ చేసిన ఉపాధ్యాయులు టిఏడిఏలు చెల్లిస్తామని హామీ యిచ్చి ఆందోళన విరమింప చేశారు. ఐక్యవేదిక ఆందోళనలో యుటియఫ్ జిల్లా గౌరవాధ్యక్షులు ఎస్. మహమ్మద్ జిలాన్, జిల్లా అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు కె.నాగేంద్ర, ఎన్.విజయ భాస్కర్‌లు పాల్గొన్నారు.

### కడపలో

కడప జిల్లా ఎస్ఎస్‌సి స్పాట్ కేంద్రంలో ఉపాధ్యాయ సమస్యలు పరిష్కరించాలని కోరుతూ ఏప్రిల్16న యుటియఫ్ జిల్లాశాఖ భోజన విరామ సమయంలో నిరసన కార్యక్రమము నిర్వహించింది. ఈ సందర్భంగా జిల్లా ప్రధాన కార్యదర్శి బి.లక్ష్మిరాజా మాట్లాడుతూ ఖాళీగా వున్న 900 ఎంఇఓ పోస్టులు, 4వేల జూనియర్ లెక్చరర్ పోస్టులు దాదాపు వెయ్యి డైట్ లెక్చరర్ తదితర పోస్టులకు ప్రమోషన్లు ఇవ్వాలని డిమాండ్ చేశారు. ఇతర ఉపాధ్యాయ సమస్యలు పరిష్కరించాలని డిమాండ్ చేశారు. ఈ కార్యక్రమములో యుటియఫ్ జిల్లా సహాధ్యక్షులు ఎం.విజయ్ కుమార్, ట్రెజరర్ ఎస్.వి.సుబ్బారాజు జిల్లా మాజీ అధ్యక్షులు బీరం సుబ్బారెడ్డి ప్రధానోపాధ్యాయుల సంఘం జిల్లా అధ్యక్షులు జి.వి.నారాయణ రెడ్డి ఆర్.జె.వి.పి జిల్లా కార్యదర్శి శ్రీనివాసులు, తదితరులు పాల్గొన్నారు.

### మహబూబ్‌నగర్‌లో




మహబూబ్‌నగర్ జిల్లా కమిటీ ఆధ్వర్యంలో ఏప్రిల్ 16న 10వ తరగతి మూల్యాంకన కేంద్రాలైన క్రీస్తు జ్యోతి స్కూల్ మరియు మహబూబ్‌నగర్ గ్రామర్ స్కూల్ నందు ఉపాధ్యాయుల ముఖ్యమైన సమస్యలు తక్షణమే పరిష్కరించాలని కోరుతూ నిరసన సభలు నిర్వహించారు. ఈ కార్యక్రమానికి యుటియఫ్ జిల్లా అధ్యక్ష ప్రధాన కార్యదర్శులు ఎన్.కిష్టయ్య, ఎం.వెంకటప్పలు అధ్యక్షులుగా వ్యవహరించి కార్యక్రమాన్ని నిర్వహించారు. ఈ సందర్భంగా ఎన్.కిష్టయ్య, మాట్లాడుతూ హైస్కూల్స్‌లో పనిచేసే తెలుగు పండిట్, పిఇటి పోస్టులను స్కూల్ అసిస్టెంట్‌గా అప్‌గ్రేడ్ చేయాలని, ఎంఇఓ, జెఎల్, డిప్యూటీఇఓ, డైట్ లెక్చరర్ ప్రమోషన్స్ ఇవ్వాలని డిమాండ్ చేశారు. హెచ్ఎం.అసోసియేషన్ జిల్లా అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు మరళీకృష్ణ, గిరిధర్‌లు మాట్లాడుతూ జిహెచ్ఎంలకు 30రోజులు వేసవి సెలవుల్లో పని చేసినందుకు సంపాదిత సెలవులు ఇవ్వాలన్నారు.

ఈ కార్యక్రమంలో యుటియఫ్ జిల్లా కార్యదర్శి కె.వెంకటయ్య, కోశాధికారి సీత్యానాయక్ యుటియఫ్ నాయకులు, అజయ్, పాపయ్య, రవికుమార్, ఎన్.వెంకటేష్, శ్రీధర్‌శర్మ, విజయలక్ష్మీ, సుజాత, భగవంత్‌రాజ్, కళ్యాణంతోపాటు ఎస్ఎల్‌టిఏ జిల్లా అధ్యక్షులు సురేంద్రనాథ్, ఆర్‌యుపిపి నాయకులు రాకేష్, బిటిఏ నాయకులు చిన్నయ్య, ఎస్‌టియఫ్ నాయకులు రవిప్రకాశ్ మరియు స్పాట్‌లోని ఉపాధ్యాయుల పాల్గొన్నారు.

### ఖమ్మంలో




పెండింగ్ సమస్యల పరిష్కారం కోరుతూ ఎప్రిల్ 26న యుటియఫ్ ఖమ్మం జిల్లా కమిటీ ఆధ్వర్యంలో ఉపాధ్యాయులు ఎస్ఎస్‌సి స్పాట్ కేంద్రంలో నిరసన కార్యక్రమం నిర్వహించారు. ఈ కార్యక్రమాన్ని ఉద్దేశించి యుటియఫ్ జిల్లా అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు జి.రాజశేఖర్, ఆర్.విక్రమ్‌రెడ్డి మాట్లాడుతూ, సమస్యల పరిష్కారం పట్ల ప్రభుత్వం నిర్లక్ష్యపూరితంగా వ్యవహిరిస్తున్నదని విమర్శించారు. పండితులు, పిఇటి పోస్టులు అప్‌గ్రేడ్ చేసి, వారికి ప్రమోషన్లు ఇవ్వాలని, స్పెషల్ టీచర్లకు నోషనల్ ఇంక్రిమెంట్లు ఇవ్వాలని, ఉపాధ్యాయులకు డైట్, జూనియర్ లెక్చరర్ పదోన్నతులు కల్పించాలని సుదీర్ఘ కాలంగా డిమాండ్ చేస్తున్నా ప్రభుత్వం స్పందించడం లేదన్నారు. రాష్ట్ర వ్యాప్తంగా ఎంఇఓ పోస్టులు భర్తీ చేయాలని స్పాట్ సెంటర్‌లో సౌకర్యాలు మెరుగుపరచాలని డిమాండ్ చేశారు. పై సమస్యలు వెంటనే పరిష్కరించని పక్షంలో పోరాటం తీవ్రతరం చేస్తామని అన్నారు. అనంతరం డిఇఓకు మెమోరాండం సమర్పించారు. సమస్యల్ని ప్రభుత్వం దృష్టికి తీసుకువెళ్తానని డిఇఓ హామీ ఇచ్చారు. కార్యక్రమంలో యుటియఫ్ జిల్లా నాయకులు బి.రాందాసు, సి హెచ్.దుర్గాభవాని, ఎన్.కె.మహబూబ్అలీ, జె.రాంబాబు, ఎ.రమాదేవి, ఎస్.నాగేశ్వరరావు, ఎస్.కె.ఉద్దండు, ఆర్.అరవింద్‌కుమార్, రామకృష్ణ, వెంకన్న, ఎస్.ఎల్.నరసింహారావు, శ్రీనివాసరావు, గీత, శచేంద్రబాబులతో పాటు వందలమంది ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

### రంగారెడ్డి జిల్లా ఎస్ఎస్‌సి స్పాట్ కేంద్రంలో నిరసనలు

ఏప్రిల్ 18న రంగారెడ్డిజిల్లా హయత్‌నగర్ లోని వర్ద్ అండ్‌డీడ్ స్పాట్ వాల్యుయేషన్ కేంద్రం వద్ద యుటియఫ్ జిల్లా శాఖ ఆధ్వర్యంలో లంచ్ అవర్ డెమాన్‌స్ట్రేషన్ జరిగింది. ఈ కార్యక్రమాన్నుద్దేశించి జిల్లా అధ్యక్షులు, పి.మాణిక్‌రెడ్డి మాట్లాడుతూ ఎంఇఓ, జెఎల్, డైట్ లెక్చరర్స్ ప్రమోషన్స్ యివ్వాలని, పండిట్, పిఇటిల అఫ్‌గ్రేడేషన్, స్పెషల్ టీచర్ సర్వీసుకు నోషనల్ ఇంక్రిమెంట్లు మంజూరు చేయాలని, రేషనలైజేషన్ జి.ఓను సవరించాలని, డిమాండ్ చేశారు. ప్రధానకార్యదర్శి ఎం.ఆంజనేయులు, కోశాధికారి ఇ.గాలయ్య అసోసియేట్ అధ్యక్షులు డి.ఎల్.ప్రసన్న కుమారి, ఎస్.రాజశేఖర్, కార్యదర్శులు ఎం.శ్రీధర్, రాములయ్య, మల్లేష్, ఎం.విజయలక్ష్మీ, అనీల్‌కుమార్, దామోదర్, సుందరయ్య, జయరాజ్, శంకరయ్య, రఘుపతి, జగన్, గణేశ్, రవితోపాటు పలువురు ఉపాధ్యాయులు పాల్గొన్నారు. అనంతరం డిఇఓకు సమస్యలతో కూడిన మెమోరాండాన్ని సమర్పించారు.

### శంశాబాద్‌లో నూతన ఉపాధ్యాయులకు అవగాహన సదస్సు

రంగారెడ్డి జిల్లా రాజేంద్రనగర్, శంశాబాద్ యుటియఫ్ మండల శాఖల ఆధ్వర్యంలో డిఎస్‌సి-2012 టీచర్లకు ఏప్రిల్ 16న శంశాబాద్ ఎంఆర్‌సిలో అవగాహన సదస్సు నిర్వహించారు. ఎమ్మెల్సీ డా॥ కె. నాగేశ్వర్ ముఖ్య అతిథిగా హాజరై విద్యారంగంలో ఎదుర్కొంటున్న పలు యిబ్బందులను ప్రస్తావించారు. ప్రభుత్వ నిర్లక్ష్యం కారణంగా పాఠశాలలో సమస్యలు పెరిగిపోతున్నాయి. అయినా సామాజిక స్పృహ కలిగిన ఒక ఉపాధ్యాయ సంఘంగా యుటియఫ్ కార్యకర్తలు ఛాలెంజ్‌గా తీసుకొని మంచి ఫలితాలు సాధించాలని, పాఠశాలలను కాపాడే బృహత్తర కార్యక్రమాన్ని తీసుకొని ముందుకెళ్ళాలని అందుకు తనవంతు సహకారాన్ని అందిస్తానని అన్నారు.

జిల్లా అధ్యక్షులు పి.మాణిక్‌రెడ్డి మాట్లాడుతూ ప్రభుత్వ పాఠశాలలో కనీస వసతులు అయిన టాయిలెట్స్, మంచినీటి వసతి లేకపోవడం బాధాకరమని అయినను విద్యారంగంలో ఉపాధ్యాయులు మంచి ఫలితాలు సాధిస్తున్నారన్నారు. ఈ సమావేశంలో జిల్లా ప్రధానకార్యదర్శి ఎం.ఆంజనేయులు, కార్యదర్శులు ఎం.శ్రీధర్, ఎం.విజయలక్ష్మి, బి. టెలీశ్వరయ్య, శంశాబాద్, రాజేంద్రనగర్ ఎంఇఓలు నర్సింహారావు, భూపతిరావు, మండలాల బాధ్యులు గోపాల్, ఇమానుయెల్, విజయ్, ప్రమోద్, రవి, గౌరయ్య, నర్సింహులతోపాటు పలువురు ఉపాధ్యాయులు పాల్గొన్నారు. అనంతరం డిఎస్‌సి-2012 ఉపాధ్యాయులకు సర్వీసు రిజిష్టర్లు అందజేశారు.

### హైదరాబాద్ స్పాట్ కేంద్రంలో నిరసన

యుటియఫ్ హైదరాబాద్ జిల్లా శాఖ పక్షాన ఏప్రిల్ 16వ తేదీన విజయనగర్ కాలనీలోని సెయింట్ ఆన్స్ స్పాట్ కేంద్రంలో నిరసన చేపట్టారు. భోజన విరామ సమయంలో టీచర్లు పెండింగ్ సమస్యలపై పరిష్కారాన్ని కోరుతూ నినాదాలు చేశారు. రాష్ట్ర ప్రధానకార్యదర్శి ఐ. వెంకటేశ్వరరావు కార్యక్రమానికి హాజరై ప్రసంగించారు. దశాబ్దమున్నర కాలం పోరాటం చేసి దుర్మార్గమైన అప్రెంటిస్ విధానాన్ని రద్దు చేయించు కోగలిగామని, పండితుల, పిఇటిల అప్‌గ్రేడేషన్, ఎయిడెడ్ పాఠశాలల్లో ప్రమోషన్లు, ఖాళీ పోస్టుల భర్తీ, పర్యవేక్షణాధికారుల నియామకం వంటి సమస్యలపై ప్రభుత్వం ఎప్పటికప్పుడు వాగ్దానాలు చేస్తూనే అమలులో నిర్లక్ష్యం వహిస్తున్నదని, హైదరాబాదు నగరంలో వందలాదిగా ఏర్పడుతున్న కొత్త బస్తీల్లో గతంలో మూసివేసిన పాఠశాలలను తిరిగి తెరవాలని ఆయన డిమాండ్ చేశారు. స్పాట్ కేంద్రాల్లో వసతులపైనా అసంతృప్తి వ్యక్తం చేశారు. అనంతరం డిఇఓ సుబ్బారెడ్డిని కలిసి సమస్యలపై వినతిపత్రం అందచేశారు. ఈ కార్యక్రమంలో రాష్ట్ర సహాధ్యక్షురాలు ఎం.సంయుక్త, జిల్లా బాధ్యులు ఎస్.వై.కొండలరావు, మేడె దేవదాసు, ఎన్.రమేష్, డి.సంజీవరావు, కె.రేణు, జి.సుబ్రహ్మణ్యం, రామకృష్ణ, ఆర్.శారద, ఏ.రమాదేవి, జి.నర్సింహారెడ్డి, వెంకటేశ్వర్లు, శ్యాంసుందర్ తదితరులు పాల్గొన్నారు.

### ఎమ్మెల్సీ ఎన్నికల విరాళములు

**ప॥గో॥ జిల్లా పోడూరు (మం)**

| క్ర.సం. | పేరు | | విరాళం |
|---|---|---|---|
| 1. | ఎస్.ఎస్.వి.అవధాని | - | 1000 |
| 2. | బి.శేషగిరిరావు ఎం.ఎం.పాడు | - | 500 |
| 3. | కె.విజయకుమార్,కొత్తపేట | - | 500 |
| 4. | బిహెచ్.సత్యనారాయణరాజు,వేడండి | - | 500 |
| 5. | వి.శారదాదేవి, కవిటం | - | 500 |
| 6. | డి.విజయగోపాల్, జగన్నాథపురం | - | 500 |
| 7. | కె.పెద్దిరాజు,కవిటం | - | 500 |
| 8. | ఎన్.రమేష్, జిన్నూరు | - | 500 |
| 9. | పి.సత్యనారాయణ, కె.చిక్కాల | - | 500 |
| 10. | జి.పెద్దిరాజు, వేడంగి | - | 500 |
| 11. | వై.వి.ప్రసాద్‌బాబు, జగన్నాథపురం | - | 500 |
| 12. | డి.వెంకటేశ్వరావు,రావిపాడు | - | 500 |

# అంబేద్కర్ జయంతి ఉత్సవాలు

**వరంగల్ జిల్లా చేర్యాలలో**



సామాజిక స్ఫూర్తి ప్రదాత, భారత రాజ్యాంగ నిర్మాత భారతరత్న డాక్టర్ బి.ఆర్ అంబేద్కర్ 123వ జయంతి సందర్భంగా వరంగల్ జిల్లా చేర్యాల యుటియఫ్ మండల శాఖ అధ్వర్యంలో, అంగడిబజార్‌లో గల డా॥ బి.ఆర్.అంబేద్కర్ విగ్రహానికి యుటియఫ్ మండల శాఖ అధ్యక్షులు కె.రాజారెడ్డి, యుటియఫ్ జిల్లా కౌన్సిలర్ ఎస్‌డి.మెయిజుద్దీన్ ఆధ్వర్యంలో పూలమాలవేసి, ఘనంగా నివాళులర్పించారు.

తదనంతరం జరిగిన సమావేశంలో ఎస్‌డి.మెయిజుద్దీన్ మాట్లాడుతూ డా॥బి.ఆర్ అంబేద్కర్ ఉన్నత చదువులు చదివి, ప్రపంచ మేధావుల్లో ఒక్కరుగా వెలుగొందారని, తన మేధస్సు తనకోసం కాకుండా, దేశంలో సామాజిక ఆర్థిక దోపిడి విముక్తి కోసం వినియోగించిన త్యాగశీలి అని అన్నారు.

యుటియఫ్ చేర్యాల మండల శాఖ ప్రధానకార్యదర్శి కె.ప్రశాంత్ కుమార్ ఎం.మల్లేశం. కె.నర్సింహులు, జి.శశిధర్, ఎ.సుదర్శనం, వి.శ్రీనివాస్, బి.సత్యనారాయణ, జె.ప్రభాకర్ తదితరులు పాల్గొన్నారు.

**నెల్లూరు జిల్లా కావలిలో**




నెల్లూరు జిల్లా కావలి యుటియఫ్ ప్రాంతీయ కార్యాలయం నందు కావలి మండల శాఖ అధ్యక్షులు పి.శ్రీనివాసులు అధ్యక్షతన ఏప్రిల్ 14న బి.ఆర్.అంబేద్కర్. 122వ జయంతి సభ నిర్వహించారు. సభకు ముఖ్య అతిథిగా యుటియఫ్ జిల్లా అధ్యక్షులు సిహెచ్.శ్రీహరి పాల్గొని మాట్లాడుతూ మహనీయుడు అంబేద్కర్ తన జీవితాంతం బడుగు బలహీన వర్గాల అభ్యున్నతికి కృషి చేసారని వారు భవిష్యత్‌ను దృష్టిలో ఉంచుకుని సమసమాజ నిర్మాణం కొరకు, సామాజిక న్యాయం కొరకు, రాజ్యాంగాన్ని నిర్మించడం, రూపొందించడం జరిగిందని, ఇప్పుడు దానిని రాజకీయ శక్తులు వక్రీకరించి తమ స్వలాభాలకు మలుచుకుంటున్నారని అన్నారు. ఉపాధ్యాయులు సామాజిక చైతన్యం కలిగిన వారుగా ప్రభుత్వ పాఠశాలలను బలపరుచుకుంటూ ప్రజలలో చైతన్యాన్ని కల్గించే పాత్రను పోషించాలని కోరారు. ఈ కార్యక్రమంలో ముందుగా అంబేద్కర్ పార్కులో గల అంబేద్కర్ విగ్రహానికి పూలమాల వేసి నివాళులర్పించారు. ఈ కార్యక్రమంలో యుటియఫ్ జిల్లా కార్యదర్శి చలపతి శర్మ, మహిళా విభాగం జిల్లా కన్వీనర్ శ్రీదేవి, జెఏసి కావలి డివిజన్ కార్యదర్శి ఉస్మాన్, ప్రాంతీయ మండలాల అధ్యక్ష, కార్యదర్శులు యు.అశోక్, పి.లక్ష్మయ్య, యస్.వి.దుర్గాప్రసాద్, జి.వేణుగోపాల్, పి.రమేష్, బి.మాధవరావ్, జిల్లా కమిటీ సభ్యులు టి.శ్రీనివాసరావు మరియు యుటియఫ్ కార్యకర్తలు, ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

**అనంతపురం జిల్లా హిందూపురంలో**



అనంతపురం జిల్లా హిందూపురం పట్టణంలో యుటియఫ్ హిందూపురం జోన్ ఆధ్వర్యంలో ఎప్రిల్16న మహాత్మా జ్యోతిబాపూలే, డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్‌ల జయంతిని ఘనంగా నిర్వహించారు. ఈ కార్యక్రమంలో లేపాక్షి, హిందూపురం (రూరల్&అర్బన్) పరిగి మండల శాఖల నుండి నాయకులు, కార్యకర్తలు పాల్గొన్నారు. జ్యోతిబాపూలే మరియు అంబేద్కర్‌ల చిత్రపటాలకు పూలమాలలు వేసి నివాళులు అర్పించారు. ఈ సందర్భంగా జరిగిన సమావేశంలో వక్తలు ప్రసంగిస్తూ పూలే మరియు అంబేద్కర్‌లు విద్య, సమానత్వం కోసం పోరాడారని, అంటరానితనం, దురాచారాలు, మూఢ నమ్మకాలు తదితర సాంఘిక రుగ్మతులను నిర్మూలించడానికి కృషి చేసారని అన్నారు. జన సమూహాలు చైతన్యవంతం కావాలంటే కేవలం విద్య ద్వారా మాత్రమే సాధ్యమని భావించి అందరికీ విద్య అందాలని వారు కృషి చేశారన్నారు.

ప్రభుత్వ ఉపాధ్యాయుల అందరూ గ్రామీణ, పేద, బలహీన వర్గాల పిల్లలకు చక్కని విద్యను అందించి, ప్రభుత్వ విద్యా వ్యవస్థను బలోపేతం చేయాలని అన్నారు. ఈ కార్యక్రమంలో యుటియఫ్ జిల్లా కార్యదర్శి మారుతీ శ్రీనివాస్, ఓబులేసు నాయకులు శారద, శ్రీదేవి, సుజాత, అశ్వర్థప్ప, జిహెచ్.బాబు మోహన్ బాబు, సుబ్రమ్మణ్యం, పెన్నోబులం, తిరుపతయ్య, సూర్యనారాయణ, ప్రభాకర్, శంకరనారాయణ, లక్ష్మీపతి, జి.ఆర్.శ్రీనివాసులు, శ్రీరాములు, అనిల్, శివయ్య, హఫీజ్, సురేష్, ప్రదీప్, చెన్న కేశవులు ఇంకా 60 మందికిపైగా ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

# ఏవిఎస్, విఎస్ఆర్ వర్ధంతి సభలు

**తూ॥గో॥ జిల్లా కాజులూరులో**

తూ॥గో జిల్లా, కాజులూరు మండలం, 'గొల్లపాలెం' నందు ఏప్రిల్ 1న అప్పారి వెంకటస్వామి మరియు వి.సూర్యనారాయణరాజు గార్ల వర్ధంతి సభ, కుటుంబ సంక్షేమ పథకం ఆవిర్భావ దినోత్సవం నిర్వహించారు.

ఈ సభకు మండల యుటియఫ్ అధ్యక్షులు లక్ష్మణరావు అధ్యక్షత వహించారు. ఏవిఎస్, విఎస్ఆర్ వారి ఫోటోలకు సీనియర్ యుటియఫ్ కార్యకర్త ఐ.ప్రసాదరావు పూలదండలతో నివాళి అర్పించారు.

రాష్ట్రంలో యుటియఫ్‌ని అగ్రగామిగా నిలిపిన వారు అప్పారి. వెంకటస్వామి అని, తూ॥గో॥ జిల్లా యుటియఫ్‌ని, నిర్మించి అభివృద్ధి పరిచిన వారు వత్సవాయి సూర్యనారాయణరాజు అని పలువురు నివాళు లర్పించారు. జిల్లా కుటుంబ సంక్షేమ పథకం డైరెక్టర్ ఐ.ప్రసాదరావు మాట్లాడుతూ ఇప్పటివరకు జిల్లాలో మరణించిన 158 మంది ఉపాధ్యాయుల కుటుంబాలకు రూ. 1,18,88,875/- విరాళం అందించుట జరిగినది అని తెలిపారు. ఇకనుండి మరణించిన ఉపాధ్యాయుని కుటుంబానికి రూ. 1,50,000/- సంఘీభావ విరాళం అందించాలని నిర్ణయించామన్నారు.

ఈ కార్యక్రమంలో సీనియర్ నాయకులు డి.సదానందమూర్తి, ఐ.వి.వి.సత్యనారాయణ, మండల యుటియఫ్ గౌ॥అధ్యక్షులు సత్యాజీరావు, ప్రధాన కార్యదర్శి శ్రీనివాస్, కుటుంబ సంక్షేమ పథకం కార్యదర్శి ఎం.భవాని రమేష్ తదితరులు పాల్గొన్నారు.

**జగ్గంపేటలో**

అప్పారి వెంకటస్వామి, వత్సవాయి సూర్యనారాయణరాజుల వర్ధంతి సభ తూ॥గో జిల్లా జగ్గంపేట మండల శాఖ ప్రధాన కార్యదర్శి యం.మల్లేశ్వరరావు అధ్యక్షతన నిర్వహించారు. ఏవిఎస్ మరియు విఎస్ఆర్ చిత్రపటాలకు విశ్రాంత ఉద్యోగులు మారిశెట్టి వీరభద్రరావు మరియు సిహెచ్.వెంకటశాస్త్రి పుష్పమాలలు వేసి నివాళి అర్పించినారు. యుటియఫ్ రాష్ట్ర కార్యవర్గ సభ్యుడు తోలేటి సూర్యనారాయణ గౌ॥ అధ్యక్షుడు అగ్గాలవీరబాబు, కార్యదర్శులు ఎం.వి.సాయిరామ్, వినయ్ ఎన్.నాగేశ్వరరావు, జి.రామారావు, సిహెచ్.హరిబాబు మరియు డి.నూకరాజు, ఆర్.సిహెచ్.వెంకటేశ్వర్లు, మహేష్, జె.వి.వి. మండల ప్రధాన కార్యదర్శి సి.హెచ్.వి.వర్మ మరియు ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

**ఖమ్మంలో వి.ఎల్.నర్సింహారావు వర్ధంతి**




సరళీకరణ విధానాలను ప్రతిఘటిస్తూ, ప్రభుత్వ పాఠశాలల బలోపేతానికి కృషి చేయడమే అమరజీవి వి.ఎల్.నరసింహారావుకు ఇచ్చే నిజమైన నివాళి అని యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శి చావ రవి అన్నారు. మే 17న ఖమ్మంలో నిర్వహించిన యుటియఫ్ సీనియర్ నాయకులు వి.ఎస్.నరసింహారావు వర్ధంతి సభలో చావారవి ప్రధానోపన్యాసం చేస్తూ జిల్లాలో యుటియఫ్ నిర్మాణానికి, కార్యకర్తల తర్ఫీదుకు వి.ఎల్.విశేషంగా కృషి చేసారన్నారు. విద్యాహక్కు చట్టం మేరకు ఉపాధ్యాయ పోస్టులు మంజూరు చేయాలని, పాఠశాలల మూసివేతను విరమించుకోవాలని రవి డిమాండ్ చేశారు. ఈ సమావేశంలో యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శులు బి.నరసింహారావు, సిహెచ్.దుర్గాభవాని, సీనియర్ నాయకులు ఆర్.రాఘవయ్య, ఆర్.పురుషోత్తమరావు, జిల్లా నాయకులు జి.రాజశేఖర్, ఆర్.విక్రమ్ రెడ్డి, ఎన్.వీరబాబు, జి.వి.నాగమల్లేశ్వరరావు, ఎస్.కె.ఉద్దండు షరీఫ్, ఎం.నరసింహారావు, పి.కిష్టయ్య, ఏ.వి, బాలు, ఆలీ తదితరులు పాల్గొన్నారు.

**నెల్లూరు జిల్లా వెంకటగిరిలో**




ఉపాధ్యాయ ఉద్యమానికి స్ఫూర్తిగా నిలిచిన మహానుభావుడు అప్పారి వెంకటస్వామి అని యుటియఫ్ నెల్లూరు జిల్లా అధ్యక్షులు సిహెచ్.శ్రీహరి కొనియాడారు. మార్చి 29న వెంకటగిరి, జిల్లా ప్రజాపరిషత్ బాలికల ఉన్నత పాఠశాలలో అప్పారి వెంకటస్వామి 13వ వర్ధంతి సభను ఘనంగా నిర్వహించారు. ఈ సందర్భంగా శ్రీహరి మాట్లాడుతూ రాష్ట్రంలో ఎమర్జెన్సీకి ఎదురొడ్డి నిలిచిన ఉపాధ్యాయ సంఘంగా యుటియఫ్‌ను అగ్రస్థానంలో నిలిబెట్టిన ఘనత అప్పారిదేనన్నారు. జిల్లా గౌరవాధ్యక్షులు చంద్రశేఖర్ జిల్లా కార్యదర్శి యం.నాగేశ్వరరావు, సీనియర్ నాయకులు నర్రామీనయ్య, ప్రాంతీయ మండలశాఖల (వెంకటగిరి, డక్కిలి, బాలాయపల్లి) అధ్యక్ష ప్రధాన కార్యదర్శులు కె.వి.రత్నం, యస్.జయచంద్ర, రామయ్య, ఆదినారాయణ, పి.ఫిరోజ్‌ఖాన్ వై.బహదూర్ మరియు ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

## డిడి పై చర్యలు కోరుతూ పార్వతీపురంలో ధర్నా

విజయనగరం జిల్లా పార్వతీపురం ఐటిడిఏ పరిధిలో గల పాఠశాలలు, ఉపాధ్యాయుల సమస్యలు పరిష్కారించాలని, గిరిజనా భివృద్ధికి ఆటంకంగా ఉన్న ఐటిడిఏ డిడి చేసిన అవినీతి, అక్రమాలకు వ్యతిరేకంగా డిడిపై చర్యలు తీసుకోవాలని చాలా దఫాలుగా చర్చలు జరిపినా, ఎటువంటి చర్యలు లేకపోవడంతో మే 19వ తేదీ నుండి ఐటిడిఏ కార్యాలయం ఎదుట రిలే నిరాహారదీక్షలను యుటియఫ్, గిరిజన ఉద్యోగుల సంఘం, గిరిజనుల ఐక్యవేదిక ఆధ్వర్యంలో నిర్వహించారు. డిప్యూటీ డైరెక్టర్ అక్రమాలపై జరిగిన విచారణలో మహిళా టీచర్ల పట్ల వ్యవహరిస్తున్న అనుచిత వైఖరి వాస్తవమేనని ఋజువు అయింది. వార్డెన్స్ దగ్గర డబ్బులు బలవంతంగా వసూలు చేయడం, విద్యార్థు లకిచ్చే హెయిర్‌కటింగ్ ఛార్జీలలో 50% తీసుకోవడం నిరూపిత మయ్యాయి.

ఇవిగాక ప్రమోషన్లలో అక్రమాలు, ప్రతి పనికి ఒక రేటు పెట్టి నిరంతరం వసూళ్లు చేయించడం, సందర్భం లేకుండానే ఉపాధ్యాయుల పై కక్ష సాధింపు చర్యలు చేపట్టటం, వీటితోపాటు మరో 6 అంశాలను పరిష్కరించి, డిడిపై చర్యలు తీసుకోవాలని డిమాండ్లతో పోరాటం నిర్వహిస్తున్నారు.

మే 21న జరిగిన ఐటిడిఏ పాలకవర్గ సమావేశంలో పై సమస్యలపై ఉత్తరాంధ్ర ఎమ్మెల్సీ, ఎం.వి.ఎస్.శర్మ చర్చకు పెట్టారు. పిఓపై కలెక్టరు చర్యలు తీసుకోవాలని నిలదీస్తూ సమావేశం నుండి వాకౌట్ చేశారు. 25వ తేదీ వరకు రిలే దీక్షలు, 27.05.2013న మహాధర్నాను నిర్వహించారు. ధర్నాను యుటియఫ్ రాష్ట్ర సహాధ్యక్షులు కె.విజయగౌరి ప్రారంభించారు. గిరిజన ఉద్యోగుల సంఘం నాయకులు అప్పన్నదొర అధ్యక్షతన శిబిరాన్ని మధ్యాహ్నం 3 గంటల వరకు కొనసాగించారు.

ఈ కార్యక్రమంలో సంఘాలకు అతీతంగా అందరూ పాల్గొనడం ఐక్య ఉద్యమానికి శుభసూచకమని నేతలు అభిప్రాయపడ్డారు. గిరిజన ఐక్య వేదిక, ఆదివాసీ వికాస సంఘం, శ్రేష్ఠ గిరిజన సంఘం, ఎస్‌సి, ఎస్‌టి ఉద్యోగుల సంఘం, ఎస్‌ఎఫ్‌ఐ, గిరిజన సంఘం, సిఐటియు మొ॥ సంఘాలు ప్రత్యక్షంగా పాల్గొన్నాయి. యుటియఫ్ జిల్లా అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు డి.రాము,కె.శేషగిరి, రాష్ట్ర కార్యవర్గ సభ్యులు ఎస్.మురళీమోహన్, టి.రమేష్, శ్రీరాములు, వెంకటనాయుడు, మధు, ఈశ్వరరావు, ఎన్.సీతారాం, రంజిత్ కుమార్, ఆర్.శ్రీరామమూర్తి, సుందర్రావు తదితరులు పాల్గొన్నారు.

## నర్సింహ్మాచారి పదవీవిరమణ అభినందన సభ

రంగారెడ్డి జిల్లా గౌరవాధ్యక్షులు ఆర్.నర్సింహ్మాచారి పదవీవిరమణ అభినందన సభ ఏప్రిల్ 22న సరూర్‌నగర్ ఉన్నత పాఠశాల ఆవరణలోని జ్యోతి క్లబ్‌లో జరిగింది. ఈ సభకు రాష్ట్ర అధ్యక్షులు ఎన్.నారాయణ విచ్చేసి విద్యార్థులు, టీచర్లు, పూర్వ విద్యార్థుల మధ్య ఉద్యోగ విరమణ ఉత్సవం ఇంత ఘనంగా జరుపుకోవటం సంతోషంగా ఉందని, నిస్వార్థంగా నీతి, నిజాయతీలతో పనిచేస్తేనే అది సాధ్యమవుతుందని అన్నారు. సమాజాన్ని నిరంతరం అధ్యయనం చేయడం, లోటుపాట్లను విద్యార్థులకు తెలియజేయడం ఉపాధ్యాయుల లక్ష్యంగా వుండాలన్నారు. రంగారెడ్డి జిల్లా ఉద్యమ నిర్మాణం నర్సింహాచారి పాత్ర ప్రముఖంగా ఉందని, అందరికి అందుబాటులో వుండి సేవలందించటం, కమిట్‌మెంట్, కార్యదక్షత, నిజాయితీల ద్వారా ఉపాధ్యాయులకు దగ్గరయ్యారన్నారు. అందుకు వారికుటుంబాన్ని మనస్ఫూర్తిగా అభినందించారు.

ఎమ్మెల్సీ కె.జనార్థన్‌రెడ్డి మాట్లాడుతూ అందరితో కలిసుంటూనే జిల్లా ఉపాధ్యాయ ఉద్యమ నిర్మాణంలో సమస్య ఎవరిదైనా స్పందించే గుణముందన్నారు. జిల్లా అధ్యక్షులు పి.మాణిక్‌రెడ్డి మాట్లాడుతూ యుటియఫ్‌కు చారి అందించిన సేవలను కొనియాడారు.

అనంతరం జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల సరూర్‌నగర్ ప్రధాన ఉపాధ్యాయులు, ఉపాధ్యాయ బృందం, సరూర్ నగర్ డివిజన్ యుటియఫ్ కార్యకర్తలు నర్సింహ్మాచారిని ఘనంగా సన్మానించారు. ఈ కార్యక్రమంలో జిల్లా ప్రధాన కార్యదర్శి ఎం.ఆంజనేయులు, అసోసియేట్ అధ్యక్షులు ఎస్.రాజశేఖర్, డిఎల్. ప్రసన్న కుమారి, కోశాధికారి ఇ.గాలయ్య కార్యదర్శులు ఎం.విజయ లక్ష్మీ, ఎం.శ్రీధర్, జి.వందన, వి.బాలకోటి, బా.రాములయ్య, ఎం. మల్లేశ్, బి.టెలీశ్వరయ్య పాటు పలువురు జిల్లా కార్యవర్గ సభ్యులు, ఇబ్రహీంపట్నం డివిజన్ కార్యకర్తలు అధిక సంఖ్యలో పాల్గొన్నారు.

## నారాయణఖేడ్‌లో యుటియఫ్ ఫ్లెక్సీల ఆవిష్కరణ




మెదక్ జిల్లా నారాయణఖేడ్ మండల వనరుల కేంద్రం నందు యుటియఫ్ నారాయణఖేడ్ శాఖ ప్రభుత్వ పాఠశాలల విశిష్టతపై తయారు చేసిన ఫ్లెక్సీల ఆవిష్కరణ కార్యక్రమం నిర్వహించారు. సంగ్‌శెట్టి, ఎంఇఓ భీంసింగ్, యుటియఫ్ జిల్లా సహాధ్యక్షులు కె. అశోక్‌లు పాల్గొన్నారు. ఆవిష్కరణ అనంతరం జోగిపేట డివైఇఓ సంగ్‌శెట్టి మాట్లాడుతూ విద్యా సంబరాలు విజయవంతం చేయుటలో యుటియఫ్ కృషి అభినందనీయం అని అలాగే పనిచేస్తున్న ఆవాస ప్రాంతాలల్లో 100% నమోదు, నిలకడ సాధించాలని నాణ్యమైన విద్య అందించాలని అన్నారు. నారాయణఖేడ్ ఎంఇఓ భీంసింగ్ మాట్లాడుతూ ప్రైవేటు పాఠశాలల కంటే ప్రభుత్వ పాఠశాలల్లోనే అనేక మెరుగైన అంశాలు ఉన్నప్పటికీని తగిన ప్రచారం లభించుట లేదన్నారు. ప్రభుత్వ బడుల్లో గల సదుపాయాలు అందుతున్న నాణ్యమైన విద్య గురించి యుటియఫ్ ఫ్లెక్సీల ద్వారా విస్తృత ప్రచారం నిర్వహించుటను అభినందించారు. జిల్లా సహాధ్యక్షులు కె.అశోక్ మాట్లాడుతూ బడిఈడు పిల్లలందరిని నాణ్యమైన విద్య, మెరుగైన సదుపాయాలకై మన ప్రభుత్వ బడులలో చేర్పించాలని పిలుపునిచ్చారు. యుటియఫ్ ప్రభుత్వ విద్యారంగ పరిరక్షణకు రాజీలేని పోరు చేస్తుందన్నారు.

ఈ కార్యక్రమంలో యుటియఫ్ నాయకులు పత్రి కిషన్, బి.సాయి తేజ, మడుపతి నరేష్, కాశీనాథ్ జాదవ్, సంజీవయ్య, నర్సయ్య, అనిత, మూడ గోవర్ధన్, యాదగిరి, మారుతి, ధన్‌సింగ్ తదితరులు పాల్గొన్నారు.

## ఖమ్మంలో ఏపిఆర్‌పిఏ జిల్లా మహాసభ




మాట్లాడుతున్న రాష్ట్ర అధ్యక్షుడు సుభాష్ చంద్రబోస్

తమ సమస్యల పరిష్కారం కోసం పింఛనర్లు ఉద్యమించాలని ఆల్ పెన్షనర్స్ అండ్ రిటైర్డ్ పర్సన్స్ అసోసియేషన్ రాష్ట్ర అధ్యక్షుడు సిహెచ్.సుభాష్‌చంద్రబోస్ పిలుపునిచ్చారు. మంగళవారం ఖమ్మం మంచికంటి భవన్‌లోని చీకటి రోశయ్య ప్రాంగణంలో అసోసియేషన్, ద్వితీయ మహాసభలు ఘనంగా నిర్వహించారు. జిల్లాలోని వివిధ ప్రాంతాల నుంచి పింఛనర్లు అధిక సంఖ్యలో హాజరయ్యారు. ఈ మహాసభలకు ముఖ్య అతిథిగా హాజరైన సుభాష్ చంద్రబోస్ మాట్లాడుతూ ఈపిఎస్ 95, కోల్ మైన్స్ స్కీం-98ను వెంటనే సవరించి, ఒకే గ్రేడ్, ఒకే పింఛన్ విధానం అన్ని రంగాలవారికి వర్తింపజేయాలని డిమాండ్ చేశారు. కనీస పింఛన్ ఉద్యోగ కార్మికులందరికీ రూ.6,500గా నిర్ణయించాలని, పింఛన్లను ధరల సూచికతో అనుసంధానం చేయాలని కోరారు. ఆరోగ్య కార్డులు శాశ్వత పద్ధతిలో ఇవ్వాలని, ఈపీఎస్-95, కోల్‌మైన్స్, స్కీం-98వారికి కూడా వర్తింపజేయాలని, చికిత్స పరిమితి ఎత్తివేసి, ఓపీ సౌకర్యం కల్పించాలని కోరారు. అమ్మిన పింఛన్ భాగం 12ఏళ్లకే కలపాలని, కాంట్రిబ్యూటరీ ఫించన్ విధానం రద్దుచేసి పాత విధానాన్ని కొనసాగించాలని సుభాష్ చంద్రబోస్ డిమాండ్ చేశారు. రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఎం.ఎన్.రెడ్డి మాట్లాడుతూ పెన్షనర్ల సమస్యలు పరిష్కరించటంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తీవ్ర నిర్లక్ష్యం ప్రదర్శిస్తున్నాయని విమర్శించారు. 1971లో నిర్ణయించిన కనీస పెన్షన్ రూ.350 ఇప్పటికీ కొనసాగుతోందని ఆవేదన వ్యక్తం చేశారు. మహాసభలో తొలుత జిల్లా ప్రధాన కార్యదర్శి మచ్చా రంగయ్య కార్యదర్శి నివేదిక ప్రవేశపెట్టారు. జిల్లా అధ్యక్షుడు ఆర్.శ్రీరాములు జిల్లాలో అసోసియేషన్ చేసిన కార్యక్రమాల వివరాలను సభలో వివరించారు. రిటైర్డ్ కాలేజి టీచర్స్ అసోసియేషన్ రాష్ట్ర అధ్యక్షులు సిహెచ్.విద్యాసాగర్ పెన్షన్ సంఘాల ఐక్యత, అవశ్యకత అనే అంశంపై ప్రసంగించారు. రాష్ట్ర జెఏసీ కోఛైర్మన్ ఎం.జనార్ధన్‌రెడ్డి పింఛనర్ల హక్కులు, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల దాడిని వివరించారు. రాష్ట్ర డిప్యూటీ జనరల్ సెక్రటరీ టి.సీతారామ్ సంఘ నిర్మాణం గురించి వివరించారు. విశ్రాంత ఉపన్యాసకుడు దొండేటి రామచంద్రయ్య జాతీయ పతాకాన్ని ఆవిష్కరించారు. సభలో బీవీకే జనరల్ మేనేజర్ సిహెచ్.రాజారావు, ఆహ్వాన సంఘం అధ్యక్షుడు ఎం.మధుసూదన్‌రావు, ఆహ్వాన సంఘం గౌరవాధ్యక్షుడు కొలికొండ సూర్యనారాయణ, చీఫ్ పాట్రన్ డాక్టర్ సి.భారవి, ఏఆర్‌కే నేతాజీ, మచ్చా సూర్యనారాయణ, వాసిరెడ్డి వీరభద్రం, ఆర్.సూరయ్య, నల్ల మోతుసత్యనారాయణ తదితరులు మాట్లాడారు.

## మహాసభల ఆహ్వాన సంఘం ముగింపు సమావేశం

13వ రాష్ట్ర మహాసభల ఆహ్వాన సంఘం ముగింపు సమావేశం ది.26.05.2013న తిరుపతి యుటియఫ్ ప్రాంతీయ కార్యాలయంలో జరిగింది. ఆహ్వాన సంఘం ఛైర్మన్ & ఎమ్మెల్సీ వై.శ్రీనివాసులురెడ్డి, యుటియఫ్ రాష్ట్ర గౌరవాధ్యక్షులు ఎన్. నారాయణ, ప్రధాన కార్యదర్శి ఐ.వెంకటేశ్వరరావు హాజరైనారు. మహాసభల విజయవంతానికి పనిచేసిన వివిధ కమిటీలు, నాయకులు, కార్యకర్తలను అభినందించడం జరిగింది. ఈ మహాసభల జయప్రదానికి ఆర్థికంగా సహకరించిన దాతలకు, ఉపాధ్యాయులకు ధన్యవాదాలు తెలియజేసింది. మహాసభల వార్తలను ప్రముఖంగా ప్రచురించిన, ప్రసారం చేసిన ప్రింట్, ఎలక్ట్రానిక్ మీడియాలకు ధన్యవాదాలు తెలిపింది. మహాసభల కోశాధికారి ఎస్.హేమాద్రి ప్రవేశ పెట్టిన ఆర్థిక నివేదికను సమావేశం ఏకగ్రీవంగా ఆమోదించింది. 13వ రాష్ట్ర మహాసభల అతిథులకు, ప్రతినిధులకు, ఉపాధ్యాయులకు ఆవాసం, అతిథ్యం యిచ్చి, మహాసభలను ఘనంగా నిర్వహించిన చిత్తూరు జిల్లా శాఖకు గౌరవాధ్యక్షులు ఎన్.నారాయణ, ప్రధానకార్యదర్శి ఐ.వెంకటేశ్వరరావు ప్రత్యేక అభినందనలు, ధన్యవాదాలు తెలియజేశారు.

## పోడూరులో ప్రతిభా పాటవ పరీక్ష బహుమతి ప్రదానోత్సవం



ప.గో జిల్లా పోడూరు మండలం కవిటం నందు ఎప్రిల్ 10న యుటియఫ్ పోడూరు మండల శాఖ నిర్వహించిన 5వ,10వ తరగతుల ప్రతిభా పాటవ పరీక్షల బహుమతి ప్రదానోత్సవం నిర్వహించబడినది. ఈ సభకు జిల్లా కార్యదర్శి ఎంఎస్ఆర్‌కె ప్రసాద్ అధ్యక్షత వహించి మాట్లాడుతూ గత 13సంవత్సరాలుగా నిర్విరామంగా విద్యార్థులకు ప్రతిభా పరీక్షలు నిర్వహించడం అభినందనీయం అని కొనియాడారు.

జిల్లా కార్యదర్శి జి.వి.వి రామానుజరావు మాట్లాడుతూ, ప్రభుత్వ పాఠశాలలో చదువుతున్న విద్యార్థుల ప్రతిభను వెలికి తీయటానికి సామాజిక స్పృహ కలిగిన సంఘంగా పోడూరు మండల శాఖ కృషి చేస్తుందని అభినందించారు.

ముఖ్య అతిథిగా విచ్చేసిన మండల తహసిల్దార్ వి.స్వామి నాయుడు విజేతలకు బహుమతులు అందజేశారు

జిల్లా సహాయ అధ్యక్షురాలు శ్రీమతి ఎస్.జయప్రభ, జిల్లా ఆడిట్ కమిటీ సభ్యులు ఎస్.ఎస్.వి అవధాని, పులఖండం శ్రీనివాసు మండల శాఖ ప్రధాన కార్యదర్శి కోలాటి విజయకుమార్ తదితరులు సందేశాలిచ్చారు. కె.పెద్దరాజు (కోశాధికారి), కార్యదర్శులు, విద్యార్థుల తల్లిదండ్రులు విద్యార్థులు, ఉపాధ్యాయులు అధిక సంఖ్యలో పాల్గొన్నారు.

## ఉపాధ్యాయ వృత్తికి వన్నె తెచ్చిన చలం



'పాటల పల్లవి' ఆడియో సిడి ఆవిష్కరణ

ఉత్తమ విద్యను అందించడంతోపాటు సామాజిక, సేవా, సాహితీ రంగాల్లో ఉత్తమ సేవలందించడం ద్వారా టివి చలం ఉపాధ్యాయ వృత్తికే వన్నె తెచ్చారని యుటియఫ్ రాష్ట్ర అధ్యక్షులు నాగటి నారాయణ అన్నారు. ఖమ్మం జిల్లా చర్ల మండలంలోని తేగడ ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయుడిగా పనిచేసి పదవీ విరమణ పొందిన టివి చలంకు నందీశ్వరుడు పుష్పావతి కళాభవన్‌లో యుటియఫ్ ఆధ్వర్యంలో అభినందన సన్మాన సభను ఏప్రిల్ 13న నిర్వహించారు. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా హాజరైన నారాయణ మాట్లాడుతూ 33 సంవత్సరాలుగా యుటియఫ్‌లో ఉంటూ చలం ఉపాధ్యాయ లోకానికి చేసిన సేవలు ప్రశంసనీయమన్నారు. ఈ సందర్భంగా టివి చలం ఆలపించిన 'పాటల పల్లవి' ఆడియో సిడిని నారాయణ ఆవిష్కరించారు. అనంతరం పదవీ విరమణ చేసిన టివి చలం, కృష్ణవేణి దంపతులను ఘనంగా సన్మానించారు. ఈ కార్యక్రమంలో యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శి బి.నర్సింహారావు, జిల్లా అధ్యక్షులు ఎం.రాజశేఖర్, కార్యదర్శులు బి.రాజు, అనసూర్య, ప్రధానోపాధ్యాయుల సంఘం జిల్లా అధ్యక్షులు పి.లక్ష్మినారాయణ, చింతూరు తహశీల్దార్ పి.తాతారావు, డిటి నారాయణ, ఎస్‌టివో వి.సత్యనారాయణ, ఎంఇఓ యదు సింహ రాజు, ఎన్.కృష్ణార్జునరావు, సివికె రావు, డి.తాతారావు, తాండ్ర రమణ, ఆనందచారి, పి.నర్సింహారావు, డి.మురళిమోహన్, షాజహాన్ తదితరులు పాల్గొన్నారు.

## బాల లింగయ్య రిటైర్మెంట్

మహబూబ్‌నగర్ జిల్లా కల్వకుర్తి మండలం, మార్చాల ప్రాథమిక పాఠశాల జి.బాలలింగయ్య, ఎల్‌ఎఫ్ఎల్ హెచ్ఎం ఉద్యోగ విరమణ వీడుకోలు సమావేశం ఏప్రిల్ 20న జరిగింది. ఈ కార్యక్రమంలో ముఖ్య అతిథిగా కల్వకుర్తి శాసన సభ్యులు జి.జయపాల్ యాదవ్ పాల్గొన్నారు. ప్రధాన వక్తగా యుటియఫ్ సీనియర్ నాయకులు మోత్కురి నరహరి హాజరై విద్యారంగం, సమస్యలపై ఆసక్తికరంగా మాట్లాడారు. బాలలింగయ్య సమాజసేవను కొనియాడారు. అనంతరం బాల లింగయ్యను ఎమ్మెల్యే మరియు మోత్కురి నరహరి ఘనంగా సన్మానించారు. ఈ కార్యక్రమంలో యుటియఫ్ సీనియర్ నాయకులు ఏ.పి.మల్లయ్య, కల్వకుర్తి అధ్యక్షులు ఏ.వెంకటేశ్వర్లు, కార్యదర్శి హెచ్. బిక్షం, బ్రహ్మయ్య తదితరులు పాల్గొన్నారు.

## రమేష్ చంద్ర పట్నాయక్‌కు బంగారు పతకం




విజయనగరం జిల్లా ఆడిట్ కమిటీ కన్వీనర్ జె.రమేష్‌చంద్ర పట్నాయక్‌కు మాస్టర్ ఆఫ్ ఎడ్యుకేషన్ (యం.ఇడి)లో బంగారు పతకం లభించింది. డా॥ బి.ఆర్.అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయంలో ఏప్రిల్ 22న జరిగిన స్నాతకోత్సవంలో 2010-2012 విద్యా సంవత్సరాలకు సంబంధించి ఎంఇడిలో బంగారు పతకాన్ని ప్లానింగ్ కమీషన్ సభ్యులు డాక్టర్ నరేంద్ర జాదవ్, యూనివర్సిటీ ఉపకులపతి డాక్టర్ పి.ప్రకాష్‌ల చేతుల మీదుగా తీసుకున్నారు. 2010 జూలైలో జరిగిన ఎంఇడి ప్రవేశ పరీక్షలో సైతం రాష్ట్ర స్థాయిలో ప్రథమ ర్యాంకు సాధించారు. రమేష్ సాధించిన విజయం పట్ల యుటియఫ్ వియజనగరం జిల్లా శాఖ అభినందనలు తెలిపింది.

## ప్రత్తిపాడులో కుటుంబ సంక్షేమ పథకం ఆవిర్భావదినోత్సవం

తూ॥గో॥ జిల్లా ప్రత్తిపాడు నందు ఏప్రిల్ 1న మండల యుటియఫ్ అధ్యక్షులు వెంకట్రావు అధ్యక్షతన "కుటుంబ సంక్షేమ పథకం ఆవిర్భావ దినోత్సం, ఏవిఎస్ మరియు విఎస్ఆర్‌ల స్మారక సభలు నిర్వహించారు. కుటుంబ సంక్షేమ పథకం జిల్లా డైరెక్టరు ఐ.ప్రసాదరావు మాట్లాడుతూ ఈ జిల్లాలో కుటుంబ సంక్షేమ పథకం ప్రారంభమై నేటికి 18సం॥ నిండిందన్నారు. అప్పారి వెంకటస్వామిగారి, వి.సూర్యనారాయణ రాజుగారి ఫోటోలకు బి.ఎల్.రావు, ఐ.ప్రసాదరావులు పూలదండలతో నివాళు లర్పించారు. జిల్లా కుటుంబ సంక్షేమ ప్రధాన కార్యదర్శి ఎస్.ఎస్.వి.చలపతి మండల యుటియఫ్ ప్రధాన కార్యదర్శి రాంబాబు, కార్యకర్తలు రాజబాబు, రామ లింగేశ్వరుడు, వీరబాబు, సిహెచ్. సత్యనారాయణ, ఎస్.వి.సూర్య నారాయణ, సుమారు 60మంది ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

## జగ్గంపేటలో కుటుంబ సంక్షేమ పథకం ఆవిర్భావ దినోత్సం

తూర్పుగోదావరి జిల్లా జగ్గంపేటలో యుటియఫ్ కుటుంబ సంక్షేమ పథకం ఆవిర్భావ దినోత్సవాన్ని ఏప్రిల్ 1వ తేదీన మండల శాఖ ప్రధాన కార్యదర్శి యం.మల్లేశ్వరరావు, అధ్యక్షతన నిర్వహించారు. రాష్ట్ర కార్యవర్గ సభ్యులు తోలేటి సూర్యనారాయణ మాట్లాడుతూ అప్పారి వెంకటస్వామి ఆలోచనలకనుగుణంగా ఈ జిల్లాలో 01.04.1995న, ఈ పథకం ప్రారంభించబడిందన్నారు. ఈ కార్యక్రమంలో యుటియఫ్ జిల్లా కార్యదర్శి పల్లపాటి నాగేశ్వరరావు కుటుంబ సంక్షేమ సంఘ బాధ్యులు ఎం.వి.సాయిరాం, జెవివి జిల్లా కార్యదర్శి జివిఎస్ హెచ్‌పి వర్మ, సీనియర్ ఉపాధ్యాయులు సిహెచ్.బి.శాస్త్రి, యుటియఫ్ నాయకులు జి.రామారావు పవన్ శర్మ, చట్టయ్యమ్మ, వై.ధర్మరాజు డి.నూకరాజు గౌ॥అధ్యక్షులు ఎ.వీరబాబు, మహేష్, వినయ్, విజయలక్ష్మీ, కె.సూర్యనారాయణ మరియు ఉపాధ్యాయులు పాల్గొన్నారు.



రూ.18,030/- మూలవేతనం కలిగిన ఉద్యోగులకు కారు కొనుగోలు అడ్వాన్స్ పొందుటకు అర్హత కల్పించిన ఉత్తర్వులు

**GOVERNMENT OF ANDHRA PRADESH**

**ABSTRACT**

Loans & Advances – Admissibility in Revised Pay Scales, 2010 – Motor Car advance – Basic Pay for eligibility – Revised - Orders – Issued.

**FINANCE (A&L) DEPARTMENT**

**G.O.Ms.No. 112** **Dt: 10-05-2013**

**Read the following:**

1. G.O.Ms.No. 175, Finance (A&L) Deptt, dt.15-5-2010.
2. U.O.Note.No. 1324-A/16/PC/2013, Fin. (PC) Department, Dt.18-04-2013.

***

**ORDER:**

In the Government Order 1st read above, Government have fixed among others the basic pay for eligibility for sanction of Motor Car Advance as Rs. 27,700/- On the demands of the Employees Association, Government examined the issue for reduction eligibility of the basic pay and decided to reduce the basic pay for eligibility of Motor Car Advance from Rs. 27,700/- to Rs. 18,030/-.

Government therefore in modification of the existing orders in G.O. 1st read above, governing sanction of Motor Car Advance to Government employees hereby fix the eligibility of the basic pay for availing the loan **"from Rs. 27,700/- to Rs. 18,030/-."**.

All other conditions governing the sanction of the above advance under the existing Rules/Orders will continue.

These orders shall come into force with effect from the date of issue of this G.O.

**(BY ORDER AND IN THE NAME OF THE GOVERNOR OF A.P.)**

**Dr. D. SAMBASIVA RAO**

**PRINCIPAL SECRETARY TO GOVERNMENT (FP)**

***

ఉద్యోగుల బదిలీలపై నిషేధం విధించిన ఉత్తర్వులు

**GOVERNMENT OF ANDHRA PRADESH**

**ABSTRACT**

PUBLIC SERVICES – Transfers and postings of employees – Ban on transfer of employees–Orders – Issued.

**FINANCE (DCM-III) DEPARTMENT**

**G.O.Ms.No. 119** **Dated:17.05.2013**

**Read the following:-**

G.O.Ms.No.100, Fin (DCM-III) Dept, dt.22-04-2013.

***

**ORDER**

In the reference read above, orders were issued relaxing the ban on transfers for the period from 25-04-2013 to 15-05-2013 subject to following certain conditions laid down therein.

2. Government after careful consideration hereby order a ban on all transfers w.e.f.**16.05.2013** except in respect of the following cases:
   i) Posting orders to the employees on account of promotion shall be issued to the clear existing vacancies without shifting any other employees.
   ii) Posting orders to the employees due to disbandment of posts, reversions, repatriations, deputations (on Foreign Service only), disciplinary proceedings shall be issued in clear existing vacancies without shifting other employees.
   iii) The vacancy arising out of leave up to a period of six (6) months (*) shall not be filled in by Transfer. Posting orders to the employees on return from long leave of Six months and above shall be issued in clear existing vacancies without shifting other employees.
3. The appointing authority is competent to issue posting orders in respect of the cases referred at Para 2 above, without reference to Finance Department.
4. It is further ordered that no relaxation proposals shall be entertained by any department for a period of six months commencing from 16-05-2013. Thereafter, the Special Chief Secretaries/Principal Secretaries/Secretaries will review department wise, quarterly, the number of relaxations given within their departments and submit the same to Chief Secretary/Chief Minister for information.

***(*) The maximum period of Earned Leave that can be availed by a Government Employee at a time vide G.O.Ms.No.153, Fin (FR.I) Dept, dt.04-05-2010.***

5. In respect of the existing vacancies to be filled for administrative efficiency, these shall be filled with persons who have completed one year of active service at present station duly submitting proper justification of the proposal for obtaining the concurrence of Finance Department. The administrative departments are advised not to entertain any proposals of transfer in relaxation of these Ban orders.
6. It is further ordered that the orders issued vide G.O.Ms.No.7, Fin (DCM-III) Dept, dt.24.01.2011 shall continue to be in force until further orders.
7. The Director of Treasuries and Accounts, A.P., Hyderabad/Pay and Accounts Officer, Hyderabad / Director of Works &Accounts, A.P Hyderabad shall not admit the pay bills of the employees whose transfers are considered in deviation of the above orders.
8. All the Departments of Secretariat and Heads of Departments shall follow the above orders scrupulously.
9. This order is available in the internet and can be accessed at the address http://www.goir.ap.gov.in and http://www.apfinance.ap.gov.in

**(BY ORDER AND IN THE NAME OF THE GOVERNOR OF A.P.)**

**PUSHPA SUBRAHMANYAM**

PRINCIPAL SECRETARY TO GOVERNMENT (IF)

***

మానవతా దృక్పథంతో అభియోగాలు లేదా జరిమానాలు ఉప సంహరించబడిన సందర్భంలో పదోన్నతులను ప్రాస్పెక్టివ్‌గా మాత్రమే యివ్వాలని ఉత్తర్వులు

**GOVERNMENT OF ANDHRA PRADESH**
**ABSTRACT**

PUBLIC SERVICES – State and Subordinate Services - Promotion/ Appointment of employees to higher posts in respect of the cases, where charges were dropped or penalty orders are modified etc., - Further Orders – Issued.

**GENERAL ADMINISTRATION (SER.C) DEPARTMENT**

**G.O.Ms.No. 331 Dated:04.05.2013**

**Read the following:**

1) G.O.Ms.No.424, G.A.(Ser.C) Dept., Dt. 25.05.1976.
2) G.O.Ms.No.187, G.A.(Ser.B) Dept., Dt.25.04.1985.
3) G.O.Ms.No.34, G A. (DPC.I) Dept., Dt.24.01.1989.
4) Circular Memo No.60897/Ser.C/99, G.A.(Ser.C) Dept., Dt.12.11.1999.

****

**ORDER**:

In the G.O first read above, orders were issued, among others, prescribing the procedure to be followed while considering the claims for promotion of the Officers who are facing enquiry in any departmental proceedings or before a criminal court or whose conduct is under investigation and against whom Departmental proceedings or criminal prosecution is about to be instituted.

2. In the G.O. second read above, orders were issued reconstituting the Departmental Promotion Committee's with revised guidelines to determine the eligibility of an employee for consideration for promotion. As per Para 11 of said G.O., the name of the employee, who is undergoing punishment, should not be recommended for promotion. Further, as per para-13(a) of the said G.O., read with G.O.Ms. No.34, General Administration (DPC.I) Department, dt.24-1-1989, the case of the officer where the penalty imposed has been revoked after the Departmental Promotion Committee had considered his case should again be placed before the Departmental Promotion Committee for review.

3. In the Circular Memo fourth read above, certain instructions were issued to the effect, that the disciplinary proceedings can not be deemed to have been concluded unless they end with one of the penalties mentioned under CCA Rules or clearly state the fact that the delinquent officer is exonerated and charges are dropped. When words like "warning", or "let off", or "to be more careful in future" etc., are used in final order, it is to be construed that the charges and the guilt of the officer have been proved, but a lenient view is taken and no punishment is awarded. Such action will not be in accordance with the provisions of the Andhra Pradesh Civil Services (Classification, Control and Appeal) Rules, 1991 and it was requested to keep the above in view while issuing final orders.

4. In spite of the aforesaid orders / instructions, it has come to the notice of the Government that in several cases, the original order of penalty is being modified in appeal or revision petition by the authorities concerned after a lapse of considerable time i.e., after more than three years and in certain cases, even after ten years and also after retirement of the employee on humanitarian grounds. Further, in certain cases, charges are being dropped on humanitarian grounds, taking a lenient view etc., instead of the merits of the case. In criminal cases also, the delinquent officers are being acquitted by the Courts going benefit of doubt. As such, they are claiming all the consequential benefits with retrospective effect by quoting the aforesaid GOs/ Circular Memorandums, which lead to additional burden on State Exchequer and also resulting in disturbing the settled seniority, besides legal complications.

5. In view of the aforesaid circumstances, the Government after careful examination of the matter, issue further orders that promotions shall be considered with prospective effect only in subsequent panel years duly placing the matter before the Departmental Promotion Committee/ Screening Committee afresh in respect of the cases where;

(i) Charges were dropped using the words such as let off, warning, to be more careful in future, on humanitarian grounds, on benefit of doubt etc.,
(ii) Original order of penalty was modified on appeal or revision, after elapse of stipulated time (or) on humanitarian grounds (or) due to retirement etc.,
(iii) The individual was acquitted by courts on benefit of doubt in criminal cases.

6. All the Departments of Secretariat, Heads of Departments and District Collectors shall follow the above instructions scrupulously and bring it to the notice of all the concerned.

**B.VENKATESWARA RAO**
**SECRETARY TO GOVERNEMTN (SER & HRM)**

***

**2013-14 సం॥కు జిపిఎఫ్ వడ్డీ రేటు 8.7%గా నిర్ణయించిన ఉత్తర్వులు**

**GOVERNMENT OF ANDHRA PRADESH**
**ABSTRACT**

Provident Fund – Rate of interest for the Financial Year 2013-14 on the accumulations on the credit of subscribers in the General Provident Fund and other similar funds until further orders – Issued.

**FINANCE (PEN.II) DEPARTMENT**

**G.O.Rt.No. 2142 Dated: 30-04-2013**

**Read the following:-**

1. G.O.Ms.No.703, Finance (Pen.II) Dept, dt: 19/7/2002.
2. GOI, resolution No.F.No. 5 (1)-B (PD)/2009, Ministry of Finance and Company Affairs (Department of Economic Affairs) dt:15/10/2009.
3. Cir.Memo.33285/29/A2/Pen.II/2009, dt:2/12/2009.
4. GOI, resolution No.F.No. 5 (1)-B (PD)/2011, Ministry of Finance and Company Affairs (Department of Economic Affairs) dt:19/3/2012.
5. Dy. Accountant General (Funds), O/o the Principal Accountant General (A&E), A.P., Hyderabad FM/GI.II/ 9-3/2012-13/299, dated 3-5-2012
6. G.O.Rt.No.2425, Finance (Pen.II) Deptt dt: 10-5-2012.
7. GOI, resolution No.F.No. 5 (1)-B(PD)/2012 Ministry of Finance and Company Affairs (Department of Economic Affairs) dt:22/5/2012.

